# ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
# 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

## జండూ పంచారిష్ట

### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.

క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!




## జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*



450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది.

CLARION/B/ZP/20/173 TEL





# 'పరాజితుడు' పై సమీక్షలు

మే నెల 'చతుర'లో ప్రచురితమైన భమిడి వెంకటేశ్వర్లుగారి నవల 'పరాజితుడు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## అందరూ చదువతగ్గ నవల

(ప్రథమ బహుమతి రు.100/- పొందిన సమీక్ష).

'పరాజితుడు' ఈనాడొస్తున్న సాధారణ నవలలకు భిన్నంగా వుంది: మధ్య తరగతి మహిళ ప్రదర్శించే అభిజాత్యం వల్ల కుటుంబంలో జరిగే అనర్థాన్ని అశాంతుల్ని తెలుపుతుంది యీ నవల.

నవలలోని రామారావు రావిశాస్త్రి గారి "అల్పజీవి"లోని సుబ్బయ్యను గుర్తుకు తెస్తాడు. అలాగే గోపీచంద్‌గారి 'అసమర్థుని జీవయాత్ర' గుర్తొస్తుంది.

'రామారావు నిద్రలేచేసరికి బాగా ఆలస్యమయింది'. ఇది నవలలోని తొలి వాక్యం. రామారావుకు సకాలంలో నిద్రపోవటం, సకాలంలో నిద్రలేవటం అనే కనీస సుఖాలు కూడా కరవైనాయని తెలుస్తుంది. అతను సకాలంలో నిద్రపోవాలన్నా అతనికి నిద్రరాదు. మనశ్శాంతి కరువు. అందుకు కారణం రామారావు భార్య.

మన చుట్టూ ఎందరో రామారావులు వున్నారు. "మీరు నోరు మూసుకొని కూర్చోండి. నాకు మీకంటే బాగా తెలుసు" అని రామారావును భార్య తరచూ నోరుమూయిస్తుంది. ఇటువంటి ఇల్లాళ్లకు కూడా మనసమాజంలో లోటులేదు.

వస్తువుల అవసరం, ఉపయోగం ఆలోచించకుండా గొప్పకోసం కొని వాటిని భద్రంగా దాచి గుడ్డపెట్టి తుడుస్తూ మురిసిపోవటం, ఎదుటివారిని ఇరకాటంలో పెట్టడం కొందరాడవాళ్ళ స్వభావం అని చెప్పి రచయిత మన చేత 'అవును నిజం' అనిపిస్తాడు. రచన సరళంగా సాగింది.

మొగుడు పెళ్లాన్ని వేధించి సాధించి హింసిస్తే అది పత్రికల్లో వార్తగా వస్తుంది. కానీ పెళ్లాలు మొగుళ్ళని ఏడిపించుకు తింటే నలుగురు నవ్వుతారు... కొందరు నమ్మరు. ఎందుకంటే ఇది పురుషాధిక్య సమాజం. అటువంటి మొగుళ్ళు పెళ్లాలకు లొంగిపోతారు. ఇది ఈ నవల మనకు తెలియచేసే నిజం.

"అతని మొర ఆలకించే కాలపురుషుడు ఎక్కడున్నాడో" అంటూ రచయిత నవలను ముగిస్తాడు. మధ్య తరగతి కుటుంబాలలో తమ సంసారాల్ని చక్కదిద్దుకోవటం ఆలుమగల చేతుల్లో లేనట్లు, కాలపురుషుడికి ఆ బాధ్యతను అంటగట్టుతూ నవలను ముగించటం బాగాలేదు.

భార్యల దుబారాఖర్చు, భర్తల అసమర్థత, కుటుంబాన్ని నరకంగా చేస్తాయని విప్పిచెప్పిన నవలకు ముగింపు సరిగాలేకపోవడం చిన్నలోటు అయినా ఇది అందరూ చదవతగ్గ ఆరోగ్యకరమైన నవల.

— టి.రంగప్ప తిరుపతి

## నిరాశ కలిగించింది

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

'పరాజితుడు' నవల పేరుకు తగ్గట్టుగానే ఉంది. రచయిత రామారావు పాత్రను అన్నివిధాల పరాజితుడుగానే తీర్చిదిద్దారు. తన పెళ్ళి విషయంలో అనుకొన్న కళ్యాణిని చేసుకోలేకపోతాడు. ఆఫీస్‌లో తన క్రింది ఉద్యోగులను అదుపులో పెట్టలేకపోయాడు. తన కూతురు పెళ్ళి విషయంలో భార్య పంతమే నెగ్గుతుంది. అరుణకు తన ఇంట్లో ఆశ్రయం ఇవ్వడానికి భార్యకు భయపడి వెనుకాడుతాడు. ఉద్యోగ విషయంలో కూడా మొదటినుండీ చివరి వరకూ ఎదుగూ బొదుగూ ఉండదు. చివరికి తన చావు విషయంలో కూడా పరాజితుడుగానే మిగిలిపోయాడు.

అన్నపూర్ణ పాత్రను మాత్రం చాలా సహజంగా తీర్చిదిద్దారు. ఇల్లాలు భర్తను అర్థంచేసుకోకుండా ప్రవర్తిస్తే ఆ ఇల్లు ఎంత నరకంగా మారేదీ, ఆ ఇంటి యజమానికి ఎంత మనస్తాపాన్ని కలిగించేదీ చక్కగా వివరించారు.

నవలలో నేటి వివాహ, విద్యా వ్యవస్థలమీద ఓ చెణుకు విసిరారు. ఇంటర్‌మీడియట్ చదివిన అరుణకు సైన్ చేయడమంటే అర్థం కాకపోవడం ఆశ్చర్యం!

నవల చివర్లో అన్నపూర్ణ ప్రవర్తనను మార్చే ప్రయత్నం చేశారుకానీ విజయం సాధించలేదు. మొత్తానికి నవలలోని రామారావు పాత్ర నిరాశ కలిగించిందేగానీ ఏమాత్రం సంతోషాన్నివ్వలేదు.

**— ఎ.వెంకటేశ్వరరావు,విశాఖపట్నం**

## ఏమిటి లాభం?

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

ఈనవల ఉద్దేశ్యం సామాన్యుని జీవితాన్ని సజీవ చిత్రణ చేయటమే అయితే రచయిత కొంతవరకు సఫలీకృతుడయినట్లే, కానీ దీనివల్ల ఏదైనా ప్రయోజనం సిద్ధించిందా? అన్నది సందేహమే!

రామారావులా ప్రతి విషయంలోనూ అవజయం చవిచూసేవారు ఈ నవల చదివితే కాస్తా సాంత్వన పొందుతారేమో! కాన్వెంట్ ప్రహసనాలు, వేస్ట్ పేపర్లు, ఖాళీ డబ్బాల ఆదాలు, డ్రైక్లీనింగ్ అనుభవాలూ, గ్రేట్ ఎక్స్‌పో మోసాలు దాదాపు ప్రతివారికీ అనుభవం లోకి వచ్చేవే. రచయిత రామారావు జీవితాన్ని మరీ కష్టాలపుట్టగా చిత్రీకరించదలచుకున్నారేమోననిపిస్తుంది. కష్టం, సుఖం మనిషి మానసిక స్థితిమీద ఆధారపడి ఉంటుంది. రామారావు పాత్ర ప్రతి చిన్న విషయాన్నీ భూతద్దంలో చూసి దడుచుకొనే వ్యక్తిత్వంగల మనిషిలా ఉంది. ముఖ్యంగా జ్యోతిమ్మని దగ్గరకు వెళ్లటం; పలాయన వాదం పఠించేవాళ్లు చేసే పని. ధైర్యంగా పరిస్థితుల్ని ఎదుర్కొనేవారికి అలాంటి ఆలోచన కూడా రాదేమో!

అచ్యుత రామయ్య పాత్రలో ఈనాటి సగటు, తెలివిగల, పిసినారి మామగార్ల మనస్తత్వాన్ని చక్కగా చూపించగలిగారు.

చివర్లో కళ్యాణిని తీసుకు వస్తానని అన్నపూర్ణ రామారావుకు చెప్పి అలాకాక ఊరికి వెళ్లటం, కుక్క తోక వంకర సామెతలా ఉంది. రచయిత అన్నపూర్ణను ఆదర్శవంతంగా ప్రవర్తింప జేయాలనుకొని అంతలోనే ఆపాత్ర స్వభావాన్ని గుర్తు చేసుకొని అర్థాంతరంగా ముగించారేమోననిపిస్తుంది.

సింధువులాంటి ప్రపంచంలో రామారావులాంటివాళ్లు ఓ బిందువు మాత్రమే. జీవితం... కాలం ముగింపులేని కథలు. రామారావు, తరువాత అతని కూతురు, ఆ తరువాత ఆమె పిల్లలు... ఇలా కాలం దొర్లిపోతూనే ఉంటుంది. జననం...గమనం...మరణం- అతి సహజమైన విషయాలు. బలవంతంగా చనిపోవడం, మరణం కోసం ఎదురు చూడటం అర్థం లేని పనులు.

రామారావులాంటి భర్తలు, అన్నపూర్ణలాంటి భార్యలు, కళ్యాణిలాంటి అభాగినులు ఎంతో మంది ఉన్నా పరిష్కారం సూచించలేకపోతే వారి జీవితాల్ని కథలుగా, నవలలుగా రాసుకుంటూ పోవడంవల్ల ఏమిటి లాభం?

**— జి.ఆర్. భాస్కరబాబు,హైదరాబాద్**



## పాపం! పరాజితుడు!!

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**మే** నెల 'చతుర' నవల "పరాజితుడు" మధ్య తరగతి మానవుడి మానసిక సంఘర్ష ణను 70 యం.యం.లో దర్శింపజేసింది. కథానాయకుడు రామారావు లాంటివారు మన సమాజంలో ఎక్కడపడితే అక్కడ కనపడ్తూ వుంటారు. నిజం చెప్పాలంటే ప్రతి మధ్యతర గతి వ్యక్తీ ఎప్పుడో ఒకప్పుడు రామారావు అవతారం ఎత్తాల్సే వుంటుంది.

అయితే ఈ కథానాయకునిలో ఎన్ని మంచి లక్షణాలున్నాయో, అన్ని బలహీనతలూ వున్నాయి. దాంతో ఆ పాత్రయొక్క వుదాత్తత, హుందాతనం దెబ్బతిన్నాయి.

'అన్నపూర్ణ' ఇరుగు పొరుగు మొగవాళ్ల గురించి చెబుతున్నప్పుడు వాళ్లను గురించి రామారావు చేసిన వ్యాఖ్యలు- అతని చీప్ మెంటాలిటీని తెలియ జేస్తున్నాయి. ఉదాహర ణకు "నువ్వు చెప్పే వాళ్ళు క్లబ్బుల్లో పేకాడి వందలు తగలేస్తారు. ...రేసుపుస్తకాలతో రోడ్ల మీద పడ్తారు. వాటం వున్న ఆడది కనపడితే రుచి చూడందే వదలరు" లాంటి పరనిందా త్మకమైన మాటలూ, "నేను ఏకపత్నీ వ్రతుణ్ణి కనుక నిన్ను నమ్ముకున్నాను" లాంటి ఆత్మ స్తుతి వాక్యాలు ఆ పాత్ర యిమేజ్‌ను దెబ్బతీ శాయి.

రాజకీయ నాయకుల్ని బండకేసి వుతకందే రచనకు నిండుదనం రాదని నమ్మే చాలా మంది రచయితల్లాగే ఈ రచయితకూడా రామారావు ద్వారా వాళ్ల నెత్తిన నాలుగు అక్షింతలు చల్లించారు!

ఇంట్లోనే కాదు, బైటకూడా రామారావు మట్టి తిన్నపామని, ఆఫీసులోని క్లర్కుల నిర్లక్ష్యవైఖరి ద్వారా తేలిపోయింది. భార్యను సరయిన మార్గంలో నడిపించి, పరిస్థితుల్ని చక్కదిద్దగ ల్గే శక్తి వుండి కూడా కిక్కురుమనకుండా కుక్కి నపేనులా పడివుండే ఆ పాత్రపట్ల సానుభూతి బదులు చులకన భావమేర్పడుతుంది.

సందర్భానుసారంగా దోపిడీ సంస్థలుగా మారిన కొన్ని విద్యాలయాల గుట్టురట్టు చే యడం ప్రశంసనీయంగా ఉంది.

మిత్రుడు ప్రకాశరావు ఆత్మహత్య చేసుకున్న ప్పుడు, ఆ కుటుంబాన్ని ఆదుకున్న వైనం- మరో మిత్రుడు మునలయ్య- అందరు వుండి కూడా అనాథశవంగా మారినప్పుడు దహన సంస్కారాలు నిర్వహించడం- రామారావు పరో పకార పరాయణత్వాన్ని చాటుతాయి. "పరహి తార్థ ప్రాపకుల్ సజ్జనుల్" అన్న భర్తృహరిమా టను గుర్తుకు తెస్తాయి.

యాక్సిడెంట్ జరిగినపుడు కూడా స్కూట రిస్టును పల్లెత్తుమాటనక, తిరిగి అతని క్షేమాన్నే కోరుతూ జాగ్రత్తగా వెహికల్స్ నడపాలని సూ చించినపుడు గాంధీగారి శాంతస్వభావం గుర్తు కొస్తుంది. ఏది ఏమైనా ఇది కల్పిత కాకమ్మక థలా కాకుండా వ్యథాభరితయదార్థగాథ అన్పించేలా సహజంగా, సమస్యలతో సతమత మయ్యే ప్రతివ్యక్తీ ఇది తనకథే అనుకొనేలా రాసిన రచయితకు సామాజిక స్పృహకల్గిన రచనలు ప్రచురిస్తూ, సాహిత్యంద్వారా తమ వంతు సమాజసేవచేస్తున్న చతురకు కృతజ్ఞత లు.

—**మహబూబ్ కమల్**, న్యూ పాల్వంచ

## పేరుకు తగ్గ నవల

***(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)***

**భ**మిడి వెంకటేశ్వర్లు గారి నవల పరాజితుడు నామౌచిత్యం ఆపాదించుకొన్నదేగానీ, అందు లోని సమస్యకు పరిష్కారం చూపించడంలో పూర్తిగా విఫలమయింది. ఈ నవల మధ్య తరగతి కుటుంబాల పరిస్థితిని సమగ్ర రూప చిత్రణ కాకపోయినా, పాక్షికంగానైనా వారి ఆర్థిక సాంఘిక సమస్యలను చిత్రీక రించిందని చెప్పాలి. ముఖ్యంగా మధ్య తర గతి గృహిణులు ఫాల్స్ ప్రిస్టేజ్‌కు అన్నపూర్ణ ప్రతిరూపంకాగా, చాలీచాలని జీతాలతో మర్యా దగా బ్రతుకుతున్న మధ్య తరగతి గుమస్తాకు రామారావు అక్షర రూపమయ్యాడు. మధ్య మధ్యలో కథావస్తువుకు ఏమాత్రం

ముఖచిత్రం: **లక్ష్మణ్**

సంబంధంలేని, సమకాలీన సమాజాన్ని పీడిస్తుందని ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాల్లోని అవినీతి గురించి రామారావు అన్నపూర్ణల వాగ్వివాదాల రూపంలో చెప్పించారు. 'లంచగొండి తనం ఇందుగలదందులేదని సందేహము లేదు'. కానీ ఇక్కడ కథావస్తువు మధ్య తరగతి గృహిణుల దుబారాతనం; వారిని వారించుటలో విఫలమవుతున్నా పతిదేవుల అసమర్థతలేగానీ అవినీతికాదు. అంతేకాదు నవల చివరలో సుందరం కథ రామాయణంలో పిడకలవేటలావుంది. మొత్తం మీద రచయిత ఒకకోణం నుంచి మాత్రమే దర్శించి, రెండవ కోణంలో చూడలేక అసంపూర్ణంగా ముగించినాడని భావించాల్సివస్తోంది.

— వనం ఆంజనేయ ప్రసాదు, కోట

## నవలాస్త్రం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**నేటి** నవలా సాహిత్యం చాలావరకూ స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని గురించి, వారు పడే బాధల్ని గురించి వివరిస్తోంది. దీనికి భిన్నంగా, అంటే పురుషుడు కూడా స్త్రీవల్ల వేదనకు గురి అవుతూ సతమతమవుతున్నాడన్న విషయాన్ని తేటతెల్లం చేయడంకోసం రచయిత సంధించి వదిలిన నవలాస్త్రమే 'పరాజితుడు'.

నవలలో రామారావు పడ్డ బాధలు చాలా మంది మగవాళ్ళు అనుభవిస్తూనే ఉన్నారు. కానీ వారు ఆ విషయాన్ని ఒప్పుకోవడానికి సిగ్గుపడటం వల్ల అది బయటికి రావడంలేదు. విపరీతంగా ఖర్చు చేస్తూ, భర్తపడే బాధల్ని గమనించకుండా, తనమాటే సాగాలన్న మనస్తత్వం ఉన్న అన్నపూర్ణతో సర్దుకుపోయే రామారావు పాత్ర భార్యలతో వేధింపబడే భర్తలకు ప్రతీక.

భర్తను వేధించి, పుట్టింటిపై మక్కువతో దుబారా ఖర్చులు చేస్తున్న స్త్రీలకు ఈ నవల ఒక గుణపాఠం.

— బి.కళానాగబాబు, గుంతకల్లు



# చతుర

సంపుటి: 12 జూలై 1989 సంచిక: 6

కన్న తండ్రి పెట్టిన హద్దుల్లో పంజరంలో చిలకలా బ్రతికే ఆమెకు శాంతి సౌఖ్యాలు, ప్రేమానురాగాలు అందినట్లే అంది దూరమయ్యాయి. అయినా కష్టాల ఊబిలో మునిగిపోతున్నానని క్రుంగక ధైర్యంతో పరిస్థితి నెదుర్కొంది. సానుభూతి చూపాల్సిన సమాజం ఆమె బాటలో ముళ్ళే పరిచినా తనుమాత్రం ఎవరినీ ద్వేషించక కర్తవ్యదీక్షాపరాయణురాలై ఉన్నతాదర్శాలతో కన్నబిడ్డను తీర్చిదిద్దింది. తనదధోగతి పాల్చేసినవారిని సైతం మానవతామూర్తులుగా మార్చింది. దశాబ్దం తరువాత భర్త అనేవాడు వచ్చి మళ్లీ ఆమె జీవితంతో ఆటలాడుకునే ప్రయత్నం చేసినపుడు, సమస్యల విషవలయంలో చిక్కుకున్నప్పుడు, కారుచీకట్లు చుట్టిముట్టినప్పుడు ఏ చిరుదివ్వెలు ఆమెకి మార్గం చూపాయి? ఆ మహోన్నత వ్యక్తిత్వం ముందు నిలువలేకపోయినవారూ, ఆమెను నాశనం చేయాలని ప్రయత్నించినవారూ చివరికి ఏమయ్యారు?



పరిణతి చెందిన స్త్రీ మనస్తత్వానికి దర్పణంపడుతూ సహజ సన్నివేశాలతో

అత్యంత ఆసక్తికరంగా **వింజమూరి విజయ శాంభవి**

వెలిగించిన **చిరుదివ్వెలు** ఈనెల 'చతుర' సమర్పిస్తున్న కానుక.



# నిశిదివ్వెలు

—వింజమూరి విజయశాంభవి

"సీతా... నువ్వా?" సంభ్రమంగా అన్నాడతడు.

అతడి కళ్ళల్లో నమ్మశక్యంగాని భావన ఊహించని దృశ్యాన్ని చూసిన సంభ్రమం.

నిశ్శబ్దంగానవ్వి "నేనే" అన్నాను.

అని బావిలో యధావిధిగా నీళ్ళు తోడుకోసాగాను. నాబిందె నిండింది. అప్పటికిగానీ శ్రీకాంత్ ఆశ్చర్యంలోనుండి ఓమాదిరిగా కోలుకోలేకపోయాడు.

"నువ్వింకా ఇక్కడేవున్నావా సీతా?" దాచినా దాగని ఆశ్చర్యం తొంగిచూస్తోందతడి కంఠంలో.

"నువ్విక్కడ ఎలావుండగలుగుతున్నావు సీతా?" అనటంలేదతడు- "ఇంకా ఇక్కడే వున్నావా!" అంటున్నాడు.

మెల్లిగా నవ్వి తలూపాను అవునన్నట్లు.

బిందెని చంకకి ఎత్తుకుని నూతిచప్టామీద నుండి దిగాను.

అతడు నావెనకనే అడుగులేస్తూ "బాగున్నావా సీతా?" అడిగాడు. ఇప్పటికి బాగా తేరుకున్నట్టున్నాడతడు.

మళ్ళీ అలాంటి ప్రశ్నే-'బాగున్నావా సీతా?'

'ఈ లోకుల కాకులమధ్య ఎలా బతగ్గలుగుతున్నావు సీతా?' అని అడగడేం ఇతడు? "బాగున్నాను"!

నువ్వు బాగున్నావా అని అడగలేదు నేను- అతడు కళ్ళకెదురుగా ఒళ్ళుచేసి శారీరకంగా మరింత హుందాగా కనబడుతూంటే!

"చాలామారిపోయావు సీతా" అన్నాడతడు.

నేను ఆగాను! అతడివైపు చూశాను! నన్ను నిలువెల్లా పరికిస్తున్నాయి అతడి చూపులు.

మారడం... అంటే... ? శారీరకంగానా... లేక

"చాలా మారిపోయావు" మళ్ళీ అన్నాడు.

అదే నవ్వుతో "మారనూ... పదేళ్ళయిందిగా చూసి? వయసు మీదపడిందిగా" అన్నాను.

"ప్చ్... అదికాదు నేను చెబుతూంది! అసలు వయసుకి అయిదారేళ్ళు తక్కువగానే కనిపిస్తున్నావు! నీకు ముప్ఫైఏళ్ళవయసంటే అసలు ఎవరూ నమ్మరు! అప్పటికంటే చాలా అందంగా వున్నావు" అన్నాడు.

సమాధానం మళ్ళీ నా నవ్వే.....

"నాగురించి అడగవేం"? హఠాత్తుగా అన్నాడు.

అతణ్ణి గురించి అడగటానికేముందని? నాలా అశోకవనంలో వున్నాడా ఏమన్నానా? నవ్వొచ్చింది నాకు!

కాని అతడి కళ్ళల్లో కుతూహలం... నాలో దిగులూ, బాధ, ఈర్ష్య, కోపంలాంటి భావాల్ని వెదికే ప్రయత్నం...

నాగురించి అతడు తెలుసుకోవడం కాదు...

నేనెలా బతగ్గలుగుతున్నానూ అన్న విషయం తెలుసుకోవటంగాదు...

అతణ్ణి గురించి నేను అడగాలి, అతడి ఉన్నతిని చూసి నేను బాధపడాలి, ఈర్ష్యపడాలి! నేనతణ్ణి తిట్టినా అతడికి సంతోషమే! తనెంతసుఖంగా ఉన్నదీ నాకు తెలియబరచాలన్న తపన...

కానీ, తెలుసుకోవాలన్న తపన నాలోలేదే!

"అసలు నువ్విక్కడ వుంటావని నేను కలలో కూడా అనుకోలేదు! ఎక్కడికైనా వెళ్ళిపోయి వుంటావనుకున్నాను" అన్నాడు.

అతడి మాటల్లోనే అర్థమవుతోంది... ఇప్పుడు ఇక్కడ నన్నుచూసిన ఈక్షణాలదాకా అతడు నాగురించి ఆలోచించలేదని, నన్ను దాదాపు పదేళ్ళ క్రితమే మర్చిపోయాడని! నేను ఇక్కడవుంటానని కలలో కూడా అనుకోలేదుట, మరి!

అయితే ఎక్కడవుంటాననుకున్నాడు?

అసలు వుంటానని అనుకున్నాడా? ఎక్కడికైనా వెళ్ళిపోయివుంటాననుకున్నాడట! ఎక్కడికైనా అంటే...

పైకి కూడా కావచ్చుగా...?

ఇంకా ఈ లోకంలో నేను బతికివుండగలిగినందుకా శ్రీకాంత్ ఇంత ఆశ్చర్యం? అదీ ఇంత నిబ్బరంగా ఆరోగ్యంగా చీకూచింతా లేనట్టు కనిపిస్తూ...

"నువ్వు పాతసీతవేనా?" సంభ్రమంగా అంటున్నాడతడు- "అప్పుడు చాలా నాజూగ్గా వుండేదానివి! ఇప్పుడు కాస్త ఒళ్ళొచ్చింది!




ఇంకా అందంగా తయారయ్యావు...''

అతడు అంత ఉత్సాహంగా మాట్లాడుతున్నది నా భౌతిక సౌందర్యంగురించే. నా మనసుతో అతడికి అవసరంలేదు. అప్పుడూ... ఇప్పుడుకూడా!

''చీకటిపడింది. వస్తాను'' అన్నాను కదులుతూ.

''కాస్సేపాగరాదూ'' అన్నాడతడు ఆత్రతగా.

''వెళ్ళాలి.. వెళుతూ మాట్లాడుకోవచ్చుగా'' అన్నాను ఆగకుండానే.

అతడాగిపోయాడు ''నాక్కాస్తపనుంది. ఓ రైతుని కలవాలి''

నాకు నవ్వొచ్చింది. నాతో మాట్లాడాలన్న కోరిక చాలా గాఢంగా వుందిగానీ నాతో మాట్లాడుతూ కలిసినడిచే ధైర్యంమాత్రం లేదు. ఆ ధైర్యమేవుంటే నాకథ ఇంకోలావుండేది కదూ? లోకమంటే అతడికి భయం. తనని గురించి చులకనగా అనుకుంటారన్న పిరికితనం.

అంతేనా?

ఇంకేమీకాదా?

ఎందుకులేదూ?

సంకుచితత్వం... స్వార్థంకూడా.

అయినా అతడిమీద నాకేం కోపం రాలేదు. ఈ మనుమల్ని నేనెప్పుడో అర్థంచేసుకున్నాను. అతడు నగటుమగాడే, నగటు మనిషే.

''ఏంతమారిపోయావు'' అతడి గొణుగుడు వినిపిస్తూనే వుంది.

''మారకపోతే ఈ ప్రపంచంలో మనిషికి మనుగడలేదు శ్రీకాంత్. నిన్ను గురించి ఆలోచిస్తూ, ఏడుస్తూ కూర్చునిఉంటే ఈనాడిలా నీకళ్ళకి నేను కన్పించేదాన్ని కాదు. నిన్నూ నీలాంటి మనుమలతో నిండివుండే ఈ ప్రపంచాన్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించేకొద్దీ నాలో మార్పువచ్చింది. అందుకే నాకు ఎవరిమీదా ఎలాంటి కోపమూలేదు. నేను క్షమించాల్సినంత తప్పు మీరెవరూ చేశారని కూడా నాకనిపించదు'' వడివడిగా నడుస్తూ అనుకున్నాను నాలో నేను.

''సీతా...''

తలతిప్పిచూశాను.

వినోద్...

మెల్లిగా నవ్వాను.

''ఇంత చీకటిసపడి నీళ్ళకి రాకపోతేనేం?''

మందలింపు.

అతనికి పిచ్చికాకపోతే ఇంకా నాదగ్గ రేంవుందని?

నన్ను ఎవరేం చేయగలరని? చేసినా నాకు వచ్చే నష్టం ఏముందని? ఈ మాత్రానికే భయపడేదాన్నయితే ఇంకా ఈ ఊళ్ళో, ఈ ప్రపంచంలో నేనెలా బతగ్గలిగేదాన్ని వినోద్?

ఎంత అమాయకులు మీరంతా? ప్చ్... నన్నర్థం చేనుకోగలిగిన శక్తి మీకు వుంటే ఎంతబావుండును?

''నీధోరణి నీదే... చెబితే వినిపించుకోవు'' నిష్ఠూరం అతడి కంఠంలో.

నవ్వి ''నాకేం ఫరవాలేదు... వస్తాను'' అంటూ కదిలాను. వెనకనుండి అతడంటున్నాడు ''నీళ్ళకోసం నువ్వురాకపోతే ఏం? ఓ పదిరూపాయలు పారేస్తే ఎవరు తెచ్చిపడెయ్యరు? ఈ నీళ్ళే నీజీవితాన్ని నాశనం చేశాయని నీకు గుర్తుండదేం?''

నేను ఆలోచనలో పడ్డాను. నాజీవితాన్ని ఈ నీళ్ళు నాశనం చేశాయా?

ఏంచేశాయి?

నేను సలక్షణంగా బతికివున్నానే?

ఈ నీళ్ళు లేకపోతే నేను బతగ్గలనా?

నేనే కాదు...ఈవూళ్ళో ఒక్కరైనా బతగ్గలరా?

అసలు నాజీవితం నాశనమైందని వీళ్ళందరూ ఎందుకు అనుకుంటున్నారు?

ఎంత అమాయకులు వీళ్ళు?

నాకు ఈ బావి అన్నా అందులో నీళ్ళుతోడి తెచ్చుకోవడం అన్నా చెప్పలేనంత ఇష్టం అని వీళ్ళేలా అర్థంచేనుకోగలరు? సుఖాల్ని దుఃఖాల్ని నాకు చవిచూపింది ఈ నీళ్ళే! ఈ ప్రపంచాన్ని ప్రేమించగలిగిన అవకాశం ఇచ్చింది ఈ నీళ్ళే!

'మనుషులు అంటే ఏమిటీ?''- అన్నవిషయం నాకు అర్థంకావడానికి కారణం ఈ నీళ్ళే. రోజూ పొద్దున్న ఓ బిందెడూ, సాయంత్రం ఓ బిందెడూ నీళ్ళు స్వయంగా

ఇక్కడికివచ్చి తెచ్చుకోందే నాకు బాగుండదు. ఈ బావితో పరిచయంలేకపోతే నాకు జీవితం పట్ల సరి అయిన అవగాహన ఏర్పడివుండేదికాదు. చాలామామూలుగా బతికివుండేదాన్ని- అందరి స్త్రీల్లా! అది వీళ్ళకి చెప్పినా అర్థంకాదు.

ఊళ్ళోకివచ్చి ఇంటిదగ్గరికి చేరుకుంటూండగా పరుగునవచ్చి గుమ్మంలోనే రెండుకాళ్ళూ వాటేసుకున్నాడు బాబు.

పిచ్చినాగమ్మ, ఇంట్లో అయిదు నిముషాలు అమ్మ కనబడకపోతే విలవిల్లాడిపోతాడే- ఈ సున్నితహృదయం, అమాయకత్వం, ప్రేమ ఈ భావాలన్నీ రేపు పెద్దయ్యాక కూడా ఇలాగే వుంటాయా?

ఉంటే! ఇంకేముంది... మనిషి దేవుడైపోడూ? ఈ మనుషుల బలహీనతల్ని ఓపిగ్గా అర్థంచేసుకుని జాలితో క్షమించాల్సిన అవసరం నాలాంటివాళ్ళకి అసలు రాదు.

బాబు బుంగమూతి పెట్టి "నీళ్ళు తీసుకు రావటం ఎంతసేపేటి?" మారాంచేస్తున్నట్టన్నాడు.

"ఊరి చివరికి వెళ్ళిరావాలిగా నాన్నా. నేను బిందెదింపాల్నా. కాస్త వదులమ్మా" వాడి తల నిమురుతూ అన్నాను.

మరింత గట్టిగా పట్టుబిగిస్తూ "సుధ ఆంటీ వచ్చింది. ఎంతసేపైందో తెలుసా?" అన్నాడు.

"అలాగా?" అంటూండగానే లోపల్నుంచి సుధవచ్చి నాచంకలోని బిందె అందుకుంటూ-"నీ నీళ్ళమోజు పాడుగానూ! అజిత్‌నిలా ఒంటరిగా వదిలి వెళ్ళిపోవడమేనా?" అంది.

"మనిషి ఒంటరితనానికి చిన్నతనంనుండి అలవాటుపడాలి సుధా" అన్నాను ఆమెతో లోపలికి నడుస్తూ.

"నీ వేదాంతం నాకు చెప్పకుబాబూ" చిరాకు పడింది సుధ.

నేను నవ్వాను. తప్పు మాట్లాడలేదు.

"నీ ఈ నవ్వు చూస్తోంటే నాకు చిరాకేస్తూంది" సుధ కోపంగా అంది.

"నవ్వుతూ బతకడం నేర్చుకున్నంతటి అదృష్టవంతుడు ఈ ప్రపంచంలో మరొకడుండదు పిచ్చి సుధా" అన్నాను.

"అవునవును... ఊరంతా నిన్నుచూసి నవ్వినా నవ్వుతూనేవుండు" కోపంగానూ, కాస్తగట్టిగానూ అంది.

"నవ్వి నవ్వి వాళ్ళూరుకుంటారు. నేను చచ్చిపోయేదాకా నవ్వుతూనే వుంటాను. వాళ్ళు అమాయకులు సుధా" అన్నాను.

సుధ బిందెదింపి విసురుగా వెళ్ళి స్టౌమీది కూర దింపి పడేసింది.

"వంటకూడా చేశావా- థేంక్స్" అన్నాను.

"ముందు అజిత్‌కి అన్నంపెట్టి వాణ్ణి నిద్రపుచ్చు. నీతో మాట్లాడాలి" అంది సీరియస్‌గా. సుధ ఎందుకో చాలా కోపంగావుందని నాకు ఇందాకే అర్థమైంది. దానికి కారణం చూచాయగా వూహించగలిగాను కూడా.

"ఊహూఁ! నేనిప్పుడే నిద్రపోను! చదువుకోవాలిగా" సుధ కొంగులాగుతూ మారాంచేస్తున్నట్టన్నాడు అజిత్.

సుధ వాణ్ణి దగ్గరికి లాక్కుని బుగ్గలు ముద్దుపెట్టుకుని "అలాగేకన్నా! నువ్వు భోంచేసి ముందుగదిలో కూర్చుని చదువుకో. నేను,అమ్మ మాట్లాడుకుంటాం" అంది.

ముగ్గురం భోజనాలకి కూర్చుంటుండగా అన్నాను "వాడికితెలీకుండా మాట్లాడుకోవాల్సిన రహస్యాలేమున్నాయ్ సుధా?"

"ఏమీలేవంటావ్?" కోపంగా అంది.

"లేవనే అనుకుంటున్నాను" అన్నాను మెల్లిగా.

అజిత్ నానడుము చుట్టూ చెయ్యివేసి సుధవైపు కోపంగా చూస్తూ "నీతో కటిఫ్ ఆంటీ. అమ్మతో నాకు తెలీని రహస్యాలు మాట్లాడతావా? నాకన్నీ తెలును" అన్నాడు.

"నిన్ను చెడిపేస్తుందిరా మీ అమ్మ. ఎనిమిది తొమ్మిదేళ్ళులేవు, పెద్దమాటలు" అంది. "కాదే సుధా వాడికి మనిషిలా ఈ లోకంలో బతకటం నేర్పడంలో నావంతు ప్రయత్నం నేను చేస్తున్నాను. ఇంకొంతకాలం మాత్రమే. అప్పుడువాడు ఏదారి ఎన్నుకున్నా ఎలాంటి జీవితాన్ని కోరుకున్నా నేను అడ్డుచెప్పను. తల్లిగా నాకనీసపు బాధ్యత ఇది" అన్నాను.

అజిత్ నామాటలు శ్రద్ధగా వింటున్నాడు. సుధఇక ఏమీ మాట్లాడలేదు! సుధ మనసు

లోని ఆరాటం నాకు అర్థమవుతోంది. తననింకా విసిగించడం ఇష్టంలేక ఆ ప్రస్తావన అంత టితో ఆపి భోజనాలు పూర్తయ్యాక అజిత్‌ని ముందు గదిలోకి పంపాను, పుస్తకాలూ పెన్నూ ఇచ్చి.

వాడు సుధవైపు కోపంగాచూస్తూ వెళితే సుధకు నవ్వొచ్చింది వాణ్ణి వెక్కిరించింది కూడా.

"కానీ" అన్నాను కత్తెరా బట్టా తెచ్చి ముందువేసుకుని చాపమీదకూర్చుంటూ. సుధ నా ఎదురుగా మంచంమీద కూర్చుంది. కా సేపు ఏమీ మాట్లాడలేదు. నేనూ మాట్లాడలే దు! ఆ ప్రసక్తి ఎలా ఎత్తాలో అర్థంకాక సతమ తమవుతోంది సుధ.

పిచ్చిసుధ.. ఎలా మొదలుపెట్టినా నేను ఎలా ఈజీగా తీసుకోగలనని తెలిసీ నా మన సు నొప్పించకూడదన్న తపన... నాపట్లవున్న అమృతమైన ప్రేమ... అభిమానం!

అసలు ఒక మనిషిపట్ల ఇంకొక మనిషికి అంత ప్రేమాభిమానాలు ఎందుకేర్పడతాయి?

ఆ మనిషివలన ఏదో లాభం, అవసరం ఏర్పడతాయనో పోనీ అలాంటివి కలుగుతాయన్న ఆశకలిగినప్పుడా?

అదేంకాదు! సుధతో నాకు అలాంటి అవస రాలు కానీ, నాతో ఆమెకి అలాంటి అక్కరలు గానీ ఏమీలేవు!

లేక నాపట్ల జాలిలోనుండి ఆ ప్రేమఉద్భ వించిందా?

అది నిజంకాదు! సుధ ఈ వూరొచ్చేప్పటికి వూరంతా నన్ను అసహ్యించుకుంటోంది! సుధ అప్పటికి ఇంకా చిన్నది. ఆ వయసు మీద మంది మాటల ప్రభావం బాగావుంటుంది. అప్పుడు సుధ నన్ను ఇంకా ద్వేషించాల్సింది. కానీ, కోరికోరి నాతో స్నేహం కల్పుకుంది. నా ఇష్టాఇష్టాలను గురించి ఆలోచించకుండా నాతో బంధాన్ని పెనవేసుకుంది.

అలాంటిది జాలితో ఎందుకవుతుంది? అస లు ఒకరు జాలిపడాల్సిన స్థితిలో నేనులేననీ, ఒకరి దయాధర్మాల్ని ఆశించటంలేదనీ సు ధకు తెలుసు.

మా ఇద్దరిమధ్య ఇంత అభిమానం సఖ్యత నెలకొనడానికి కారణం – సుధ నన్ను అర్థంచే సుకోవటం మూలానా లేక నాలో సుధకు నచ్చిన విశేషాలుండటంవలనా?

ఏదైనాకావచ్చు!

మరిసుధ నాకెందుకు నచ్చింది?

లోకానికి భిన్నంగా నన్ను అభిమానించటం వలనా?

కాదు...ఖచ్చితంగా కానేకాదు! అదేనిజ మైతే ఈ మనుషులందర్నీ నేనుద్వేషించాలి గదా! మరి నేనెవర్నీ ద్వేషించడంలేదే? సు ధతో సమానంగా ఈ ప్రపంచాన్నీ ప్రేమిస్తున్నా ను! కానీ, ఆ ప్రపంచమే నాదగ్గరికి రాదు! అందుకే సుధతో ఏర్పడినంత సఖ్యత నాకు దేంతో ఏర్పడలేదు! కారణం నేనంటే దానికి ఇంకావున్న అసహ్యమో, భయమో, నిరసనో, చిన్నచూపో ఏదయినా కావచ్చు! అన్నీ కలి సివున్నందువల్లా కావచ్చు!

ఈమాట పైకి అంటే సుధ ఉడు క్కుంటుంది. "ఈ సంకుచితత్వపు వెధవలతో నాకు పోలికా? నీకెవరిమీదా కోపం లేదంటు న్నావుగా! అదే నిజమైతే వినోద్‌తో కూడా నాతో వున్నంత స్నేహంగా వుండరాదూ"?

"ఉండటానికి నాకేం అభ్యంతరంలేదు సుధా! అభ్యంతరం ఎందుకుండాలి? అతడు మగాడనా? ఆడ... మగా... ఈతేడాల్ని నేనేనాడో మర్చిపోయాను! ఎవర్నయినా సరే ఒక మని షిగా గుర్తిస్తాను నేను" అంటాను!

"మరింకే అతడితో స్నేహం చెయ్యరాదూ?"

"అతడికే పూర్తి ధైర్యంలేదు?!"

"అతడికి ధైర్యంవుంటే నువ్వు ఎవరికీ భయపడవన్నమాట?"

"ఒకళ్ళకి నేను భయపడటం మానేసి చాలా ఏళ్లయింది సుధా?"

సుధ చాలా ఉక్రోషంగా అంది "నీజీవితాన్ని నాశనంచేసినవాడెంతో నేనూ అంతేన్నమాట నీకు"

సుధ కోపం ఆ కాసేపే! సుధ నన్ను బాగా అర్థంచేసుకోగలదు!

"ఒకరు నాజీవితాన్ని అన్యాయం చెయ్యలే దు! నేను చేసుకోలేదు! అదలా జరగాలని వుంది జరిగిందంతే! అది నాశనం అని నువ్వు




అనుకుంటున్నావు! ఇదొక గొప్ప అనుభవ పాఠం అనినేను అనుకుంటున్నాను! నేను తెలివైనదానినీ బాగా చదువుకున్నదాన్నీ కాదు! నన్ను నువ్వు అర్థంచేసుకో! ఇంతకంటే వివరంగా నేనేంచెప్పలేను'' అన్న మాటలకి సుధ ఎంత ఆరాధనగా చూస్తుందీ అంటే భావావేశంతో ఆమె కళ్లల్లో నీళ్లొస్తాయి.

ఇదీ ఒక బలహీనతకాక మరేమిటి?

ఒక మనిషిని ప్రేమించవచ్చు. అభిమానించవచ్చు! ఇలా కళ్ళనీళ్లు పెట్టుకునేంత వెర్రి ఆరాధనా? నిజంగా ఇలాంటి అనుభూతులు లేకపోతే మనిషి సాఫీగా బతకలేడేమో?

నా ఆలోచనల్ని భగ్నపరుస్తూ "ఆ దుర్మార్గుడు ఈ వూళ్లోకే వచ్చాడట తెలుసా?'' అంది సుధ.

తలెత్తి చూశాను! ఆ మొహం చూస్తుంటేనే తెలుస్తోంది ఎంత కష్టంమీద సుధ ఆ మాటలు పలకగలిగిందీ.

"ఎవరూ... శ్రీకాంతా?'' నెమ్మదిగా అడిగాను.

సుధ తన పక్కన తేలో, పామో పడ్డంతగా ఉలిక్కిపడి చూసింది. వేగంగా రంగులు మారాయి ఆమె మొహంలో.

"నీకెలా తెలుసు?'' ఆశ్చర్యంగా అడిగింది.

"నిన్న నువ్వు వూళ్ళో లేవుగా! వుండివుంటే నీకూ నిన్ననే తెలిసివుండేది. అజిత్ చెప్పాడు'' అన్నాను.

బిత్తరపోయి చూసింది సుధ.

"అజిత్ స్కూలు నుంచి వస్తోంటే ఎవరో చెప్పారట. నాతో నిన్న సాయంత్రం చెప్పాడు'' మామూలుగా చెప్పాను.

ఇక సుధ మాట్లాడలేదు. షాక్ తిన్నట్టయిన ఆ అమ్మాయి అయిదు నిముషాలపాటు కోలుకోలేకపోయింది. సుధని చూస్తోంటే చాలా జాలిగా అనిపించింది నాకు. మనిషి ఈ ప్రపంచంలో ఎంత తెలుసుకున్నా ఇంకాతెలుసుకోవాల్సిన దాంట్లో తెలుసుకోగలిగింది అణువంత మాత్రమే.

చాలాసేపటికి తేరుకుని- "ఎవరు చెప్పారట అక్కా?'' అని అడిగింది.

"పిచ్చి చెల్లీ, అజిత్ ఫిఫ్త్‌క్లాస్ చదివే తొమ్మిదేళ్ల కుర్రాడని నువ్వు మర్చిపోతే ఎలా చెప్పు?'' అనునయంగా అన్నాను.

"వూళ్ళో పెద్ద పిల్లలు చెప్పారటనా?'' అవాక్కుగా అడిగింది.

"అవును''

"ఏమని?''

"కొత్తగా వూళ్ళోకి వచ్చిన శ్రీకాంత్ అనే పెద్దమనిషి మీ నాన్న అని''

"అక్కా'' సుధ బేలగా అంటూ వచ్చి నాపక్కన కూర్చుంది. "అజిత్ బాధపడలేదూ?''

"ఎందుకూ బాధ? వాడికి నేనేంచెప్పకుండా దాచానని? నాకంటే ముందే లోకం వాడికి అన్నీచెప్పాలని తాపత్రయపడుతుందని నాకు తెలుసు. ఇద్దరమూ కలిసి అన్నీ వాడికి చెప్పాము. తల్లిని కాబట్టేమో నా మాటలే విశ్వసించాడు''

"వినోద్ గురించి?'' సుధ అడగలేక అడిగింది.

"ఒక్క శ్రీకాంత్ గురించీ, వినోద్ గురించే కాదు, హరీంద్రగురించీ, గోపాలరావు గురించీ, నాగరాజు గురించీ... ఇలా ప్రతి ఒక్కరిగురించీ చెప్పాను. నేనేమీ దాచలేదు సుధా''

"వాడు అర్థం చేసుకున్నాడా అక్కా?''

"ఆ విషయం నేను పూర్తిగా చెప్పలేను సుధా. చాలా తేలికభాషలో చెబుతూ వచ్చాను. నీకు తెలీదేమో ఈ విషయాల్ని గురించి బయట ఎవరైనా ఎత్తినా, వాడు తగువిధంగా సమాధానం చెబుతాడని నేను విన్నాను. బయట విన్న మాటలు నాతో చెప్పడు. నువ్వెప్పుడూ వాడి దగ్గర ఈ ప్రసక్తి తీసుకురాలేదేమో. అందుకని దాన్ని గురించి మాట్లాడి వుండడు''

"మరి... మరి... వీళ్ళందరిమీదా వాడికి అసహ్యంలేదూ?''

నేను నవ్వాను. "ఎలా వుంటుందే? వాడు సీత పెంపకంలో పెరిగాడని మర్చిపోతే ఎలా?'' అన్నాను.

"అక్కా! నువ్వు దేవతవి'' భావోద్వేగంతో సుధ కంఠం పూడిపోయింది.

"కాదు... మనిషిని! మామూలు మనిషిని!

మానవత్వం అంటే ఏమిటో నీకు చాలాసార్లు చెప్పాను. మన బతుకును మనం నిజాయితీగా బతుకుతూ, సాటి మనిషికి ఎలాంటి ఇబ్బందీ కలగనీకుండా బతకడమే. నేనలా బతగ్గలుగుతున్నాను కాబట్టే అంత ధైర్యంగా చెప్పగలుగుతున్నాను''

''అయితే మేమూ... అదే... ఈ మనుమలంతా?'' సుధ అడిగింది.

''అమాయకత్వంతోనో... మూర్ఖత్వంతోనో బతుకుతున్నారు. ఒక్కోసారి బాధ వేస్తుంది... ఈ సంకుచితత్వాలని తొలగించుకోగలిగితే పరిస్థితుల్ని వాటి స్వరూపస్వభావాల్ని విశ్లేషించి, ఆలోచించగలిగితే చాలా త్వరగా అందరూ అసలైన మనుమలైపోతారు. మానవత్వం అన్న మాటకి సరైన నిర్వచనంలా తయారవుతారు అనుకుంటూ వుంటానునేను. ప్చ్... ఎప్పటికి వీళ్ళు ఆ స్థాయికి రాగలరో...?''

''సీతకి ఎదురైన అనుభవాలలాంటివి వాళ్ళకీ ఎదురైననాడు'' అంది సుధ చప్పున.

''నీమొహం! నాకంటే వెయ్యి రెట్లు కష్టాలు ఎక్కువగా అనుభవించినవాళ్ళున్నారు. నా దృష్టితో ఆలోచిస్తే నేనేం పెద్దగా కష్టపడలేదు'' అన్నాను.

''అవును'' ఆవేశంగా అంది సుధ. ''నువ్వేం కష్టపడ్డావు? మనిషి మనిషీ నిన్ను తమ స్వార్థానికి బలిచేశారు. నిన్ను ఒంటరిదాన్ని చేసి ఫుట్‌బాల్ ఆడారు. కాని, నువ్వే మహాత్మురాలివైపోయావు. కాటెయ్య వచ్చిన పాముని కూడా అర్థం చేసుకోవాలంటావు?''

''నిజమే... అదే పరిస్థితుల్లో కాటుకి సిద్ధపడింది? తన ప్రాణాలకి ముప్పుగా భావించే సిద్ధపడిందా? లేక మనకి తెలీకుండానే దానికేదో అపకారం కలిగించబోయామా...?''

సుధ నాకడ్డు వస్తూ- ''అవునవును... వినోద్‌కి నువ్వేం హాని చేశావని నీ జీవితాన్ని ముళ్ళలోకి లాగాడు?'' అదే ఆవేశంతో అంది.

''నీకు ఎప్పుడు చెప్పినా కొత్తే. ఏ పరిస్థితుల్లోనైనా కావచ్చు... అది అలా జరిగినందుకు అతడు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడా లేదా?''

''అతడు పశ్చాత్తాపపడ్డంత మాత్రాన నీ జీవితం నీకు తిరిగి వచ్చిందా?''

''నా జీవితం నా దగ్గరే భద్రంగా వుందంటే నమ్మవేం?'' కాస్త విసుగ్గా అన్నాను!

''నువ్వెప్పుడూ ఇంతే'' సుధ ఈసారి చాలా విచారంగా అంది: ''అంతా నీ స్థాయికి ఎదగాలి! మనుమలంతా నీలా ఆలోచించగలగాలి! అలా ఆలోచించగలగాలంటే అసలు మన వ్యవస్థ మారాలి! వ్యవస్థ మారాలంటే విప్లవం రావాలి! ఇంటలెక్చువల్ రివల్యూషన్ ఎలాగూ రాదు! అందుకనీ...''

నేను మధ్యలో అడ్డుపడుతూ...

''ఇదిగో- ఇలా ఒక విషయంలోనుంచి ఇంకో విషయంలోకి జారిపోతావెందుకూ? అవన్నీ నాకు తెలీని, నేను చెప్పేదానికి సంబంధంలేని విషయాలు'' కోప్పడుతూ అన్నాను.

''సరేలే'' అంటూ ఆగిపోయి ''రేపు శ్రీకాంత్ నీకెక్కడయినా తారసపడితే?'' అడిగింది.

''ఎప్పుడో కనపడ్డాడు సుధా''!

సుధ తెల్లబోతూ ''అప్పుడే అదీ అయిందా... ఎక్కడా?'' ఆతృతగా అడిగింది.

''ఇంతక్రితం నీళ్ళకెళ్ళానే, ఆలస్యం ఎందుకయిందనుకున్నావు? శ్రీకాంత్ కనిపించాడు''!

''మాట్లాడావా అతడితో?''

''ఆఁ... ''

''ఎలా వున్నాడు? ఏమంటాడు?''

''మనిషిగా ఎదగలేదు సుధా! పదేళ్ళక్రితం మానసిక స్థాయినుండి అతనింకా బయటపడలేదు! నాతో మాట్లాడుతూ వూళ్ళోకి రావడానికి కూడా జంకాడు పాపం'' అన్నాను.

''పాపమా? ఆ దుర్మార్గుణ్ణి పాపం అంటావా?'' ఆవేశపడింది మళ్ళీ.

''మరేంచెయ్యను చెప్పు? మానసికంగా ఎదగని అమాయకుల్ని పిరికివాళ్ళని చూసి జాలిపడాలేగానీ కోపం తెచ్చుకోకూడదు''

''ఏం మాట్లాడాడూ?''

''ఏం మాట్లాడతాడు? పోనీ నువ్వు వూహించు'' అన్నాను ఛాన్స్ ఇస్తున్నట్లు.

సుధ నావైపు దీర్ఘంగా చూసింది! సంతోషం లేకుండా నవ్వింది!




# 'మల్లెల జల్లు అందుకొండి

అంటున్నారు ''రామాయణం'' దీపిక

ఇటలీ ఖండ పరిజ్ఞానముతో, భారతదేశపు అత్యంతాధునిక కర్మాగారములో తయారు చేయబడిన పరిమళ భరితమైన సబ్బు మల్లెలనగరము నుండి వెలువడినది. ఈ సంస్థ ఈ శతాబ్దము మొదలు నుండి వెలువడుచున్న నాణ్యత కల సబ్బులను తయారు చేయువదిగా ఉత్కృష్టమైన చరిత్ర కలది.

మల్లెల జల్లు అందుకోండి,
మైసూరు జాస్మిన్ లో




MAX. PRICE
Rs. **3.87**
LT. EXTRA




కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్ బెంగుళూరు – 560 055

తరువాత అంది- "ఇంకా ఇలా బ్రతగ్గలగ వున్నందుకు ఆశ్చర్యపోయి వుంటాడు! యామై రైట్?"

"అవును" అన్నాను. "అంతేకాదు, నా అందం నాలుగు రెట్లు అయిందని కూడా ఆశ్చర్యపోయాడు"

"ఛీ... దరిద్రుడు" ఛీత్కరించింది సుధ.

"నువ్వే అంటావే అదృష్టవంతుడు అని" క్లాత్‌ని కట్‌చేయడం పూర్తి చేసి మడుస్తూ అన్నాను.

సుధ ఇంకేం మాట్లాడలేదు.

"ఈ రాత్రికి ఇక్కడే వుంటావా?" అడిగాను.

"ఇంటికెళ్ళే ఓపిక యిప్పుడులేదు! అజిత్ తోపాటు నేనూ నీపక్కన పడుకుంటాను" అంది పసిపిల్లలా.

నేను నవ్వాను!

అజిత్ లోపలికి వస్తూ "నేను లోపలికి రావచ్చా?" అన్నాడు.

అమాంతం వాణ్ణి దగ్గరికి లాక్కుని రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకుంటూ "తల్లికి మించిన తనయుడివి రా అజ్జూ! దొంగా- నీకన్నీ తెలుసు! నాతో ఎప్పుడూ చెప్పవేం?" అంది.

బాబు కళ్ళు విప్పార్చి చూశాడు ఆలోచనగా సుధవైపు! తరువాత "నువ్వెప్పుడూ ఆ విషయాలు ఎత్తవుగా ఆంటీ! మీ పక్కింటి బాబు వాళ్ళ నాన్న గురించి నేను మాట్లాడితే మాట మార్చేస్తావుగా? వినోద్ అంకుల్ గురించి చెప్పబోతే వినిపించుకోవుగా" అన్నాడు.

నివ్వెరపోయి చూసింది సుధ.

"చూశావా... పిల్లల్నుండి కొన్ని విషయాలు దాచాలీ అన్నట్టు మనమే ప్రవర్తిస్తున్నాం! చివరికి అంతో ఇంతో తెలివికలిగిన నువ్వుకూడా! అందుకే పిల్లలు బొత్తిగా పాడయిపోతున్నారు" అన్నాను విచారంగా.

"అక్కా" అంది బేలగా సుధ.

పసిపాపలా అజిత్‌తో సమానంగా నాకు ఓ వైపు హత్తుకుని పడుకుని "చెప్పక్కా... చెప్పు! ఏదీ... ఇంకోసారి చెప్పు. నిన్ను మనిషిలా చేసిన, నువ్వు మామూలుగా తినుకున్న ఆ భయంకర సంఘటనల్ని గురించి చెప్పు" అడిగింది సుధ.

"ఎన్నిసార్లు విన్నావు సుధా ఇప్పటికి?"

"ఫరవాలేదు చెప్పక్కా! ఆ జీవితపాఠాల్ని ఎన్నిసార్లు విన్నా ఇంకా వినాలనే, నేర్చుకోవాలనే అనిపిస్తూంటుంది" అంది.

"చెప్పడానికి నాకేం బాధలేదు! నీ కోర్కె కాదనను"!

కళ్ళు విప్పార్చి నా వైపు చూస్తున్న బాబు తల నిమురుతూ- "నువ్వూ వింటావా అజ్జూ" అడిగాను.

"చెప్పు మమ్మీ" కథ వినేప్పుడు చూపించే కుతూహలం లేదు వాడి కంఠంలో.

గొంతుమామూలుగావుంది! దీర్ఘంగానావైపు చూస్తున్నాడు! ఇదే- ఇలాంటి ఆలోచననే నేను వాడిలో కోరుకునేది! నిట్టూర్చి చెప్పడం ప్రారంభించాను...

పదేళ్ళక్రితపు గతంలోకి... నేను వెళుతూ వాళ్ళిద్దర్నీ తీసుకెళ్ళడం- ఇది ఎన్నోసారో నాకే సరిగా గుర్తులేదు.

★ ★ ★

అదొక చీకటిరాత్రి. సృష్టిలోని జీవులు చాలావరకూ నిశ్చింతగా నిద్రలోవున్న రాత్రి. నాకు మాత్రమే ఆ రాత్రి కాళరాత్రి. మనుషులంటే ఏమిటో అర్థంచేసుకోవడానికి దోహదపడిన రాత్రి! శ్రీకాంత్‌తో నా జీవనసూత్రం తెగిపోయిన చివరి రాత్రి.

నిజానికి అంతకు నాలుగు రోజులు ముందుగానే తెగిపోయింది మా బంధం. అది నా మనసుకి తెలుస్తూనే వుంది! అయినా ఆశ... మానవ సహజమైన ఆశ... స్త్రీ సహజమైన గుడ్డి నమ్మకం. ఆ ముడి ఇంకా బిగుసుకునే వుందనీ, వుంటుందనీ నన్ను నేను నమ్మించ చూసుకుంటూనే వున్నాను.

అప్పటికి నేను అమాయకురాల్నీకాదు, పూర్తి తెలివైనదాన్నీ కాదు! తెలివుండీ లేనిదాన్ని! తెలివైన అమాయకురాల్ని! ప్రపంచాన్ని సరిగ్గా చూడని అమాయకత్వం నాది! చిన్ననాటి అనుభవాలు నేర్పిన తెలివి నాది! అందుకే కాస్త తెలివి మరికాస్త అమాయకత్వం నాలో వున్నాయి! కాబట్టే ఇంకా శ్రీకాంత్‌తో నా సంబంధం కొనసాగుతుందని నన్ను నేను నమ్మించుకో చూస్తుండగా...




హఠాత్తుగా ఓరోజు అన్నాడు— శ్రీకాంత్ "నేను రేపు ఉదయాన్నే ఈ వూర్నుండి వెళ్లిపో తున్నాను" అని. నాలుగురోజుల తరువాత అతడు నాతో మాట్లాడిన తొలి మాటలవి! నానెత్తిన పిడుగుల్ని కురిపించిన మాటలవి.

"మనం వెళ్ళిపోతున్నాం సీతా" అనలేదత డు!

"నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు చాలా స్పష్టంగా.

ఇంకా ఏంచెప్పాలతడు నాకు అంతకంటే వివరంగా! అతడి మొహంలో స్థిరనిశ్చయం.

అతడి మొహంలో కఠినత్వం...

అతడి కళ్ళల్లో కాస్తంత దయకూడా లేదు...

కరుణ అనలే లేదు...

కనీసం జాలికూడా లేదు!

అసహనం, విసుగు, కోపం, అవమానం ఇలాంటి భావాలు కలగలిసిన ఒక ఏకైక భావం! దాని పేరేమిటో నాకు తెలీదు! అతడు రాయిలా వున్నాడని నాకు తెలుసు! అతణ్ణి కరిగించగలనన్న ఆశ ఆ క్షణంలోనే ఆరిపో యింది.

అప్పుడు నేనతడి కాళ్ళు పట్టుకుని— "న న్నెందుకిలా శిక్షిస్తున్నావు? నేనెలా బ్రతుకను?" అని ఏడవలేదు.

"ఇందులో నా తప్పేముంది?" అని ప్రాధే యపడలేదు.

చాలా విచిత్రంగా వచ్చింది ఆ క్షణాల్లో నాకు ఓ ఆలోచన!

"ఇతడెందుకిలా అయ్యాడు? నాలుగు రో జుల్లో ఎందుకింతగా మారిపోయాడు? మేం ఇద్దరం అగ్నిసాక్షిగా ఏడడుగులు నడవకపోవ చ్చు! ఆర్భాటంగా అందరిలో హోమగుండం ముందు మంత్రోచ్చారణలో అతడు నా మెడలో తాళి కట్టకపోవచ్చు! మామూలుగా అతి నిరా డంబరంగానే అయినా దైవసాక్షిగా నా మెడలో మంగళసూత్రాలని కట్టాడతడు! కలసి రెండే ళ్ళు కాపురం చేశాం! ఈ రెండేళ్ళల్లో అతడు ఏ క్షణాల్లోనూ నా మనసుకి ఏ కొంత కష్టం కూడా కలిగించలేదు.

అనుక్షణం నన్ను సంతోషపెట్టడానికే తాప త్రయపడ్డాడు! నా కోసం కష్టపడ్డాడు! ఈ మారుమూల పల్లెలో నా కోసం తనవాళ్ళకి తన ఆచూకీ తెలీకుండా తలదాచుకున్నాడు! అలాంటివాడు ఇప్పుడిలా ఎలా మారిపోయా డు...? ఆ ప్రేమంతా ఏమయిపోయింది?

అదేదో 'చిన్నసంఘటన' అని నేను అను కుంటున్నాను! కానీ, అతడనుకోవడంలేదు.

నేనెందుకు అనుకుంటున్నానలా?

అతడెందుకు అనుకోలేకపోతున్నాడూ?

ఆ సంఘటనకి బాధ్యురాల్ని (?) నేను కాబట్టా?

నా జీవితం అన్యాయం అయిపోబోతూంద న్న భయంతో 'అది చాలా చిన్న సంఘటన' అని నా తప్పు అందులో ఎంతమాత్రమూ లేదని నేను భావిస్తున్నానా?

అలా నన్ను నేను నమ్మించుకోచూస్తున్నానా?

అదే శ్రీకాంత్... ఎందుకు అనుకోలేకపోతు న్నాడు?

మగవాడు కాబట్టా?

నేను పవిత్రంగా లేనూ అన్న ఆలోచన అతడికి అంత బాధ ఎందుకు కలిగిస్తోంది?

ఇతణ్ణింత కఠినంగా ఎందుకు మార్చిందో?

అసలు పవిత్రత అంటే ఏమిటి?

అది మానసికమైందా, శారీరకమైందా?

మానసికమైనదని నేను అనుకుంటున్నా ను! అందుకే నేను పవిత్రురాలిననుకుంటు న్నానా?

అతడు శారీరకమైనదే పవిత్రత అనుకోబ ట్టేనా ఇలా ప్రవర్తిస్తున్నాడు?

నన్నతడు ఎంగిలాకులా భావిస్తున్నాడా?

ఎందుకలా?

తను మగవాడు కాబట్టా?

నిజంగా అతడు తన మనసు చెప్పినట్టు వింటున్నాడా?

లేక లోకానికి భయపడుతున్నాడా?

రేపులోకం "వీడి భార్యని ఎవడో చెడిపాడు! అయినా సిగ్గులేకుండా దానితో కాపురం చేస్తున్నాడు" అని అంటుందని భయపడుతు న్నాడా?

ఇంతమాత్రానికే నాపట్ల వున్న ప్రేమ స్థా

నంలో ద్వేషం మిగిలిందా ఇతడిలో?

ప్రేమ...

ద్వేషం...

హఠాత్తుగా గుర్తొచ్చింది నాకు – స్వార్థం.

అయినా ఎంతపిచ్చిదాన్ని నేను? ఇంతకాలంగా నా కోసం, నా సుఖం కోసం ఇతడు తన అయినవాళ్ళని, ఆస్తిని వదులుకుని వచ్చి ఈ పల్లెలో అష్టకష్టాలేవో పడుతున్నాడని ఆలోచిస్తున్నానేతప్ప... నా సుఖంలో అతడికి భాగంలేదూ? ఇందులో అతడి స్వార్థంలేదూ?

ఎందుకులేదు? అతడికి నేను నచ్చాను. నాతో జీవితం కావాలనిపించింది. నా కోసం తల్లిదండ్రుల్ని వదులుకుని రాగలిగిన చిన్నపాటి ధైర్యం, సాహసం అతడు చెయ్యగలిగాడు. అతిమామూలు ఆడపిల్లలా అతణ్ణి ఓ హీరోలా భావించాను నేను. అతడూ మామూలు స్వార్థపరుడైన మనిషే అనుకోలేదు.

ఆనాడు తన ప్రాణంలా భావించే నేను ఈనాడు అసలైన కష్టంలో ఇరుక్కుంటే నాతో సుఖాల్లో భాగం పంచుకున్న శ్రీకాంత్, ఈకష్టంలో నన్నుఒంటరిగా వదిలెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఆ సుఖాల్ని సంపూర్తిగా అనుభవించాడు. చిన్న కష్టాల్ని కూడా ఆనందంగా భరించాడు? అదే సాహసం అనుకున్నాను నేను. అలాంటి సాహసాలు వెయ్యి అయినా చెయ్యగలడేమో అతడు. కానీ, ఇప్పుడొచ్చిన ఈ కష్టాల్ని ఎదుర్కోగలిగే సత్తా అతడికి లేదు.

అంటే... అతడికి ధైర్యంలేదా?

లోకానికి భయపడుతున్నాడా?

పురుష సహజమైన సంకుచితత్వం అతణ్ణి పూర్తిగా ఆవరించిందా?

ఇలా ఆలోచించసాగాను నేను.

శ్రీకాంత్ తన సూట్‌కేస్ సర్దుకుంటున్నాడు.

అవును... అతడికి ధైర్యంలేదు. ఈ లోకాన్ని ఎదిరించేంత పెద్దరిస్క్ అతడు తీసుకోలేడు. అంతేకాదు అందరిలా ఎంగిలిమంగలంగానే అతడు నన్ను చూస్తున్నాడు.

పవిత్రత అంటే శారీరకమైనదే అని నమ్మేంత సంకుచితుడు! మామూలు మగవాడు! అదేనేను వినోద్‌తో నా ఇష్టపూర్వకంగా రహస్యంగా, మానసికంగా వ్యభిచరించి వుంటే అప్పుడా విషయం ఇతడికి తెలీదు. ఏ అదృశ్య శక్తో చెప్పినా పెద్దగా పట్టించుకోడు... నమ్మలేడు.

ఇప్పుడు నాకు ఇష్టంలేకపోయినా వినోద్ నాశీలాన్ని బలవంతంగా అపహరించాడు. ఈ విషయం అందరితోపాటు ఇతడికీ తెలిసింది. ఈ సంఘటనని ఎదుర్కొనే ధైర్యంలేక పారిపోతున్నాడు.

మరి నాపట్ల నాలుగురోజుల క్రితందాకా వున్న ప్రేమమాట ఏమిటి?

ఇంతలో అదెలా మాయమైంది?

అది నిజమైన ప్రేమే అయితే అంతత్వరగా ఇంతమాత్రానికే అదృశ్యం అవుతుందా?

ప్రేమ అంటే శారీకరమైంది కాదు... మానసికమైనది. ఒక పవిత్రమైన విషయం! భావం! బంధం! అదే ఇతడు నాకు తెలీకుండా రహస్యంగా ఒక స్త్రీని కోరి ఆమెతో సంబంధం ఏర్పరచుకుని వుండివుంటాడు లేదా, తాత్కాలిక మోహంతో మరో స్త్రీతో కొన్ని నిముషాల సుఖాన్ని పంచుకుని వుంటాడు. ఎలాగో ఆ విషయం నా చెవికి చేరింది. నేను ఇతణ్ణి నిలదీశాను. అప్పుడతడు పశ్చాత్తాపం ప్రకటిస్తాడు. నేనతణ్ణి క్షమించలేనా? నా ప్రేమ అతణ్ణి దగ్గరికి చేర్చుకోదా? తప్పకుండా చేర్చుకుంటుంది.

ఎందుకూ? నేను ఆడదాన్ని అయినందువల్లా?

కాదు- నా ప్రేమ నిర్మలమైనది కావడం వల్ల! అతడూ మనిషే! పొరపాట్లు, బలహీనతలు మానవ సహజాలుకాబట్టి! తప్పకుండా అతణ్ణి క్షమిస్తాను.

కానీ, ఇప్పుడితడు... ఇక్కడ నా బాధ్యత ఏమీలేకుండా జరిగిన ఒక దురదృష్టకరమైన పొరపాటుకి నన్ను బాధ్యురాల్ని చేశాడు. ఇంత మాత్రానికే అతడి ప్రేమ విరిగిపోయింది. ఇనుపముక్కల కాకులలాంటి లోకుల ముందు ఒంటరిగా నన్ను వదిలివెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు. అంటే ఇతడి ప్రేమ అంత నిర్మలమైందికాదు.

ఈ నాలుగురోజుల్లో నేనితణ్ణి ఒక్కసారి కూడా ప్రాధేయపడలేదు. అయితే అనుక్షణం

నన్ను ఓదార్పుగా దగ్గరికి తీసుకుంటాడని వెయ్యికళ్ళతో ఎదురుచూశాను. క్షణాలు... నిముషాలు... గంటలు... చివరికి రోజులు గడుస్తున్నాయి.

నాకప్పుడు అర్థమైంది! అయినా నన్ను నేను నమ్మించుకో చూశాను! అతడి నిశ్శబ్దం బద్దలై అతడి నిర్ణయం ఇప్పుడు బయటపడింది! అంటే ఇతడు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించలేదా? కేవలం నాపట్ల వున్నది మోజేనా?

మోజే అనుకున్నా ఈ సంఘటన జరగకపోయి వుంటే అది ఎంతకాలం నిలబడి వుండేది? పెళ్ళంటూ చేసుకున్నాం కాబట్టి సర్దుబాట్లతో మా సంసారం కడదాకాసాగి వుండేదా?

ఇంత ఆలోచించాక చాలా చిత్రంగా అంతక్రితందాకా ఏ క్షణంలోనైనా ఎగదన్నుకువచ్చి బయటపడి నన్నుముంచి అతడి పాదాల్ని తడిపివేస్తుందేమోననుకున్న దుఃఖం నా గుండెలోనే అణిగి... అణిగి... అణిగి ఘనీభవించిపోయింది.

ఇంకా ఆశ్చర్యం— నాకతడిమీద కోపం రావడంలేదు...

శ్రీకాంత్ అన్నాడు ముక్తసరిగా "ఈ రెండేళ్ళుగా నేను కష్టపడి కూడబెట్టిన ఇరవైవేలూ, అంతకుముందు నాతో తెచ్చిన అయిదువేలూ కూడా నీ పేరబ్యాంకులో వుందని నీకు తెలును. నీ జీవితం... నీ ఇష్టం"

అలా తన జీవితంతో పెనవేసుకుని వున్న నా జీవనలతను విడదీసేశాడితడు. ఈ చివరి మాటతో!

నేనేమీ మాట్లాడలేదు. అతడిలోని మామూలు మగాణ్ణి అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. అప్రయత్నంగా నా బాల్యం నాకు గుర్తొచ్చింది. నాన్న గుర్తొచ్చాడు! పిన్ని... నా సవతితల్లి గుర్తొచ్చింది. చివరిగా ఇల్లు వదిలి వచ్చేరోజున ఆమె చెప్పిన మాటలు గుర్తొచ్చాయి! ఏమందా రోజు ఆమె నాతో...

"అందరం కలసి మంచేదో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాం! బయటి ప్రపంచంలోకి వెళుతున్నావు సీతా! ఈ వయస్సులో అందులోనూ ప్రేమలోపడ్డప్పుడు ప్రపంచం వరమసుందరంగా కనిపిస్తుంది ప్రతి ఒక్కరికి. ఏ వ్యక్తినీ అంతసులభంగా అంచనా వెయ్యలేం! ఇప్పుడు మనం అదృష్టం మీద ఆధారపడ్డాం! నువ్వు చదువుకున్న దానివీకాదు, చదువులేనిదానివీ కాదు! నీకువున్న చదువు బయట ప్రపంచంలో పెద్దగా ఉపయోగపడదు! ఏకారణం చేతనయినా నువ్వు మళ్ళీ వెనక్కి తిరిగిరావలసి వస్తే ఈ ఇంటి తలుపులు నీకోసం తెరుచుకోవు. నీతండ్రి ఎంతటి కర్కోటకుడో నీకు తెలును, నాకు తెలును..." అంది.

ఆవిడ తెలివైనది! నా అయిదో ఏట నాన్నని పెళ్ళిచేసుకుని కాపురానికి వచ్చింది! దయతో, మానవత్వంతో తల్లిప్రేమని నాకు చవిచూపింది! ఆడ పిల్లలకోడి అయిన ఆమె తండ్రి ఆమెను కట్నంలేకుండా నాన్నకు ఇచ్చి బరువు దింపుకున్నాడు!

నాన్న...

ఆయన మంచివాడే!

కర్కోటకుడుకూడా...

ఆయనలోని ఈ ద్వంద్వప్రవృత్తి చిన్నతనంనుండి నాకు కొరుకుడు పడదు. ఆయనలో వున్న దుర్గుణాలు రెండు!

ఒకటి...తాగుడు

రెండు...అనుమానం!

ఈ మొదటి వ్యసనం ఆలనాపాలనాలేక చిన్నతనంనుండి తల్లీ తండ్రీ వున్నా అనాథగా పెరగడంవల్ల, మరికొన్ని పరిస్థితులవలన వచ్చింది! ఆయన తండ్రికూడా వ్యసనపరుడు! భార్యనీ సంసారాన్ని బిడ్డల్నీ పట్టించుకునేవాడుకాదు! ఒక స్త్రీతో అక్రమసంబంధం పెట్టుకున్నాడు! బాధ్యతలు మరచి డబ్బంతా తన వ్యసనాలకోసం తగలేసేవాడు!

స్త్రీలందరూ సహనమూర్తులు, ప్రేమమూర్తులు, బానిసలు అయివుండరు! అందుకు ఉదాహరణ నాన్న తల్లి! భర్త ప్రవర్తనతో విసిగేపోయిందో, పిల్లల్ని వస్తువు వుంచలేక తల్లడిల్లిపోయిందో తనసుఖం తాను చూసుకుందో ఎవరో పురుషుడితో వెళ్ళిపోయిందిట నాయనమ్మ. సమాజం ఆవిడ 'లేచిపోయింది' అన్నది! కాకుల్లా ఆకుటుంబాన్ని పొడిచింది!




ఇదిగో ఇక్కడే నాన్నమీద ఈ సంఘటన తన ప్రభావాన్ని చూపింది! స్త్రీజాతి పట్ల అనుమానాన్ని రేకెత్తించింది! ఆయన తండ్రి ఆ తర్వాత దాదాపు ఆ స్త్రీ దగ్గరేవుండసాగాడు! ఇంట్లో నాన్నకి ఒక అక్కవుండేది! మేనత్త వుండేది. ఆ మేనత్త మంచి వయసులో భర్త పోయి అన్నవంచనచేరింది. ఇప్పుడు ఇంట్లో ఆ ముగ్గురికి వస్తులెక్కువయ్యాయి. నాన్నకి తన తండ్రిని కొంగుకి కట్టేసుకుని ఆడిస్తూన్న ఆ స్త్రీని నరికేయాలనిపించేది.

అవిక్టేకాదు "వీడి అమ్మ ఎవరితోనో లేచిపోయింది" అన్నమాట విన్నప్పుడు ఎక్కడున్నా నరే వెదికి ఆ కన్నతల్లిని హత్య చేయాలనిపించేది. ఈ రెండు సంఘటనలేకాదు, ఆ తరువాత వరసగా జరుగుతూవచ్చిన ఒక్కో సంఘటన ఆయన్ని రాక్షసుడిలా మారుస్తూ వచ్చాయి. తాగి తాగి తండ్రిపోయాడు.

తన మీదవడ్డ ఈ ఇద్దరు బిడ్డల భారం మొయ్యలేక వయసులోవున్న మేనత్త ఓ ధనవంతుడికి తన దేహాన్ని తాకట్టుపెట్టింది. తన సుఖం తనుచూసుకోకుండా ఈ ఇద్దర్నీ ప్రయోజకుల్ని చేసేబాధ్యత నెత్తినవేసుకుంది.

కొందరువ్యక్తులుంటారు- ఏ విషయాన్నీ రెండో కోణంనుండి ఆలోచించడానికి ఇష్టపడరు. ఆ జాతికి చెందినవ్యక్తి నాన్న. "వీడి అమ్మ ఎవరితోనో లేచి పోయింది, వీడి మేనత్త ఎవర్నో వుంచుకుంది"... ఈ మాటల ప్రభావం ఆయన్ని పూర్తిగా చుట్టుముట్టింది!

ఏంచెయ్యాలో తోచదు. ఈ ప్రపంచంమీద అసహనం పెరిగిపోయింది. మేనత్తతో పోట్లాడేవాడు, తిట్టేవాడు. ఆవిడ ఓపిగ్గా, సహనంగా అన్నీ భరించేది. తనీమార్గంలో ఎందుకు నడుస్తోందో చెప్పడానికి ప్రయత్నించేది. ఇతడు వినిపించుకునేవాడు కాదు. అర్థంచేసుకోవడానికి అసలే ప్రయత్నించేవాడుకాదు. ఆవిడపట్ల ద్వేషం పెంచుకున్నాడు. ఆవిడచేసేదిలేక అతణ్ణిలా వదిలేసింది. ఎలాగో చదువు అయిందనిపించి చిన్న ఉద్యోగం సంపాదించాడు. ఆ మేనత్త అదృష్టవంతురాలు- ఆవిడపోయింది.

ఇతడు మనుమల్లా పడుతుండగా జరిగింది ఇంకొక సంఘటన. అతని అక్క అనుకుందిగదా- తల్లి చిన్నతనంలో తన సుఖం తను చూసుకుని వెళ్ళిపోయింది. తండ్రి తమ ఆలనాపాలనా పట్టించుకోకుండానే మరణించాడు. మేనత్త పోయింది. మరిప్పుడు తనకన్నా రెండేళ్ళు చిన్నవాడైన తమ్ముడు సంపాదించి తనకి పెళ్లిచేయాలి. ఎప్పటికి జరిగేది ఇది? అసలు జరిగేదేనా? తనకి అప్పటికి వయసుదాటిపోదూ?

ఇలా ప్రాక్టికల్‌గా ఆలోచించి తనకి ఇష్టపడ్డ వ్యక్తిని కులాంతర వివాహం చేసుకుని వెళ్ళిపోయింది అతని అక్క. ఇదో పెద్ద షాక్ అతడికి. ఆ కుటుంబం అప్పుళ్ళో దాదాపు వెలివడింది. స్త్రీ జాతిమీదనే 'అసహ్యం వేసిందతనికి.

స్త్రీ పేరెత్తితే ద్వేషం...

తన తల్లి స్త్రీ...

తండ్రిని దూరంచేసింది స్త్రీయే...

వీధిలో తలెత్తుకోకుండా చేసిన మేనత్త స్త్రీ...

తను పెద్దవాడై స్థిరపడుతున్న దశలో తన పరువుతీసి తనసుఖం తను చూసుకుని వెళ్ళిపోయిన అక్క ఒక స్త్రీ...

ఉమ్మడిగా మొత్తం స్త్రీ జాతిమీదే ద్వేషం పెంచుకున్నాడతడు. తన మనసు పెడుతున్న చిత్రహింసని అనుభవించలేక దాన్నుండి తప్పుకోవడంకోసం స్నేహితులతో కలసి సరదాగా అలవాటుచేసుకున్న 'తాగుడు' అనే వ్యసనానికి అలవాటుపడ్డాడు. చివరికి దానికి బానిస అయ్యాడు.

ఏ దూరపుబంధువులో, స్నేహితులో ఇతని స్థితి చూసి 'కుర్రాడు పాడయిపోతున్నాడే' అని జాలిపడి ఓ సంబంధంకుదిర్చి పెళ్ళిఅయిందని పించారు.

ఈ ప్రపంచంలో అతడు ద్వేషించే స్త్రీ జాతిమొత్తం భార్యరూపంలో తన కాళ్లముందు నిలబడ్డట్టనిపించిందాయనకి. ఇంకేం... తన ద్వేషాన్ని అసహ్యాన్ని ఆమె మీద కుమ్మరించసాగాడు.

ఆమె నవ్వులో కుటిలత్వం...

నడకలో జాణతనం...

చూపులో విశృంఖలత్వం...

కనిపించేవి ఆయన తాగుడు కళ్లకి అవిణ్ణి హింసించటం ప్రారంభించాడు శారీరకంగా,

మానసికంగా.

చాలామంది మగవాళ్లలాగే ఆయనదీ ఒకే దృష్టి-తన చిన్నతనం నుండి జరుగుతూ వచ్చిన సంఘటనల్ని వాటికి ఆధారభూతమైన పరిస్థితుల్ని ఒకదానితో ఒకటి పోల్చిచూసుకుంటూ బేరీజువేసుకుంటూ వస్తే అసలు లోపం ఎక్కడుందో తమ జీవితాలు ఇలా అస్తవ్యస్తం కావడానికి కారణం ఏమిటో బోధపడివుండేదేమో కాని తన తండ్రి బాధ్యతారాహిత్యం, వ్యసనాలమూలంగానే తనకుటుంబం నేలజారిన మట్టికుండలా తయారయిందని ఆయన కనీసం గుర్తుచేసుకోవడానికికూడా ప్రయత్నించేవాడుకాదు. ఆయన కోపం, ద్వేషం అంతా స్త్రీ జాతిమీదే. ఆ స్త్రీజాతికి ప్రతినిధిలా కనిపించేది భార్య.

ఆమె నవ్వితే అనుమానం, కూర్చుంటే అనుమానం, నిలుచుంటే అనుమానం...

తలదువ్వుకుని పూలుపెట్టుకుంటే అనుమానం...

ఒకటిన్నర సంవత్సరంలో ప్రత్యక్ష నరకాన్ని చూపించాడామెకి. ఎంత దురదృష్టవంతురాలైనా కొంత అదృష్టం ఆమెని వెన్నంటే ఉంది కాబోలు- కాన్పులో పోయిందావిడ. పురిటికందునైన నేను మిగిలాను ఆయన చేతుల్లో. నా ఆలనాపాలనాకోసం ఓ మనిషిని తెచ్చివుంచాడు ఇంట్లో. ఆ మనిషి ఈయనకంటే ఓ నాలుగేళ్ళు పెద్దది. ఆవిడ ప్రోద్బలంతోనే ఈయనకి ఆవిడతో అక్రమసంబంధం కుదిరింది.

స్త్రీవట్ల ఆయనకున్న అభిప్రాయానికి మరింత బలంచేకూరింది. ఆయన దృష్టిలో స్త్రీస్థానం ఇంకా దిగజారింది. కట్టుకున్నదికాబట్టి అమ్మ ఆయన పెట్టే హింసల్ని ఆయన అనుమానాల్ని భరించింది. తెచ్చుకున్నదెందుకు భరిస్తుంది? ఓ శుభముహూర్తాన ఆవిడ ఆ బాధల్ని భరించలేక దొరికినన్ని పుచ్చుకుని పారిపోయింది.

అప్పటికి నాకు అయిదేళ్ళు వచ్చాయి. నాన్న నావట్ల ప్రేమగానేవుండేవాడు... చాలా ప్రేమగా వుండేవాడు. అయితే వ్యసనం అధికమైంది. ఇంతలో ఎవరో మిత్రులు కల్పించుకుని తండ్రికి మోయలేనిభారంగా పెళ్ళీవయను కాస్తదాటిన పిన్నిని తెచ్చి నాన్నకి మళ్ళీ పెళ్ళి చేశారు. పిన్నికి నాన్న గురించి ముందుగా ఏమీతెలీదు. అయితే ఆమె తెలివైనది. చిన్నతనంనుండి కష్టాల్లో రాటుతేలిపోయింది కనుక చాలాత్వరగా ఆయన తత్వాన్ని గ్రహించుకుంది.

వీలయినంతవరకూ ఆయనకి అనుకూలంగా మసలుకోవడానికి ప్రయత్నించేది. తాగివస్తే 'ఇదేమిటి?' అని అడిగేదికాదు. తను విడదీయలేనంతబలంగా ఆ వ్యసనం ఆయన్ని పెనవేసుకుపోయిందని ఆమె గ్రహించింది.

తను నవ్వితే ఆయనకి అనుమానం అని గ్రహించి 'నవ్వడమే మానుకుంది. ఆయన తలదువ్వుకొమ్మంటే గానీ దువ్వుకునేదికాదు. పక్కింటి ఆడవాళ్లతో మాట్లాడినా ఆయనకి అనుమానం అని గ్రహించి ఇరుగుపొరుగుతో స్నేహాలుమానుకుంది. బంధువులు అసలే లేరు. పుట్టింటికి పంపకపోయినా నోరుతెరిచి అడిగేదికాదు.

ఒక బానిసలా ఆయన కొట్టినా తిట్టినా హింసించినా నోరెత్తక పడివుండేది. అయినా ఆయనలోని అనుమానం చావలేదు. ఓ రెండు మూడేళ్ల తర్వాత మాత్రమే భార్య మంచితనాన్ని గుర్తించాడాయన. కాస్త హింసలూ, బాధ తగ్గుముఖం పట్టాయి. ఇవన్నీ తెలుసుగనుకనే నాకు పిన్ని దేవతలా కనిపించేది. ఆవిడ ఏనాడూ పరోక్షంగా కూడా నాన్నని పన్నెత్తు మాట అనగా నేను వినలేదు.

నన్ను ఒక తల్లిగానే కాదు స్నేహితురాల్లా కూడా చూసేది. తన బాల్యంగురించి, కష్టసుఖాల్ని గురించి నాతో చెప్పుకునేది. ఇలాంటి పరిస్థితుల మధ్య నేను పెరిగాను. పిన్నికి ఇద్దరు మగపిల్లలు పుట్టారు. కాస్తయినా ఆవిడ మీద నాన్నకు అభిమానం పెరగడానికి ఇదే ఒక కారణమేనేమో. నావట్ల ఎంత అభిమానం వున్నా నేను వ్యక్తురాల్ని అయ్యాక స్కూలుకి పంపడానికి ఆయన ఒప్పుకోలేదు. ఏడుస్తూ కూర్చున్న నామీద నాన్న చెయ్యిచేసుకున్నాడు.

"ఆడదాన్ని గడపదాటించి వీధిలోకి పంపటంకన్నా మూర్ఖత్వం ఇంకోటిలేదు'' అంటూ మండిపడ్డాడు.

ఇదుగో-సరిగ్గా ఇప్పుడా చదువుమానుకోవా





ల్సి వచ్చిందన్న బాధతో కుమిలిపోతూన్న నాకు నాన్న కథంతా చెప్పుకొచ్చింది పిన్ని. నేను ఆశ్చర్యపోయాను. నాన్న వెనక ఇంత కథ వుందని నాకు తెలీదు; తెలిసే అవకాశం ఇప్పటిదాకా రాలేదు.

తరువాత పిన్ని నాన్నను బతిమాలి నేను యస్.యస్.సి పరీక్షలు ప్రయివేటుగా రాయ డానికి ఒప్పించింది. సరిగ్గా అక్కడితో ఆగిపో యింది నా చదువు. ఇక నాన్న ఒప్పుకోలేదు.

సగం జీతం ఆయన తాగుడికి సరిపోయేది. మిగతా సగంలో అయిదు కడుపులు నిండాలి, అవసరాలు గడవాలి. ఒక్కోపూట పస్తు లుండాలి వచ్చినా గుట్టుగా గడుపుకువచ్చేది పిన్ని.

ఒకసారి విసిగిపోయి "నాన్న మీద నీకు అసహ్యం వెయ్యదా పిన్నీ?" అని అడిగాను.

పిన్ని నవ్వింది. ఆ నవ్వులో ఏ భావమూలే దు. లేదన్నట్టు తలతిప్పింది.

"నీకాయనంటే ప్రేమా?" ఆశ్చర్యంగా అడి గాను.

తల అడ్డంగా తిప్పింది.

"మరి...మరి..." ఎలా అడగాలో తెలీలేదు.

"చిన్నతనంనుండి కష్టాల్లో పెరిగినదాన్ని అయినందువల్లో, కాపురానికి వచ్చేసరికి బాగా వయసు వున్నందువలనో మీ అమ్మలా కా కుండా 'ఆయనిలా ఎందుకు తయారయ్యా డూ' అన్న విషయం అర్థంచేసుకోవడానికి ప్రయత్నించి ఆయన సంతృప్తిపడేలా మస లుకోవటం ప్రారంభించాను. అందుకే చాలావ రకూ హింసతగ్గింది. ఆయన గతాన్ని బాల్యా న్ని గురించి తెలుసుకోగలిగానుగాబట్టీ, అర్థంచేసుకోగలిగానుగాబట్టీ ఆయన మీద నాకు అసహ్యం కలగలేదు" క్షణం ఆగి మర్చి పోలేనంతటి మధురస్మృతుల్ని నాకాయన మి గల్చలేదుకాబట్టి ఆయనపట్ల ప్రేమ నాలో లేదు. ఏదో ఒక బంధానికి కట్టుబడి బతికేస్తు న్నాను" అంది.

"అయితే ఇది బానిసత్వంకాదా పిన్నీ?" అని అడిగాను.

"కావచ్చు... ఒప్పుకుంటా" అంది- దీన్నుండి ఎలా తప్పుకోవాలో నాకు తెలీదు. ఇంత కంటే సుఖవంతమైన జీవితం నా పుట్టింట్లో నాకు లభించదు. నాకంటూ వేరొక ఆధారం లేదు. రాజీపడి బతికేస్తున్నాను సీ తా" అంది నిర్లిప్తంగా.

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది!

మళ్ళీ అంది పిన్ని- "ఇలాంటి బాధలు భరించలేక కొంతమంది ఆత్మహత్యలు చేసు కుని మరణిస్తారు. కానీ, నాకు బతుకుమీద ఆశ, ప్రాణాల మీద తీపి వుండబట్టి ఇలా వుండగలుగుతున్నాను" అంది.

నాకు పిన్నిమీద చాలా జాలి కలిగింది. పిన్నిలాంటి స్త్రీలు ఎంతమంది వుంటారు ఈ ప్రపంచంలో?

హఠాత్తుగా అనిపించింది నాకు- ఈ దే శంలోని స్త్రీలు నూటికి తొంభైమంది ఇలా జీవితంలో కాంప్రమైజ్ అయి బతికేస్తున్నవాళ్లే నేమో! అయినా పిన్నిలా అన్ని కోణాలనుండి ఆలోచిస్తే ఒక మనిషి దుర్మార్గం వెనుక వున్న కారణాలని విశ్లేషించి అర్థం చేసుకుని సర్దుకు పోయే తత్వం ఎందరిలో వుంటుంది?

పిన్ని తత్వం నాకు నచ్చీనచ్చనట్టు అని పించేది.

ఒకవిధంగా నాకు తెలీకుండానే పిన్ని ప్ర భావం నా మీద అంతర్గతంగా పనిచేస్తే ఈనాడిలా నా భవిష్యత్తు గురించిగాక, శ్రీకాంత్‌ని గురించి....అతని మానసిక స్థితిని గురించి ఆలోచించగలిగేలా చేస్తోందేమో.

"తెల్లవారకముందే నేను వెళ్ళిపోతున్నా ను" అన్నాడు శ్రీకాంత్.

నేనేమీ మాట్లాడలేదు. మాట్లాడటానికేమీలే దు.

అయినా పంజరంలో పావురాయిలా పిన్ని తోపాటు నాన్న వుంచిన హద్దుల్లో బతికేస్తున్న నా జీవితంలోకి ఇతడు ప్రవేశించడం ఆనాడో వింతగా అనిపించింది గానీ, ఈనాడు ఆలోచి స్తే ఈ జీవితంలో ఏదీ అసంభవంగానీ, అసా ధ్యంగానీ కాదనిపిస్తోంది. కాకపోతే ఇతడి పరి చయాన్ని దాదాపు ఆరునెలల సాన్నిహిత్యా న్ని నాన్నకి తెలీకుండా కాపాడుకుని చివరికి రహస్యంగా ఇతడితో రాగలిగే దాన్నా నేను?

శ్రీకాంత్‌తో ఫోటో ఆల్బమ్‌ని ఓ మూలకి గిరా




టు పెడుతుంటే మళ్ళీ గతంలోకి జారాయి నా ఆలోచనలు.



"మీఅన్నకి వయసు వచ్చిన కొడుకులు న్నారా?" అనుమానంగా అడుగుతున్నాడు నాన్న.

"మా అన్నకా? లేరు! ఏం అలా అడుగుతున్నారు?" నీరసంగా వుంది పిన్ని గొంతు!

నాన్న మాట్లాడలేదు.

మరుక్షణం అర్థం అయినట్టు... "సీత నాతో వస్తోందనా... మీకేం అలాంటి భయాలు అవసరం లేదు" అంటోంది.

నాకు అర్థమైంది నాన్న అనుమానం.

కోపం వచ్చింది. అవమానంగా అనిపించింది. ఇంతకాలం తన భార్య అన్నకి కొడుకులున్నారా అన్న విషయం పట్టించుకోని మనిషికి హఠాత్తుగా ఈ రోజు గుర్తు వచ్చిందంటే అనుమానం అన్న భూతం ఆయన్నెంతగా ఆక్రమించుకుని లొంగదీసుకుని వుందో అర్థమవుతూనే వుంది. ఇప్పుడు నేను పిన్నితో కలిసి తొలిసారిగా వాళ్ళ పుట్టింటికి వెళుతున్నాను.

నాకు తెలిసి పిన్ని కూడా ఇది రెండోసారో మూడో సారో వెళ్ళడం! వాళ్ళ అమ్మా నాన్న రాగలిగినంతకాలం వచ్చి చూసి వెళ్ళేవాళ్ళు. అన్నావదినా ఎప్పుడైనా వచ్చి చూసి వెంటనే వెళ్ళిపొయ్యే వాళ్ళు. నాన్న స్వభావం తెలిసిన వాళ్ళవటం వల్ల మా కుటుంబంతో పెద్దగా సంబంధాలు పెట్టుకోలేదు వాళ్ళు.

ఇంతకాలానికి పిన్ని కాపురానికి వచ్చిన దాదాపు పదిహేనేళ్ళ తరువాత తప్పనిసరిగా నాన్న తనకై తను ఆవిణ్ని పుట్టింటికి పంపుతున్నాడు. అదీ తన అవసరం కోసం.

ఎప్పుడూ ఆరోగ్యంగా వుండే పిన్నికి ఈమధ్య హఠాత్తుగా నుస్తీ చేసింది. రోజా సాయంత్రం జ్వరం రావడం ప్రారంభించింది. మామూలు జ్వరమేకదా అని తను పట్టించుకోలేదు. అంతలో దగ్గు కూడా మొదలయింది. నా కేదో అనుమానం వేసి మొదటగా నాన్నతో చెప్పాను. హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు నాన్న.

మెడికల్ రిపోర్టులో పిన్నికి టి.బి. ఎటాకయిందని బయటపడింది.

నాన్నంతగా కుంగిపోవడం నేను ఇంతవరకూ ఎరగను.

"చూశావా సీతా! అంత కఠినాత్ముడుగా కనిపించే మనిషి కూడా ఎలా అయ్యాడో! ప్రతి మనిషికీ ఎప్పుడూ ఇంకో మనిషి తోడు అవసరం. అందులో జీవితభాగస్వామి విషయం అయితే మరీను. బానిసలా తనతో పడివున్న మనిషి అవసరం తనకెంతుందో మీ నాన్నకి ఇప్పుడు తెలిసిందేమో" అంది పిన్ని.

"ఇది ఆయనకి నీపట్ల వున్న అభిమానం అనుకోనా పిన్నీ?"

"కావచ్చు, కాకపోవచ్చు! తన అవసరాలు చూసే మనిషి ఏమవుతుందో అన్న భయం....స్వార్థం కూడా కావచ్చు" అంది.

"జబ్బు ముదరలేదు కాబట్టి హాస్పిటల్‌లో వుండే ట్రీట్‌మెంట్ తీసుకోవాలనేం లేదు. కాస్త గాలి మార్పుతో మంచిమందులూ, బలమైన ఆహారం ఇస్తే చాలా త్వరగా కోలుకోగలరు ఆవిడ" అన్నాడు డాక్టర్.

చాలా లేత దశలో వుంది పిన్ని ఒంట్లో రోగం. ఈ మాట విన్నాక ధైర్యం వచ్చింది. ఈ విషయం తెలిసి పిన్ని అన్నగారు వచ్చారు.

"ఇక్కడ నీకేం సౌకర్యం వుంటుంది లలితా! ఊరికెళదాం రామ్మా" అని పిలిచాడు. ఆవిషయం నాన్నతో చెప్పమంది పిన్ని.

మామయ్యే నాన్నతో చెప్పి "ఇక్కడ లేని సౌకర్యాలు మావూళ్లో వున్నాయని అంటున్నానని అపార్థం చేసుకోకండి బావా! పల్లెటూరు! పాడిపంటలు వున్న ఇల్లు! పండ్లూ, తాజా కూరగాయలూ పుష్కలంగా దొరుకుతాయి! పైగా సీత వెనకాముందూ తెలీనిపసిపిల్ల!

లలిత ఓ నాలుగునెలలపాటు అక్కడవుంటే త్వరగా కోలుకుంటుందని...'' నంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు సాగింది నాన్న స్వభావం బాగా తెలిసిన ఆయన ధోరణి.

నాన్న అప్పుడేం మాట్లాడలేదు! తరువాత ఏం ఆలోచించాడో పిన్నితో ''నువ్వు సీతని తీసుకునివెళ్ళు! నెలకి ఓసారో రెండుసార్లో మందులు తీసుకుని వస్తూంటాను'' అన్నాడు.

''సీతా...దేనికీ?'' అనలేదు పిన్ని! తలూపింది.

ఆవిధంగా నా ప్రయాణం నిశ్చయం అయింది.

''నేనెందుకు పిన్నీ?'' ఆశ్చర్యంగా అడిగాను.

''నాకు నువ్వూ నీకు నేనూ కావలాకాబోలు'' అంటూ నవ్వింది.

తెల్లబోయి చూశాను!

పిన్ని మృదువుగా ''ప్రతి చిన్నవిషయానికీ అంతలా ఆశ్చర్యపోకూడదు సీతా! మనుమల స్వభావాన్ని లోకంపోకడనీ బాగా అర్థంచేసుకోవాలి. ముఖ్యంగా బయటప్రపంచంతో సంబంధాలు లేని నీలాంటి ఆడపిల్లలు ఇలాంటి అనుభవాల్ని పాఠంగా తీసుకుని ముందుజీవితాన్ని సుఖంగా మలచుకోవడానికి ఉపయోగించుకోవాలి. నేను వూరెళ్ళిపోతాను. మీ నాన్న ఆఫీసుకివెళతారు. నిన్ను ఒంటరిగా ఇంట్లోవదిలి వెళ్ళే ధైర్యం ఆయనకిలేదు. ఆయన మనస్తత్వం మనకి తెలీకపోతేగా?'' అంది.

''అయితేమాత్రం? నేనెవరితో లేచిపోతానని?' అవమానంతో కోపంగా అన్నాను.

''పరిస్థితుల్ని అర్థంచేసుకుని రాజీపడటం నేర్చుకోమ్మా'' పిన్ని నెమ్మదిగా అంది.

''సీతకూడా వస్తుందా మనతో! మరీ మంచిది. మీ వదినకి ఎప్పుడూ మాయదారి రోగాలే. కాస్త వేళపట్టున నీ మందులూ మాకులూ విషయం చూసుకుంటుంది. పావం ఆ అమ్మాయి బయటిప్రపంచంలోకి వచ్చినట్టు వుంటుంది'' అని ఆనందపడ్డాడు మామయ్య.

స్వంత మేనమామకాకపోయినా ఆయన నావట్ల చాలా అభిమానంగావుంటారు.

ఊహ వచ్చాక తొలిసారిగా వెళుతున్న ప్రయాణంకాబట్టి నాకూ ఆనందంగానే వుంది.

''నీయిష్టం-నీతో పంపుతున్నాను. అసలే పల్లెటూళ్ళు మంచివికావు, ఇల్లు కదలనీకు సీతని'' నాన్న పిన్నికి...ఓరోజంతా శలవుపెట్టి మరీ నూరిపోస్తున్నాడు.

ఆవిడ ఆరోగ్యంకంటే నాగురించే ఆయన ఆరాటపడటం చూస్తోంటే చికాకూ కోపం కలుగుతున్నాయి నాకు.

పిన్ని అన్నింటికీ ''అలాగే...అలాగే'' అంటోంది.

''భగవంతుడు ఎంత ఓర్పు ఇచ్చాడు ఈవిడకి?'' అనుకున్నాను చాలాసార్లలాగే నేను.

చివరగా నన్ను పిలిచి ''జాగ్రత్తసీతా! నిన్ను పంపడం నాకసలు ఇష్టంలేదు. ఒంటరిగా-ఇంట్లో వుంటావని పంపడమే'' అన్నాడు.

ఎంత హిపోక్రసి! నేను వుండలేనట ఒంటరిగా- మండిపోయింది నాకు.

ఎలాఅయితేనేం కొన్నినెలలపాటు స్వేచ్ఛగా వుండొచ్చు. బిగ్గరగా మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ వుండొచ్చు అనుకున్నాను.

నాన్నా తమ్ముళ్ళిద్దరూ ఈనాలుగునెలలూ ఎలాగో తంటాలువడేట్టూ నేనూ పిన్నీ పల్లెలో వుండేట్టూ నిర్ణయం జరిగిపోయింది. లక్ష జాగ్రత్తలు చెప్పి మమ్మల్ని రైలెక్కించాడు నాన్న.

ప్రయాణంలో ''ఈ నాన్నతో ఎలావేగుతున్నావు పిన్నీ? ఆడపిల్లని ఉన్నంతకాలం వుండబోను, తలచుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంది'' అనేశాను.

మామయ్యకూడా వింటున్నాడు. పిన్ని యధాప్రకారం నవ్వి వూరుకుంది.

రాత్రి ప్రయాణం! సంతోషంమీద వున్నానేమో చాలా సులభంగా నిద్రపట్టేసింది నాకు. వేకువఝామునకాబోలు మెలకువ వచ్చింది.

మామయ్య అడుగుతున్నాడు ''సీత పెళ్ళి గురించి మీ ఆయనేమైనా అనుకుంటున్నాడా లలితా?'' అని.

పిన్ని వెంటనే సమాధానం చెప్పలేదు.

అయిదునిమిషాలాగి అంది ''ఆయనేం పెళ్ళిచెయ్యగలరు అన్నయ్యా?''

ఆమాటవిని నేను ఉలిక్కిపడ్డాను.

పిన్ని అంటోంది నిర్వేదంగా "ఆ ధ్యాస వుంటేనా? సంపాదనలో సగభాగంపైగా తాగుడుకి సరిపోగా వస్తువులుండాల్సిన రోజులుకూడా మిగిలిపోతూనేవున్నాయి. సొంత ఇల్లుకూడాలేదు. ఇక పెళ్ళి ఎలాచెయ్యగలరు? ఈవిషయం ఎత్తితే మండిపడతారు... అప్పుడే ఏంతొందర అంటూ అటు దాన్ని చదువుకోనీ లేదు. పెళ్ళిచేసే స్థోమతా లేదు! అవిషయం ఒప్పుకోవడానికి అహం అడ్డువస్తుంది. కోరికైతే వుంది సమర్థతలేదు. ఈ విషయాన్ని మర్చిపోవడంకోసం అంటూ తాగడం జాస్తయింది ఈమధ్య"

పిన్నిమాటలువింటూ స్థంభించిపోయాను. నాకు తెలీని విషయాలివి. పెళ్ళిమీద ఆశలు వదులుకోవాలి. ఆ నరకకూపంలోనే బతకాలి. వీధి గుమ్మంలో నిలబడటానికి కూడా నోచుకోకుండా పడివుండాలి.

ఒక పుస్తకం చదవకూడదు. పుస్తకాలు చదివితే చెడిపోతారు ఆడవాళ్ళు. సినిమాలు అసలే చూడకూడదు.

అప్పుడొచ్చింది నాకు జీవితంలో భరించరానంత దుఃఖం తొలిసారిగా.

"ప్చ్... అతడిధోరణి అతడిదే- ఒకరిమాటలూ సలహాలూ పట్టించుకోడు. చూస్తూ నీ గొంతుకోశాం. సహాయం చేద్దామంటే నాకూ శక్తిలేదు. అమాయకపు బిడ్డ సీత జీవితం ఏంకానుందో? నాకా ఒక్క మగనలుసూ లేదు. ఉంటే నా కడుపులో పెట్టుకునేవాణ్ణి. నలుగురూ ఆడపిల్లలయ్యారు. అంతంతమాత్రపు సంసారం, పల్లెలోకాబట్టి సులభంగా బతికేస్తున్నాం..." మామయ్య దిగులుగా అంటూంటే పిన్ని నిట్టూర్చింది.

ఇప్పుడు అర్థమవుతోంది... భవిష్యత్తుని గురించి నేను ఆశాజనకంగా వూహించుకుంటూ మాట్లాడుతూంటే పిన్నికళ్ళల్లో కనబడే ఆ భావం ఏమిటో.... అదలా ఎందుకు కనిపించేదో!

అది, జాలి... నా అమాయకత్వం మీది జాలి.

ఉధృతంగా ఏడుపొచ్చింది నాకు.

★ ★ ★

మామయ్యవాళ్లది బాగా బతికి చితికిన సంసారం! దానికి గుర్తు ఆ పెద్దమండువాలోగిలి ఇల్లు! నాలుగెకరాల పండేపండని పొలంవుంది! అదిచాలా చిన్నపల్లె. మరో రెండెకరాలు కౌలుకి తీసుకుంటాడట.

మామయ్య భార్యకాన్త రోగిష్టిమనిషి! ఇంకా పిన్ని అమ్మానాన్నలు ఉన్నారు. పండు వృద్ధులయ్యారు వాళ్ళు. నలుగురు కూతుళ్ళు మామయ్యకి. పిన్నిగాక నలుగురు అక్కచెల్లెళ్ళు వున్నారు. పిన్నిలాకాదువాళ్ళు. ఎప్పుడూ వస్తూ వెళుతుంటారు. వాళ్ళకి పెట్టుపోతలు జరపాలి; పెద్దసంసారాన్ని నడుపుకురావాలి.

మామయ్య చాలాశ్రమపడుతున్నాడని తెలిసింది నాకు. ఆయన భార్య కూడా మంచిమనిషి. పాడి వుంది. అంతా నన్ను ప్రేమగా చూస్తూంటే వాళ్ళప్రేమలో ఉక్కిరిబిక్కిరయ్యాను. మామయ్య పిల్లలతోస్వేచ్ఛా విహంగంలా పొలాలూ తోటలూ దొడ్లూ తిరుగుతుంటే నా మనసెంత ఆనందంగా ఉత్సాహంగా వుందో నాకు మాత్రమే తెలును.

మొదట ఇల్లు వదిలి బయటికి వెళ్ళడానికి నేను భయపడుతోంటే పిన్ని ధైర్యం చెప్పింది "ఇలాంటి అవకాశం మళ్ళీ రాదుసీతా? కాస్త బయట ప్రపంచం చూడు" అంది.

"ఒకవేళ నాన్న హఠాత్తుగా వస్తేనో" అన్నాను.

"మీ నాన్న అంతటిసమర్థుడా తల్లీ" అంది అత్తయ్య.

పిన్ని నవ్వి "ఇది మహాపట్నంకాదు. నువ్వు మైళ్ళదూరం వెళ్లడంలేదు. బాత్‌రూమ్‌లో వుందని చెప్పి పిల్లల్ని పంపిస్తాన్లే" అంది.

నాకు ధైర్యం వచ్చింది. చాలా సిగ్గుగా కూడా అనిపించింది. స్వేచ్ఛ అనేదాన్నిచాలా స్వేచ్ఛగా అనుభవించాలిగాని ఇలా దొంగచాటుగా ఎంతకాలం పొందగలం?

అలా అని అవకాశాన్ని వదులుకోలేదు. ఈ వారంరోజులుగా ఎంత స్వేచ్ఛగా పొలాల్లో, తోటల్లో తిరిగానంటే రెండో వారంలో వచ్చిన నాన్న "అదేమిటమ్మా అలా నల్లబడ్డావు?" ఆశ్చర్యంగా అడిగాడు.

నాకేం చెప్పాలో తోచలేదు. ఎండల్లో ఒకటే తిరగడం అని తెలిస్తే ఏమయినా వుందా?

"నీళ్ళమార్పు గదూ ఇక్కడ ఉప్పునీళ్ళు"




అంది పిన్ని నర్దుతూ.

ఆ రోజువుండి తమ్ముళ్ళతో వెళ్ళిపోయాడు. నేను తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాను. మామయ్యవాళ్ళఇంటి ఎదురుగా ఓ పెద్దబంగళా వుంది. ఆ ఇంట్లో సందడి వుండదు. మనుమలు మాత్రం వున్నారు. నౌకర్లు కాబోలు తిరుగుతూంటారు.

అదే అడిగితే అత్తయ్య చెప్పింది "వాళ్ళు చాలా గొప్పవాళ్ళు సీతా! బయట మనుమలతో కలవరు. అసలిక్కడ వుండరు. హైదరాబాదులో వుండటం. ఆయనకి ఆరోగ్యం సరిగా లేదని గాలిమార్పుకోసం వచ్చారు. ఇద్దరు కొడుకులు వాళ్ళకి"

"ఓహో" అనుకున్నాను. ఇక పట్టించుకోలేదు.

మామయ్యవాళ్ళకి పాలేరున్నాడు. వాడు పొలంలో పనివుండి ఇంటికిరాని పూట అత్తయ్యే ముక్కుతూ మూలుగుతూ పశువులపని తనే చూసుకుంటుంది. ఊరిక్కాస్త దూరంగా వున్న బావి దగ్గరికెళ్ళి నీళ్ళు తెచ్చుకుంటుంది. నేనూ సరదాగా ఆవిడతో బిందెపట్టుకుని బయలుదేరేదాన్ని.

"నీకు పుణ్యం వుంటుంది. నాతో రాకుతల్లీ. మీ నాన్నచూశాడంటే నన్ను బావిలోకి నెట్టేస్తాడు" అందిఅత్తయ్య నవ్వుతూనే.

నాన్నవట్ల వాళ్ళకెంత కోపం అసహ్యం భయం వున్నాయో నాకర్థమైంది. నాకు చాలా సిగ్గుగా అనిపించింది. అయినా సరదాగానే బయలుదేరేదాన్ని.

అలా అత్తయ్యతో బిందె పట్టుకుని వెళ్ళిన ఒక రోజు అప్పుడే ఆగిన బస్‌లోనుంచి దిగిన ఓ యువకుడు ఎర్‌బ్యాగు సూట్‌కేస్‌తో బావిదగ్గరికి వచ్చి "గొంతు ఎండుకుపోతోంది. కాస్త నీళ్ళుకావాలి ప్లీజ్" అని అడిగాడు.

అతడు ఖరీదయిన బట్టల్లో దొరబిడ్డలా వున్నాడు.

అతణ్ణి చూసి అత్తయ్య కాస్త ఖంగారుగా "నీళ్ళా... ఎలా తాగుతావు బాబూ?" అంది.

"ఫర్లేదు- పోసెయ్యండి, గొంతెండుకుపోతోంది" అప్పుడే చూశాడతడు నావైపు.

"సీతా... ఆ బిందె మూతి సమానంగా వుంది. నీళ్ళు నగం కిందకి ఒంచి పొయ్యమ్మా" అంది- అత్తయ్య కంఠంలో వద్దిక.

నేను యాంత్రికంగా నగం నీళ్ళు కింద పోసి బిందెఎత్తాను. అతడు బ్యాగూ సూట్‌కేసు కిందపెట్టి కాస్త ఒంగి దోసిలివట్టాడు. అతడు అవురావురుమని నీళ్ళు తాగే ఆ తీరు చూస్తుంటే ఎంత దప్పికగొన్నాడో అర్థమవుతోంది.

అప్పుడే గమనించాను. చాలా అందంగా వుందతడి మొహం. నీళ్ళు తాగుతూ ఒకసారి కళ్ళెత్తి నావైపు చూశాడు. తీరైన కనుబొమ్మలు ఆ చూపుకి దూసుకుపోయినట్టయి నా గుండె ఝల్లుమంది. అతడు తాగడం పూర్తిచేసేసరికి బట్టలు బాగా తడిశాయి. అదే అంది అత్తయ్య నొచ్చుకుంటూ.

"ఫర్లేదండీ" ఆవిడతో అని నావైపు చూస్తూ "థాంక్యూ" అనేసి బ్యాగూ సూట్‌కేస్ అందుకున్నాడు.

"బస్‌లో వచ్చేరేం బాబూ... కారేమయింది?" అత్తయ్య కుతూహలంగా అంది.

"రిపేరుకెళ్ళిందండీ" నవ్వుతూ చెప్పి మరోసారి నావైపు చూసి కదిలాడు.

అలా హుందాగా నడిచివెళుతున్న అతనివైపే చూస్తున్న నన్ను మోచేత్తోపొడుస్తూ "మన ఎదురిల్లులేదూ... వాళ్ల చిన్నకొడుకు శ్రీకాంత్" అంది.

"ఏమిటీ" అంటూన్న నాకు వెళుతూన్న అతడు మరోసారి తలతిప్పి వెనక్కి చూడటం కనబడింది. గుండెలు చిత్రంగా స్పందించాయి.

"పద" అత్తయ్య పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాను!

"గర్వంలేని మనిషి! ఆ ఇంట్లో ఈ అబ్బాయి ఒక్కడే! భేషజాలు తెలీవు" అంది అత్తయ్య.

★ ★ ★

శ్రీకాంత్‌ని నేను వెంటనే మర్చిపోలేకపొయ్యాను! నాకు వయసొచ్చాక వయసులో వున్న పరాయి పురుషుణ్ణి అంత దగ్గరగా చూడటం చూపులు కలపడం అదే తొలిసారి! నా మనసంతా అదోలాంటి తియ్యని అనుభూతి! ఆ రోజంతా కలలో తిరుగుతున్నదాన్లానే వున్నాను.

"ఏమిటే సీతా అలావున్నావు? ఒంట్లో బావుండలేదా?" పిన్ని ఆదుర్దాగా అడిగింది.

"చాలా చాలా బాగుంది పిన్నీ" అన్నాను.

పిన్ని ఆశ్చర్యంగా చూసింది!

శ్రీకాంత్‌ని మరోసారి చూడాలన్న నా కోరిక తీరడానికి పెద్ద బాధపడనవసరంలేకపోయింది! మర్నాడు ఉదయాన్నే మేడమీద బాల్కనీలో బ్రష్‌చేసుకుంటూ కనిపించిన అతడు నన్ను చూసి చిరునవ్వు నవ్వాడు.

నా గుండె చిత్రంగా స్పందించింది. అతడు నన్ను గుర్తించాడు. ఎందుకు గుర్తించడు? నిన్న అంతగా పట్టిపట్టి చూస్తే! హఠాత్తుగా నాకు ఏదో గుర్తువచ్చింది! ఇంట్లోకి పరుగెత్తుకెళ్ళి పాతకాలంనాటి నిలువుటద్దం ముందు నిలబడ్డాను.

తొలిసారిగా అనుకున్నాను- "నేను చాలా అందంగా వుంటాను!"

అత్తయ్య ఈ దృశ్యం చూడనేచూసింది. "నీకేవమ్మా కోడలా! నాకు కొడుకులేడుగానీ, వుండి వుంటే అప్పనంగా తెచ్చి ఇంట్లో పెట్టుకోలేకపొయ్యేనా! వేరే దీపం ఇంకెందుకూ?" అంది.

సిగ్గనిపించింది నాకు.

కాస్సేపటి తరువాత లోపల పిన్నితో అత్తయ్య అనడం నా చెవులోబడింది "సీత ఎంత నాజూకుగా వున్నా ఎంత చక్కని అవయవసౌష్టవం అని! ఎక్కడోగానీ ఇలాంటి అమ్మాయిలని చూడం! ఏ ఇంట అడుగుపెట్టనుందోగానీ"

చాలా గర్వంగా అనిపించింది నాకు.

అదే సమయంలో- "ఏమో..." నిరాశాని స్పృహలతో కూడిన పిన్ని నిట్టూర్పు విన్నాక గాలిలో విహరిస్తున్న నేను నేలమీదకి జారిపడ్డట్టనిపించింది.

★ ★ ★

"హలో..." ఈ పలకరింపుకి ఉలిక్కిపడి చూశాను.

ఎదురుగా శ్రీకాంత్! పచ్చగా... అందంగా... నవ్వుతూ.

తృళ్ళిపడ్డాను అతణ్ణి చూసి.

"మీ పేరు సీతగదూ?" నవ్వుతూ అడిగాడు.

నేను తమాయించుకొని అవునన్నట్టు తలూపుతూ- "మీకెలా తెలుసు?" అడిగాను.

నాలో ఆమాత్రం ధైర్యం వుందని ఆరోజే తెలిసింది నాకు.

"తెలుసుకోవాలన్న మనసుంటే మార్గం అదే వుంటుంది" నవ్వుతూ అన్నాడతను.

అతడి నవ్వు చాలా అందంగా వుంది!

నా గుండెల్లో అదే స్పందన...

"నా పేరు తెలుసుకదూ మీకు?"

"తెలుసు... శ్రీకాంత్" అన్నాను నేలమీది గడ్డిపరకల్ని లాగుతూ.

"నేనిక్కడ కూర్చోవచ్చా?" అడిగాడు.

చప్పున తలూపాను! అతడు కర్చీఫ్ పరుచుకుని కూర్చున్నాడు. బెరుగ్గా చుట్టూచూశాను. అతడలా దగ్గరగా కూర్చోవడం ఇష్టంగా వుంది! భయంగా వుంది.

"మీరు పాటలు పాడతారా?" హఠాత్తుగా అడిగాడతను.

నేను తెల్లబోయి "లేదే" అన్నాను.

"అఁహా! మీ కంఠం చాలా బాగుంటేనూ" అతడంటే నాకు చాలా సిగ్గుగా అనిపించింది. హఠాత్తుగా నాన్న గుర్తొచ్చాడు నాకు. ఈ క్షణంలో నన్నిలా చూస్తే నిలువునా నరికి పోగులు పెట్టెయ్యడూ?

నా శరీరం భయంతో కంపించింది. ఎందుకితడు ఇలా నన్ను వెతుక్కుంటూ వచ్చాడు?

ఇంతలో మామయ్య వచ్చాడు. శ్రీకాంత్‌ని పలకరించాడు. నేనెవరో తనకి చెప్పాడు. అప్పుడర్థమైంది నాకు, ఈ తోట శ్రీకాంత్ వాళ్ళదని, మామయ్య కౌలుకి తీసుకున్నాడని.! ఇక మా ఇద్దరి మధ్యా మాటలకి అవకాశం దొరకలేదు.

ఇంటికి వస్తుండగా మామయ్య అన్నాడు- "చాలా బుద్ధిమంతుడమ్మా! ఆ ఇంట్లో అంతా గర్విష్ఠిమనుషులు! ఇతడొక్కడే పేదాగొప్పా తారతమ్యాన్ని పట్టించుకోడు, ఎం.ఎస్.సి. చదివాడు, ఇంట్లో డాక్టర్ చదివించాలని చూశారు, ఇతడికి ఇష్టంలేదు. లెక్చరర్ కావాలని కోరికట. ఇతడి అన్న ఇంజనీరు. ఇంట్లో వాళ్లకెప్పుడూ వ్యతిరేకి ఇతడు. ప్రత్యేకమయిన మనిషి అనుకో.

శ్రీకాంత్‌ని గురించి అలా మంచిగా వింటుంటే చాలా సంతోషంగా అనిపించింది.

అది అంతటితో ఆగిపోలేదు. మరో నాలుగు సార్లు ఆ తోటలోనే కలిశాం. ఒకసారి మామయ్యకి తెలిసీ, మూడుసార్లు తెలీకుండానూ! నన్ను అతడెంత ఆకర్షిస్తున్నాడో నేనూ అతణ్ణంత ఆకర్షిస్తున్నానని నాకు అర్థమైంది.

'మీరు' పోయి 'నువ్వు' దాకా వచ్చింది చనువు.

ఈలోపల నాన్న ఒకసారి వచ్చివెళ్ళాడు. చివరికి పిన్నికి కూడా తెలీకుండా ఇలా చేస్తోంది నేనేనా అన్న అనుమానం కలుగుతోంది నాకు. నాకు అనిపించింది- అవకాశం అన్నది దొరక్క చాలామంది అమ్మాయిలు బుద్ధిమంతురాళ్ళలా వుండిపోతున్నారేమో. లేకపోతే అలివిమాలిన అదుపాజ్ఞలమధ్య పెరిగిన నేను ఇలా వయసులో వున్న పరాయిమగాడితో తోటల్లో పొలాల్లో సమావేశాలూ, షికార్లూ చెయ్యడం ఏమిటి?

అతడి కుటుంబ విషయాలు నాకూ, నాగురించి అతడికీ తెలిసింది.

ఇద్దరన్నదమ్ములు! అన్నకి పెళ్ళయింది.

ఇతడికి మేనమామ కూతుర్ని ఇచ్చిచెయ్యాలని పెద్దవాళ్ళ పట్టుదల. కానీ, ఇతడికి ఇష్టం లేదు. అసలా అమ్మాయిని చేసుకోడుగాక చేసుకోడు. చాలా తేలిగ్గా అనిపించింది నాకెందుకో ఆ మాటవినగానే. నేనూ సూచాయగా నాన్న స్వభావాన్ని గురించి చెప్పాను.

"ఏమిటో- కొందరి జీవితాలు వాళ్ళ ప్రమేయం లేకుండా అలా అయిపోతాయి. సానుభూతిగా అర్థం చేసుకోవాలి సీతా మనం" అన్నాడు.

'అచ్చు పిన్నిలా మాట్లాడుతున్నాడితడు' ఆశ్చర్యంగా, సంతోషంగా అనుకున్నాను.

ఓ రోజు పిన్ని కాస్త అనుమానంగా "అస్తమానూ అలా తోటలోకి పరుగెడతావేం సీతా? ఏక్షణంలో మీ నాన్న వస్తారో అని భయంగా వుంది. సెలవులయిపోయి పిల్లలు కూడ స్కూలుకి వెళుతున్నారు. పరుగెత్తుకొచ్చి నిన్ను ఎవరు పిలుస్తారు చెప్పు?" అంది.

నేనేం మాట్లాడలేదు. నన్నక్కడో బలమైన శక్తి లాగుతోందని పిన్నికేం తెలుసు?

నాలుగు నెలలు గడిచిపోయాయి. నాలో దిగులు మొదలయింది. అయితే నా మనసు అతడికి చెప్పలేదు. అతడి మనసులో ఏముందో నాకు తెలీదు. చాలా ఆందోళనగా వుంది నాకు. దిగులుగా వుంది. "ఈసారి నాన్నొచ్చినప్పుడు మేం వెళ్ళిపోతాం" అన్నాను శ్రీకాంత్‌తో.

ఆ మాటవిని అతడి మొహం నల్లబడింది! మనిషి దిగాలుపడ్డాడు. చాలాసేపు ఏమీ మాట్లాడలేదు.

తరువాత హఠాత్తుగా "సీతా... నువ్వు అందమైన అమ్మాయివేకాదు, మంచి అమ్మాయివి. నువ్వంటే నాకు చాలా యిష్టం. అంతే కాదు, నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నేను బుద్ధెరిగాక నీలా ఏ అమ్మాయినీ ఇష్టపడలేదు. ఇప్పుడిలా యిష్టపడటానికి కారణం నువ్వు అందంగా వున్నావని మాత్రమే కాదు! మా మేనమామ కూతురు కూడా నీ అంత అందంగా వుంటుంది. ఇంకా మోడ్రన్‌గా వుంటుంది కూడా! కానీ నాకు నువ్వు నచ్చినంతగా ఆమె నచ్చలేదు. సీతా... నాకు నువ్వు కావాలి. ఐ వాంట్ యూ సీతా" ఆవేశంగా అన్నాడు.

అతడి ఆవేశం చూసి నేను తెల్లబోతే.....

"సీతా... ఐ లవ్ యూ" అన్నాడు.

నేను ఏదో అనబోయే లోపల మామయ్య వచ్చాడు. "నువ్విక్కడున్నావా అమ్మాయీ? మీ నాన్న వచ్చాడు! లలిత ఖంగారుపడుతోంది! పద" అన్నాడు.

నా గుండె ఆగినంతపనయింది.

"వెళ్ళొస్తాంబాబూ" శ్రీకాంత్‌తో చెప్పాడు మామయ్య.

అక్కడి నుండి వస్తూంటే 'ఇదే కాబోలు నేను ఇతడిని ఆఖరిసారిగా చూడటం' అనుకుంటే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

వస్తూ వెనక్కి తిరిగి చూస్తే నిస్సహాయంగా పెదవి కొరుక్కుంటూ నిలబడ్డ శ్రీకాంత్ కనిపించాడు. ఇప్పుడు నాకళ్ళ ముందు నాన్న ఉగ్రరూపం కనిపిస్తోంది.

"త్వరగా పద" అంటున్నాడు మామయ్య.

పాపం! ఈ మామయ్య చాలా అమాయకు

డు. మంచివాడు. ఎన్నిసార్లు శ్రీకాంత్ తో కలిసి కనబడినా అపార్థం చేసుకోలేదు. వన్నెత్తి మాట అనలేదు. కనీసం ఇంట్లో చెప్పలేదు. ఎలాంటి అనుమానమూ తనకి రాలేదు.

ఇలాంటి నాన్నే నాకు వుండి వుంటే....

ప్చ్.......

అదురుతున్న గుండెలతో ఇంట్లో అడుగుపెట్టగానే లోపల్నుంచి పిన్ని కంఠం వినిపిస్తోంది. "ఇవ్వాళో రేపో మీరొస్తారని తెలును. ప్రయాణానికి అన్నీ సర్దేసి ని కూడా. ఈ నాలుగు నెలలుగా ఇంట్లోనుండి బయట అడుగుపెడితే ఒట్టు అనుకోండి. అన్నయ్యా బలవంతాన పొలం చూపిస్తానని తీసుకెళ్ళాడు...."

"ఊఁ....." గంభీరంగా వుంది నాన్న కంఠం.

మామయ్యా నేనూ మొహామొహాలు చూసుకున్నాం.

మామయ్యా చూపుల్లో జాలి......

'మళ్ళీ పంజరంలోకి వెళుతున్నావు...' అన్న జాలి.

పిన్ని ఎంత సహజంగా, మామూలుగా నమ్మేలా అబద్ధం చెబుతోంది... అంత చాతుర్యం వుండబట్టే నాన్నతో కాపురం చెయ్యగలుగుతోంది కాబోలు.

పిన్నే అంటుంది ఒక్కోసారి "మీ నాన్నతో పెళ్ళయ్యాక ఈ మాత్రం తెలివితేటలు వచ్చాయోమో నాకు. కొన్ని పరిస్థితులు మనుమల్ని తెలివిగల వాళ్ళుగానూ, మూర్ఖులుగానూ మారుస్తాయి కాబోలు" అని.

నేనూహించినట్టు నాన్న నన్నుచూసి మండిపడలేదు. తీవ్రంగా చూడలేదు! మామూలుగా వున్న ఆయనమొహం చూశాక నాకు గుండెలు కుదుటపడ్డాయి. పిన్నివైపు కృతజ్ఞతగా చూశాను! మామయ్యా నాన్న కంటపడకుండా నాకోసం వచ్చాడన్నమాట! ఏ కళనవున్నాడో కాని చాలా మామూలుగా వున్నాడు నాన్న!

అంతేకాదు, మామయ్యతో "లలిత బాగా కోలుకుంది గోపాలం. మళ్లీ అక్కడికివస్తే చాకిరీ తప్పదు! సీతకా ఏమీతెలీదు! రోగం తిరగబెడుతుందేమోనని భయంగాఉంది. మరో రెండునెలలు ఇక్కడేవుంటే బాగుంటుందేమో" అన్నాడు భోజనాల దగ్గర!

"అవును! అలా బావుంటుంది" చప్పున అన్నాను నేను!

ఒక్కసారిగా అంతా నావైపు చూశారు. అప్పుడు భయంవేసిందినాకు!

తెలివి తెచ్చుకుని "నాన్న చెప్పింది నిజం మామయ్యా, పిన్నికాస్త ఒళ్లు చేసింది కూడా ఇక్కడికి వచ్చాక! మరో రెండునెలలపాటు రెస్టుతీసుకుంటే ఇక నిశ్చింతంగా వెళ్లిపోవచ్చు" అన్నాను తలదించుకుని!

నాన్న నావైపు ఎలా చూస్తున్నాడో నాకు తెలీదు!

"మీయిష్టం బావగారూ! మరో నాలుగునెలలపాటు నా చెల్లెలు ఇక్కడవున్నా నాకు సంతోషమే" అన్నాడు మామయ్య మనస్ఫూర్తిగా!

అత్తయ్యా మామయ్యాని సమర్థించింది!

"నువ్వేం అంటావు"? నాన్న పిన్నిని అడిగాడు!

"నాదేముంది? మీరెలా చెబితే అలా చేస్తాను" చాలా మామూలుగా అంటూ తెలివిగా తప్పుకుంది పిన్ని!

అలా అని ఇక్కడేఉండిపోవాలనేం లేదు ఆవిడకి! చిన్నపిల్లలతో ఈయన అక్కడేం తంటాలుపడుతున్నారో, పిల్లలేం ఇబ్బందులు పడుతున్నారో అన్న దిగులు ఓమూలవుండనే ఉంది. అలాగే తన ఆరోగ్యాన్ని గురించికూడా ఆలోచిస్తోంది- అందుకే అలా అంది!

చివరికి మరో రెండు నెలలపాటు పిన్నీ నేను ఇక్కడే వుండేలా నిర్ణయం జరిగిపోయింది. నాన్న వెళ్లిపోయాడు! ఎప్పుడెప్పుడు సాయంత్రం అవుతుందా, శ్రీకాంత్ని కలసి విషయం చెబుదామా అని నా మనసు ఉరకలు వేస్తోంది.

★ ★ ★

"ఇంకా దాపరికాలు, సంకోచాలు మునుగులో గుద్దులాటలూ అనవసరం సీతా! నాకు నువ్వు నచ్చావు! నిన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను అని చెప్పడమేకాదు పెళ్లిచేసుకుంటాను కూడా! కలసిజీవితాన్ని పంచుకుందాం.అయితే ఇందుకు మీ ఇంట్లో ఒప్పుకోరుగాక ఒప్పుకోరు! ఇంతకాలంగా మీ మామ

య్యా మనల్నొకదగ్గర చూస్తున్నా ఏమీ పట్టించుకోలేదు! అదే మీ కుటుంబసభ్యుల కంట ఇలాంటి దృశ్యం పడివుంటే మూడో ప్రపంచయుద్ధం వచ్చినంత పనయివుండేది! వాళ్లు డబ్బు మనుషులు! మీకుటుంబాన్ని సర్వనాశనం చెయ్యడానికి కూడా సిద్ధపడతారు. ఏక్షణంలో ఎవరిద్వారా ఎలా ఈ విషయం వాళ్లకి చేరిపోతుందోనని నాకుచాలా భయంగా వుంది! నువ్వు నన్ను నమ్మి నాతో వచ్చెయ్యగలి తే వెంటనే పెళ్లిచేసుకుందాం! ఇక్కడ మన ుధ్య నమ్మకం ముఖ్యం! నేను చెప్పదలచుకు ి చెప్పాను, ువ్వు 'ించు-ఇక'' ాలా నెమ్మదిగా స్పష్టంగా చెప్పాడతడు!

నాకేమీ తోచలేదు! భయంగా కూడా అనిపిస్తోంది! నాన్నకి ఈ విషయం తెలిస్తే నన్ను నరికి చంపుతాడు. పిన్ని ఏమంటుందో తెలీదు! శ్రీకాంత్ అంటే నాకు చాలా అభిమానం ఏర్పడిపోయింది! ప్రేమకూడానేమో!

నాకోసం ఆస్తి, అనుబంధాలు వదులుకోవడానికి సిద్ధంగావున్నాడు! అతడిపట్ల నాకు నమ్మకంగా వుంది! ఈ స్వల్పపరిచయానికి అంతనమ్మకం ఎలా కలిగిందో నాకుతెలీదు!

''ఏమిటి ఆలోచన? మీనాన్న గురించేనా?'' శ్రీకాంత్ అడిగాడు!

''అవునూ, కాదు'' ఎలానో నాకే తెలీకుండా తలూపాను!

కవేళ మీనాన్న మన కులాలు వేరుఅన్న ం ఒక్కటే ఆలోచించవచ్చు! నిన్ను దాన్నే శిక్షించవచ్చు. మావాళ్ళు అలాకా , నన్నేమీఅనరు! మీ ఫామిలీ, మీ మామ య్య ఫామిలీల మీద ప్రతీకారం తీర్చుకుంటా రు! నామేనమామకి ఒక్కతే కూతురు! లక్షల ఆస్తి నాకొస్తుంది! అది వదులుకోవడానికి వాళ్లు ఎటువంటి పరిస్థితుల్లో సిద్ధపడరు! ఇదినీకు నువ్వుగా ఆలోచించి తీసుకోవాల్సిన నిర్ణయం'' శ్రీకాంత్‌లేచాడు!

''నా ప్రపోజల్ నీకు యిష్టమైతే రేపు సాయంత్రం మామూలుగా కలువు! అంతధైర్యంచేయలేను, లేదా నాపట్ల నమ్మకం లేదంటావా- ఇక మళ్లీ నాకు కనబడకు! నేనూ ఈ వూరువదిలి వెళ్లిపోతాను... '' ఇలా అంటూంటే అతడి కంఠం వణికింది. తలొంచుకుని గబగబ వెళ్లిపోయాడు. నేను నిశ్చేష్టురాలిలా అలాచూస్తూండిపొయ్యాను! వెళుతూ చివరిగా ఒక్కసారి తలతిప్పి చూశాడు శ్రీకాంత్!

నాకళ్లలో నీళ్లు తిరిగాయి! ఏడుపొచ్చింది!



''సీతా...'' అంటూ వచ్చాడు మామయ్య.

ఉలిక్కిపడి కళ్లు తుడుచుకుని లేచాను! మామయ్య తదేకంగా నావైపు చూశాడు- నాకు భయంవేసింది!

''భయపడకమ్మా'' అన్నాడు మామయ్య - ''విషయం నేను చాలావరకు గ్రహించాను'' అన్నాడు. నాకింకా భయం, ఆశ్చర్యం కలిగాయి.

''పద'' అన్నాడు.

దార్లో మామయ్య ఏమీ మాట్లాడలేదు. అలా అని ఆయన మొహంలో కోపం ఏమీలేదు. దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు కనిపించాడు. ఇంటికి రాగానే పిన్ని నన్ను పిలిచింది- వెళ్లాను.

''ఏమిటలా వున్నావు?'' అడిగింది.

''ఏం చెప్పనూ? నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏ క్షణంలోనైనా ఏడుపు పైకి ఎగదన్నుకువచ్చేలా వుంది. ఇలాంటి సంక్షోభాన్ని బాధని నేను ఎప్పుడూ ఎరగను''

''ఏమయిందే? ఇలారా... నాకు చెప్పు'' అనునయంగా అంది పిన్ని.

అంతలోనే- మామయ్య ఏదో అన్నాడు- ''నిజమేనా?'' అని అడిగింది.

నిశ్చేష్టురాలినై చూశాను. అయితే మామయ్య ఎప్పుడో గమనించాడన్నమాట. భయంగా పిన్నివైపు చూశాను. దయగా వున్నాయామె కళ్ళు. అంతే... కింద కూలబడి పిన్ని ఒళ్ళో

తలవుంచి బావురుమన్నాను.

"పిచ్చీ! ఇంత ధైర్యం చెయ్యగలిగినప్పుడు అంతలోనేఇంత బేలవైతే ఎలా?" అనున యంగా నా తల నిమురుతూ అంది.

అంతమాత్రానికే ఎంతో ధైర్యం వచ్చింది నాకు. తరువాత వివరంగా నాచేత అన్ని విషయాలూ అడిగి చెప్పించుకుంది పిన్ని. అత్తయ్యకూడా వచ్చింది అక్కడికి. మా మాట లు వింది. ఆవిడా ఏంకోపం తెచ్చుకోలేదు. శ్రద్ధగా విన్నది. అంతా చెప్పాక నా హృదయం తేలికపడినట్లనిపించింది. లేచి బయటకు వచ్చాను.

"ఎంతవరకు నమ్మవచ్చంటావు ఈ శ్రీకాంత్ని?" పిన్ని అడుగుతోంది అత్తయ్యని.

"చాలా చక్కగా నమ్మచ్చు. అతడి గుణం నాకు తెలును. ఆ ఇంట్లో తప్పబుట్టాడు. అను కున్నది సాధించేరకం. మీ ఆయన జన్మలో సీతకి పెళ్ళిచేయగలడన్న ఆశ లేదంటు న్నావు. ఈ అదృష్టం దాన్ని వెదుక్కుంటూ వచ్చింది శ్రీకాంత్తో వంపెయ్..." అత్తయ్య చెబుతోంటే నాకు చాలా ఆశ్చర్యం, ఆనందం కలిగాయి.

"ఇంట్లోనుండి అడుగు బయటపెట్టడం అంటూ జరిగితే మళ్లీ వెనక్కివచ్చే అవకాశం పుట్టింటి ఆశ వదులుకోగలగాలి సీత. కష్టసు ఖాలు వాళ్ళే కలిసి అనుభవించాలి. భరించాలి. మగాణ్ని ఎంతవరకు నమ్మవచ్చు? అతని తల్లిదండ్రులు అసాధ్యులు అంటున్నా రు" తనలో తనే అనుకొంటున్నట్లు గొణు క్కుంది పిన్ని

"అసాధ్యులా... చాలా భయంకరమైనవా ళ్లు. మనమంతా సాహసం చెయ్యాలి సీత భవిష్యత్తుకోసం. ఇకనుండి సీత శ్రీకాంత్ని కలవకపోవడం మంచిది. అతడి విషయంలో ఎలాంటి సందేహాలూ అక్కరలేదు" అంది అత్తయ్య నమ్మకంగా.

పిన్ని మాట్లాడలేదు.

ఆరాత్రి భోజనాలప్పుడు మామయ్య "ఈ సమస్యని నువ్వేలా ఎదుర్కొంటావు లలితా?" అన్నప్పుడుగానీ గుర్తుకురాలేదు నాకు... ఈ విషయంలో నాన్న పిన్నినెంత హింసిస్తాడూ అన్న విషయం. నోటిదగ్గరికెళుతూన్న చెయ్యి ఆగిపోయింది.

విహ్వలంగా పిన్నివైపు చూశాను.

పిన్ని దయగా నాకు ధైర్యం చెబుతున్నట్లు చూసింది.

"ఒకసారి నువ్వు శ్రీకాంత్తో మాట్లాడన్న య్యా!. సీత ఇక అతన్ని కలవదు. ఇక్కడి నుండి సీత అతడితో బయలుదేరడం మంచి దికాదు. ఆయన నన్ను బతకనీడు. ఇలాంటి ఒక వ్యవహారంతో సీత వెళ్లిపోయిందన్న అను మానమే ఆయనకి కలగకూడదు. మేం వూరె ళ్ళాక ఒక నెల తరువాత శ్రీకాంత్ అక్కడికి వచ్చి సీతని తీసుకెళ్ళేలా ఒప్పించు. ఆపై భగవన్నిర్ణయం ఎలా వుంటే అలా జరుగు తుంది. అంతా దాని అదృష్టంమీద ఆధారపడి వుంది" పిన్ని కంట్లోనుంచి ఒక నీటిబొట్టు రాలిపడింది.

నాకు అన్నం సహించలేదు.

ఈ పిన్ని... నాకు జన్మనిచ్చిన తల్లికాదు...

ఎంత సాహసం చేస్తోంది నాకోసం?

అసలీ విషయం ఆలోచించానా నేను?

పిన్ని భుజంమీద తల దాచుకుని కళ్ళనీ ళ్ళు పెట్టుకుంటూంటే అంతా ధైర్యం చెప్పారు నాకు.

ఇక వాళ్ళు నన్ను శ్రీకాంత్ని కలవనీలేదు. మామయ్య కలిసి మాట్లాడాడు. అతడు చాలా ఆనందం ప్రకటించాడట. మామయ్య చెప్పిన అన్ని విషయాలకీ తలూపాడు. ఈలోపల తన జాగ్రత్తలు తను తీసుకొని ఏర్పాట్లు చూసు కుంటానన్నాడట.

"ఓ నాలుగేళ్ళు కంటికే కనబడకపోతే సరి. మావాళ్ళు దారికి రాకేంచేస్తారు? సీతలాంటి అమ్మాయి నాకు దొరకదు" అన్నాడట.

ఎంతో గర్వంగా అనిపించింది నాకు.

ఆ మర్నాడు అతడు బాల్కనీలో కనిపించి ఉత్సాహంగా నవ్వాడు.

అంతే! తరువాత వూరెళ్ళిపోయాడు. ఇక్కడ ఎవరికీ ఎలాంటి అనుమానం కలక్కూ డదు. ఆ తరువాత ఒక నెలరోజులు ముళ్ళ మీద గడిపినట్టే అనిపించింది నాకు. పిన్ని నాకు సంసారజీవితంలో తీసుకోవాల్సిన జాగ్ర త్తలు నూరిపోస్తూనే వుంది.



"జీవితం సుఖాలమయం కాదనడానికి నా జీవితం ఒక ఉదాహరణ సీతా! నీ తప్పు లేకపోయినా బానిసలా పడివుండు, సర్దుకుపో అని నేను చెప్పను. అవతలిమనిషి తప్పు ఎందుకు చేశాడూ... అందుకు దోహదపడిన పరిస్థితులేమిటి అని ఆలోచించు. అప్పుడా మనిషి మీద నీకు ద్వేషం కలగదు. అలాంటప్పుడు ఎంత కష్టంలోనూ కొన్తయినా మన శ్శాంతి లభిస్తుంది నీకు" ఇలా పిన్ని చెప్పే మాటల్ని శ్రద్ధగా వినేదాన్ని.

అనుకున్నదానికంటే ముందుగానే నాన్న దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. ఆవూరి నుండి ట్రాన్స్‌ఫర్ వచ్చిందట. ఓ పదిహేనురోజులు ముందుగానే మమ్మల్ని బయలుదేరి రమ్మని రాశాడు.

"ఇదీ మనమంచికే" ఆనందంగా అంది పిన్ని.

అలా ఎందుకు అందో నాకు అర్థంకాలేదప్పుడు.



నాన్న రాసిన ప్రకారం మామయ్య మమ్మల్ని తీసుకుని వచ్చి వదిలాడు.

ఆయన వెళ్లబోయే ముందు పిన్ని చెప్పింది "ఏ విషయానికైనా నే ఉత్తరం రాస్తాను" అని.

శ్రీకాంత్ కబురేం తెలీలేదు, నాకు చాలా ఆరాటంగావుంది.

ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ నాన్నచేతికి అందాయి, ఫలానారోజు ప్రయాణం అని నిర్ణయం అయింది. అవూరెళ్ళి ఇల్లుచూసి అడ్వాన్స్ ఇచ్చి వచ్చాడు నాన్న.

అమ్మ మామయ్యకి ఉత్తరం రాసేసింది.

★ ★ ★

"సీత ఈమధ్య ఎందుకోగాని అదోలా వుంటోందండీ"

పిన్ని ఇలా నాన్నతో చెప్పడం విని ఆశ్చర్య పోయాను.

"అదేలానా? అంటే" ఆశ్చర్యం...అనుమానంకూడా ఆకంఠంలో.

"ఎప్పుడూ దిగులుగా ఏదో పోగొట్టుకున్నదానిలా వుంటోంది"

"ఎప్పటినుండి?"

"పదిరోజులుగా! ఊళ్ళోవుండగా బాగానే వుండేది"

"అక్కడెవరైనా మీబంధువుల పెళ్లికెదిగిన మగపిల్లలు ఇంటికొచ్చేవాళ్ళా?"

నాన్న మాటలువింటుంటే కోపం, భయం రెండూ కలిగాయి.

"ఖర్మ... అలాంటివాళ్ళెవరూ లేరు అక్కడ, అన్నయ్య కోసం వయసు మళ్ళినవాళ్ళొచ్చినా ఇంట్లోకెళ్ళి దాక్కునేది" చెబుతోంది పిన్ని

"అదీ ఆడపిల్ల లక్షణం" గర్వం ఆయన కంఠంలో- "అది నాకూతురు కాదా?"

తరువాత అడిగాను "అలా ఎందుకు చెప్పావు పిన్నీ?"

"నా రక్షణకోసం అల్లుతూన్న అబద్ధాలగూడు" అంటూ నవ్వింది.

నాకేం అర్థంకాలేదు.

"దాని గురించి ఆలోచించకు, నీ భవిష్యత్తుని గురించి జాగ్రత్తగా ఆలోచించుకో" అంది పిన్ని

మామయ్య దగ్గర్నుండి ఎలాంటి కబురు రాలేదు, నాకు చాలా ఆరాటంగా, దిగులుగా వుంది.

ఇంకో రోజు "నాకు చచ్చిపోవాలని వుంది— అని పదేపదే అంటోందండీ సీత" పిన్ని చెప్పడం విని తెల్లబోయాను.

"దానికేమయినా పిచ్చెక్కిందా? తినికూర్చోక ఏం రోగంట?" కోపంగా అరిచాడాయన.

"సీతా...సీతా" బిగ్గరగా పిలిచాడు.

వాడలిపోతూ పరుగెత్తుకెళ్ళాను.

"దిక్కుతోచకపోతే రామాయణమో, భారతమో చదువుకో, పిచ్చిగా మాట్లాడి జబ్బుమనిషిదాన్ని బాధపెట్టకు" అన్నాడు కోపంగా.

నాకు చాలా ఆశ్చర్యం అనిపించింది. పిన్ని క్షేమంపట్ల ఆమాత్రం శ్రద్ధ ఆయనలో వుండటం ఆశ్చర్యమే. అంతలోనే పిన్నిమాటలు గుర్తొచ్చాయి. పరిస్థితులు అలా మార్చాయిగాని ఆయనమాత్రం మనిషి కాదా ఏమిటి?

అప్పుడు నాన్నమీద నాకు చాలా అభిమానంగా అనిపించింది.

'ఈనాన్నని తిట్టినా కోపం వచ్చికేకలు వేసిన తన సంకుచితత్వంతో అనుమానంతో పంజరంలో పక్షిలా బంధించినా...ఎంతయినా కన్నతండ్రి అయిన ఈయన్ని పచ్చిగా మోసంచేస్తున్నాను. క్షోభపెట్టబోతున్నాను' ఇలా అనుకుంటూంటే నాకళ్లలో నీళ్ళుతిరిగాయి.

"పిచ్చి పిచ్చి ఆలోచనలుపెట్టుకోకు. పిన్నీ నువ్వు సెకెండ్ షోకి వెళ్లండి తమ్ముళ్ళని తీసుకుని" ఆప్యాయంగా అన్నాడు నాన్న.

తలూపివచ్చేసి పెరట్లో కూర్చుని కరువు తీరా ఏడ్చేను.

"మీ నాన్నమనిషే సీతా" పిన్ని తలనిమురుతూ అంది.

అంతలా ఎదుటిమనిషి అర్థంచేసుకోగలదుగాబట్టే నాన్నపట్ల ద్వేషం పెంచుకోకుండా ఆయనతో కాపురం చెయ్యగలుగుతోంది ఈ పిన్ని...మనిషికాదు, దేవత.

రెండు రోజుల తరువాత మామయ్య వచ్చాడు. శ్రీకాంత్‌తో నన్నుపంపటానికి ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. నాకేమిటో దిగులుగా ఆనందంగా దుఃఖంగా పిచ్చిపిచ్చిగా ఉంది.

మామయ్య నాన్నతో "ఊరు మారుతున్నారు గదా, మీరు తీరికలేని మనిషి. లలితా, సీతా ఏం అవస్థలుపడతారోనని వచ్చాను. సామాను అదీ ప్యాక్‌చేసి మిమ్మల్ని ఆవూళ్ళో దింపి వెళతాను" అన్నాడు.

మామయ్యశ్రద్ధకి తనపట్ల ఆయన ప్రకటిస్తున్న గౌరవానికి నాన్న చాలాసంతృప్తిపడ్డాడు. ఆయన తన సంతోషాన్ని పైకి ప్రకటించలేదు గానీ మాకు అర్థమవుతూనేవుంది! అవసరం అవకాశం అన్నవి రావాలేగానీ ఎలాంటి వాళ్ళనైనా మోసపుచ్చటం ఎంతసులభం?

రెండు రోజుల్లోవుంది ప్రయాణం...వాళ్లదీ, నాదీ.




నాకు అన్నం సహించడంలేదు. పిన్ని ధైర్యంచెబుతోంది. సంతోషంగా వుండమని మందలిస్తోంది. మామయ్య రహస్యంగా కొని తెచ్చిన సూట్‌కేసులో నాబట్టలూ అవీ సర్దేసుకున్నాను. ఎక్కడ శ్రమపడితెచ్చాడో ఓ వెయ్యి రూపాయలు నాకిచ్చాడు మామయ్య.

"ఆడపిల్లవాళ్లం ఒకటివాళ్లు తెస్తే ఇంకోటి మనం తెచ్చుకునే ఆచారం వుందని మీఅత్తయ్య పంపిందమ్మా"అంటూ కొత్త మంగళసూత్రం ఇచ్చాడు.

నాకళ్లల్లో కృతజ్ఞతతో నీళ్ళు తిరిగాయి.

మర్నాడు ప్రయాణం. ఇంట్లో సామానుఅంతా సర్దేశాం. నేను అదోలావుండటం నాన్న గమనిస్తూనేవున్నాడని నాకు అర్థమవుతూనేవుంది. ఆయన్ని తప్పుకు తప్పుకు తిరిగాను. పిన్నినీ, తమ్ముళ్లనీ వదిలివెళ్ళిపోతున్నానూ అంటే ఎంతబాధగావుందో నాన్న ఇక కనబడడూ అనుకుంటే కూడా అంతే బాధకలుగుతోంది నాకు.

కన్నతండ్రి అయినందువలనా?

లేక ఆయన్ని పిన్ని దృష్టితో చూడగలిగినందువలనా?

నాకే అర్థంకావడంలేదు.

ఈ రాత్రే నాప్రయాణం. మామయ్య సెకండ్ షోకి అనిచెప్పివెళ్లాడు. నాన్నయధాప్రకారం తాగివచ్చిపడుకున్నాడు.

పిన్ని ఓపెన్నూ కాగితం తెచ్చి "నేను చెప్పినట్టురాయి" అంది.

నేను ఆశ్చర్యంగా చూస్తొంటే "కానీ" అంది.

"పూజ్యులైన నాన్నగారి పాదపద్మములకు నమస్కరించి మీకుమార్తె సీత రాయడం...." పిన్ని చెబుతోంటే ఆశ్చర్యాన్ని అణచుకుంటూ రాస్తున్నాను.

"నాకు ఈజీవితంపట్ల ఆశ నశించింది, జీవితంమీద విరక్తి కలుగుతోంది, బతకాలనిపించటంలేదు. అందుకే ఈ ఇంట్లోనుండి వెళ్ళిపోయి ఏ రైలుక్రింద పడో ఏ చెరువులోనో దూకి ఆత్మహత్యచేసుకోవడానికి నిర్ణయించుకున్నాను. నాకుజన్మనిచ్చిన దేవుడిలాంటిమీకడుపులో చిచ్చుపెడుతున్నానని నాకు తెలును..."

"పిన్నీ" దిగ్భ్రాంతిగా చూశాను.

"నువ్వు రాయిముందు" అంది.

ఆమె చెబుతున్నది ఎలా రాసిపూర్తిచేసి సంతకం పెట్టానో నాకే తెలీదు.

పిన్ని ఆ ఉత్తరాన్ని భద్రపరుస్తూ "ఇది నావల్ల మీనాన్నకి అనుమానం కలగకుండటానికే కాదు సీతా, నువ్వు చచ్చిపోయావన్న నమ్మకంతో కొంతకాలం దుఃఖించి మర్చిపోగలరేమోగానీ, ఇలా ఒక మగాడితో కలసినువ్వు వెళ్ళిపోయావని తెలిస్తే అక్షోభని ఆయన భరించలేడు- ఆయన్ని మోసగించక తప్పదు" పిన్ని చెబుతోంటే నాకు సర్వం అర్థమైంది.

నాకు తెలిసి తొలిసారిగా పెద్దగా మనసారా దుఃఖించింది పిన్ని.

ఆ దుఃఖంలో...

నాకు పెళ్ళిచెయ్యలేని తమ నిస్సహాయస్థితికి సిగ్గు...

నాన్నని మోసంచేస్తున్నబాధ...

నేనుదూరం అవుతున్నానన్న వేదన...

ఇక కనపడనన్న దుఃఖం దిగులు...అన్నీ కనిపించాయి.

మొదట తనే తేరుకుంది. నన్ను నముదాయించి తలదువ్వి జడవేసింది. కొత్త చీరతెచ్చికట్టుకోమంది. ఎప్పుడు ఎలా తెప్పించిందో ఎన్ని అవస్థలుపడిందో, నాకు తెలిసి పిన్ని దగ్గరపైసా ఉండదు.

"ఇంతకంటే ఈ నిరుపేద పుట్టింటివాళ్ళు ఏమీ ఇవ్వలేరు సీతా" అంది.

"నీ ఆశీర్వాదాలు, ప్రేమ...ఇవి చాలు పిన్నీ నాకు" రుద్ధమైనకంఠంతో అన్నాను.

అవి ఎప్పుడూ నిన్ను వెన్నంటే వుండి మీజీవితం మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్థిల్లాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను"అంది.

నేను తయారయాను, సెకండ్ షోకని వెళ్లిన మామయ్య బయట వీధి చివరవున్నాడని నాకు తెలును.

అప్పుడు అంది పిన్ని నాతో- "సీతా... ఇకనువ్వు ఆలోచించాల్సిందేమీ లేదుగదూ?"

నేను తెల్లబోయాను.

"చివరిసారిగా మొదటిసారిగా చెబుతున్నాను- ఇంకాస్త టైమ్‌వుంది నీకు, అందరం కలసి మంచో చెడో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాం. బయట ప్రపంచంలోకి వెళుతున్నావు సీతా, ఈ వయసులో అందులో ప్రేమలోపడ్డప్పుడు ప్రపంచం పరమ సుందరంగా కనిపిస్తుంది ప్రతి ఒక్కరికీ. ఏవ్యక్తినీ అంత సులభంగా అంచనావెయ్యలేం, ఇప్పుడు మనం అదృష్టంమీద ఆధారపడ్డాం, నువ్వు చదువుకున్నదానివీకాదు, చదువులేనిదానివీకాదు, నీకు వున్న చదువు బయట ప్రపంచంలో పెద్దగా ఉపయోగపడదు. ఏ కారణం చేతనయినా నువ్వు మళ్ళీ వెనక్కి తిరిగిరావలసివస్తే ఈ ఇంటి తలుపులు నీకోసం తెరుచుకోవు. నీ తండ్రి ఎంతటి కర్కోటకుడో నీకు తెలును, నాకు తెలును... ఎలాంటి పరిస్థితికైనా భవిష్య ...ర్కోగలనన్న నమ్మకం, ధైర్యం నీలో వున్నాయా? ఒకసారి నిన్ను నువ్వు ప్రశ్నించుకుని చూడు..."

"నువ్విలా అంటూంటే నాకుభయం వేస్తోంది పిన్నీ" బేలగా అన్నాను.

"నిన్ను భయపెట్టడానికి కాదే, పరిస్థితిని విడమరచి చెబుతున్నాను- క్షేమంగా వెళ్ళి సుఖపడుతల్లీ" కళ్ళుతుడుచుకుంది.

నిశ్శబ్దంగా పిన్నివెంట వెళ్ళి గాఢనిద్రలోవున్న నాన్నని చూస్తుంటే దుఃఖంముంచుకొచ్చింది, బలవంతాన అణచుకుని బయటికి వచ్చాను. ఆయన దృష్టిలో నేను మరణించిన దాన్ని ఇకనుండి. వేరే వూరువెళ్ళిపోతున్నాను గాబట్టి అక్కడ ఈ 'సీత' ప్రసక్తిరాదు. అందుకే ఆరోజు ఈ ట్రాన్స్‌ఫర్ విషయం తెలిసినప్పుడు పిన్ని "ఇదీ మనమంచికే" అంది.

చివరిగా తమ్ముళ్ళిద్దర్నీ ముద్దాడి బయటికొచ్చాను.

సూట్‌కేస్ నాకందించి వీధివాకిట్లో నిలబడిన పిన్ని కాళ్లకి నమస్కరించి వెనుదిరిగి చూడకుండా బయలుదేరాను. వెనుదిరిగిచూస్తే వెళ్లలేనేమోననిపించింది.

మామయ్య నాకోసం కాచుకునివున్నాడు.

నాకు తెలును- ఇక ఆఇంటి తలుపులు శాశ్వతంగా మూసుకుపొయ్యాయి.

పదిరోజుల్లో నాన్న నాకు ఖర్మక్రతువులు జరిపిస్తాడు...

కడుపుమంటతో కుళ్ళికుళ్ళి ఏడుస్తాడు...

తరువాత క్రమంగా మర్చిపోతాడు.

దుఃఖాన్ని దిగమింగుకోవడానికి ప్రయత్నిస్తూ నడుస్తున్న నాకు మామయ్య ధైర్యం చెబుతూనే ఉన్నాడు. మేం రైల్వేస్టేషన్‌కి చేరుకునేసరికి శ్రీకాంత్ మాకోసం ఎదురుచూస్తున్నాడు. నన్ను చూడగానే అతడి కళ్లు మెరిసిపోయాయి.

"సీతా" అన్నాడు ఆనందంగా, ఆరాటంగా.

నవ్వబోయాను...

నవ్వు రాలేదు...

నా మానసిక పరిస్థితిని అర్థం చేసుకుంటున్నట్టు నా చెయ్యి నొక్కాడు ఓదార్పుగా 'నీకు నేను లేనా?' అన్నట్టు.

"జాగ్రత్త బాబూ! బయటి ప్రపంచం చూసిఎరుగని బిడ్డ. చిన్నది. నిన్ను నమ్మి నీ చేతుల్లో పెడుతున్నాం. ఇకనుండి దానికి అన్నీ నువ్వే. వెంటనే పెళ్ళి చేసుకోండి బాబూ! కనీసం ఆ కార్యం మాచేతులమీద జరిపించలేని దురదృష్టానికి చాలా బాధగా వుంది. మీ క్షేమంగురించి ఉత్తరాలు రాయి బాబూ" అన్నాడు.

"మీరు నిశ్చింతగా వుండండి. సీతకోసం అందర్నీ వదులుకుని వచ్చిన నేను సీతని నా ప్రాణంలాకాక ఇంకెలా చూసుకుంటాను? సీత నా సర్వస్వం ఇకనుండి. మేం చాలాదూరం వెళ్లిపోతున్నాం. వెంటనే పెళ్ళి చేసుకుంటాం సాంప్రదాయబద్ధంగా. నా దగ్గర్నుండి ఉత్తరం రావడం ఆలస్యం అయినా ఖంగారు పడకండి. ఎప్పుడోగానీ రాయను. మా వాళ్ళకి తెలిసిందంటే చాలా ప్రమాదం. నేనెంతగా జాగ్రత్తలు తీసుకున్నానంటే కనీసం నా ఫొటో ఒకటి అయినా ఎక్కడా వాళ్ళకి దొరక్కుండా జాగ్రత్తపడ్డాను. నా ఫ్రెండ్స్ దగ్గరున్న నా ఫొటోలుసైతం వెదికివెదికి వెనక్కితీసుకున్నాను. రేపు వాళ్ళు పేపర్ ప్రకటన ఇవ్వచ్చు. దాదాపు నేను మరణించినట్టు వాళ్ళని నమ్మించే ప్రయత్నం చేశాను" అతడు చెబుతుంటే మామయ్యా, నేనూ తెల్లబోయిచూ...

పిన్నిలాగే ఆలోచించాడితడు.




"మీవాళ్ళ దృష్టికి అందనంత మారుమూల ప్రదేశానికి వెళ్ళిపోతున్నాం. డబ్బు ఇబ్బందేమీకూడా లేదు ప్రస్తుతం. ఓ పదివేలు తీసుకురాగలిగాను'' అన్నాడు.

ఇంతలో రైలొచ్చింది.

మామయ్య నాతో ఆనందంగా, "ఇతడి దగ్గర నువ్వు చాలా సుఖపడతావమ్మా" అన్నాడు నా తలమీద చెయ్యివుంచి.

మేం ఇద్దరం ట్రైన్ ఎక్కాం. మామయ్య చెయ్యి వూపుతూ పైకండువాతో కళ్ళు తుడుచుకుంటూ నిలబడ్డాడు.

ఆ రిజర్వేషన్ కంపార్ట్‌మెంట్‌లో మేం ఇద్దరమే.

"సీత" ఓదార్పుగా పిలిచాడు. శ్రీకాంత్.

అతని గుండెల్లో తలదాచుకుని హృదయ భారం తగ్గేలా ఏడ్చాను.

"ఇదే ఈ జీవితంలో చివరి ఏడుపుకావాలి" అర్ధంగా అన్నాడతను.

★ ★ ★

అది చాలా చిన్నపల్లె. ఓ రెండొందల కుటుంబాలు వుంటాయేమో. కరెంటూ, రోడ్లూ, బస్సుల్లాంటి కనీసపు సౌకర్యాలుకూడ లేన్ని పల్లెటూరు. ఆ వూళ్ళో పిల్లలకి స్కూలుకూడా లేదు. ఇదే మాకు ఇక్కడ జీవనాధారం అయింది.

పక్క వూళ్ళో గుళ్ళో దేవుడి ఎదుట నా మెడలో పసుపుతాడు కట్టాడు శ్రీకాంత్. భార్యాభర్తలంగా ఆ వూళ్ళో ఓ చిన్న పూరింట్లోకి అడుగుపెడుతున్నప్పుడు "నాకోసం ఇతడెంత త్యాగం చేశాడూ?" చాలా కృతజ్ఞతగా అనుకున్నాను.

అతడికోసం నేనూ త్యాగం చేశానని ఇద్దరం సుఖపడాలన్న మా మా స్వార్థాలతో జీవితాల్ని కలిపి ముడేసుకున్నామని అప్పట్లో నేను ఆలోచించలేకపోయాను.

ఆ వూర్లో మాకు అవసరమైనదానికంటే అధికంగా ఆదరణ లభించింది. చిన్న స్కూలులాంటిది ప్రారంభించాడు శ్రీకాంత్ అక్కడ.

పాలూ, కూరలూ, నెయ్యిలాంటివి వూళ్ళోవాళ్ళు ఉచితంగా తెచ్చి ఇచ్చేవాళ్ళు ఎంతో అభిమానంగా. మాస్టారుగా శ్రీకాంత్‌ని, అతడి భార్యగా నన్ను ఎంతగానో గౌరవించేవాళ్లు. పిల్లలతో అతడు బాగా శ్రమ పడేవాడు.

అదే అనేదాన్ని "హాయిగా సిటీలో బట్టలు కూడా నలగకుండా కార్లో కాలేజికి వెళ్ళి రోజుకో రెండు గంటలుమాత్రమే శ్రమ పడాల్సిన నువ్వు నాకోసం ఈ పల్లెలో ఏ సౌకర్యాలూలేని ఈ పూరికొంపలో ఎంతగా బాధపడుతున్నావు?"

"నీ మొహం... నీకోసమేనా? నా సుఖం... స్వార్థం లేవూ ఇందులో. నాకీ జీవితమే బాగుంది. నా తండ్రి కారులో కాలేజికి వెళ్ళి రెండు గంటలు శ్రమపడి రెండు వేలు జీతం అందుకోవడంకంటే ఎక్కువశ్రమపడి దానికి తగిన ఫలితాన్ని సాధించడంలో వుండే సంతృప్తిని అనుభవిస్తున్నాను. అంతకంటే ఇంకేంకావాలి? విలాసవంతమైన జీవితం మీద కోరిక వుంటే ఇంతదూరం రానుకదా'' అనేవాడతడు.

అంతేకాదు, "ఈ వూళ్లో మనమో పొదరిల్లులాంటి చిన్న ఇల్లు కట్టుకోవాలి. కొన్త పొలం కొనుక్కోవాలి...'' శ్రీకాంత్ కోరికలకి నవ్వేదాన్ని.

నాకు తలనొప్పి వస్తే సహించలేక విలవిల్లాడిపోయేవాడతడు.

అతడితో గడిపిన రెండు సంవత్సరాల జీవితంలో చిట్టిపొట్టి అలకలూ, ఒట్టొట్టి చిలిపికయ్యాలూ తప్ప కష్టమన్నదేలేదు. ఇంకా చుట్టుపక్కల పల్లెల్లోని టెన్త్, ఇంటర్, డిగ్రీ స్టూడెంట్స్‌కి కూడా ట్యూషన్స్ చెప్పడానికి ఒప్పుకున్నాడు. ఖర్చులు తక్కువ. రాబడి బాగా వుంది. పల్లెలో చాలా వస్తువులు కొనాల్సిన అవసరమే లేదు. పైగా పిన్ని పెంపకంలో పెరిగిన నాకు పొదుపుగా సంసారాన్ని నడుపుకురావడం ఎలాగో బాగానే పట్టుబడింది. మిగిలిన డబ్బుని బ్యాంకులో నాపేరు మీద దాచేవాడు శ్రీకాంత్. ఉన్నంతలో సుఖాన్ని తప్ప కష్టాల్ని అనుభవించలేదు ఏనాడూ.

రోజులు గడిచినా అతడికి నాపట్ల వున్న ప్రేమ ఏకొన్త తగ్గడంకానీ, తనవాళ్ళమీదకి మనసు మళ్ళడంకానీ జరగలేదు. మా క్షేమం తెలుపుతూ మామయ్యకి ఓ రెండు ముక్కల ఉత్తరాలు రెండుకాబోలు వేశాం. మా అడ్రను మాత్రం ఇవ్వలేదు. అప్పుడప్పుడూ పిన్నీ నాన్నా తమ్ముళ్ళూ గుర్తొచ్చేవారు. చాలా దిగు




లుగా అనిపించేది.

చిటికెలో ఆ దిగుల్ని మరిపించేవాడు శ్రీకాంత్.

అతడి కొంటెదనంతో, అతడి అల్లరితో, అతడి ప్రేమతో, అతడి అభిమానంతో ప్రతిరాత్రీ తొలిరాత్రిలా గడిచిపొయ్యేది.

ఈ ఆనందంలో ఒక అపశృతి పలికింది.

ఆ అపశృతి పేరు వినోద్.

★ ★ ★

"నాగురించి పూర్తిగా మర్చిపో. నిన్ను నేను మర్చిపోవడానికి ప్రయత్నిస్తాను. జరిగిందో పీడకలగా భావిస్తే సరిపోతుంది"

నా ఆలోచనల్ని చెదరగొడుతూ అతడి కంఠం వినిపించింది.

అతడివైపు చూస్తున్నాను...

సిగరెట్ ముట్టించుకుంటున్నాడు.

ఈ నాలుగు రోజుల్లో కొత్తగా అయిన అలవాటు ఇది.

పీడకలలా మర్చిపోవాలా?

దేన్ని?

ఇతడి పరిచయాన్నా? స్వర్గంలా గడిచిపోయిన రెండేళ్ళ జీవితాన్నా?

లేక నాలుగు రోజుల క్రితం జరిగిన దురదృష్టకర సంఘటననా??

లేక ఇతణ్ణేనా???

ఎంత సులభంగా చెప్పేశాడు?

నేను గాబట్టి ఇంత నిబ్బరంగా వుండగలుగుతున్నాను. ఇంకో ఆడదైతే గుండెపగిలి చావదూ? కనీసం నేను ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతానేమోనన్న మాటైనా అతడికి రాలేదా?

చస్తేచావనీ అన్నంత విరక్తి కలిగిందా?

నిజంగా విరక్తేనా అది?

ఈ వూళ్ళో ఈ జనాలకి భయపడి వుండలేకపోతే ఆ మరోవూరికి నన్నుకూడా తీసుకెళ్ళి కొత్త జీవితం ప్రారంభించవచ్చునే...!

అలా ఎందుకు చెయ్యడు?

అందుకు సమాధానం ఒక్కటే! రామాయణం అన్నది కల్పితకథో, యదార్థగాథో నాకు తెలీదుకానీ రాముడినుండి సంక్రమిస్తున్న సంకుచితత్వం ఇది. ఒకవేళ ఇప్పుడు నేను 'ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతాను' అని బెదిరిస్తే?

ఏం చేస్తాడు ఇతడు?

'చేసుకో, నాకేం నష్టం?' అంటాడా?

కాదు! నాకు తెలుసు! అలా అనడు!

'నీకంటే ముందు నేనే చస్తాను' అంటాడా?

అలాక్కూడా అనడు!

ఎందుకు అనడూ- అంటే అతడికి ఇంకా జీవించాలని వుంది. జీవితంమీద ఆశలూ, బతుకుమీద మమకారం వున్నాయి. అందుకే ఇంత అవమానాన్ని భరిస్తూ ఈ నాలుగురోజులుగా ఈ వూళ్ళో వుండి ఈ నిర్ణయం తీసుకున్నాడు.

అతడు ఇంకోలా చేసినా నాకు సంతోషమే...

విషం తెచ్చి, "నేను పిరికివాణ్ణి. సంకుచితుణ్ణి. స్వార్థపరుణ్ణి. నన్ను క్షమించు సీతా! మనం ఇద్దరం కలిసి జీవించడానికి ప్రయత్నించాం. ఇదిగో విధి మూలంగా ఈ రూపేణా విఫలం అయ్యాం. ఇక మన దాంపత్యం కొనసాగదు. కాబట్టి ఇద్దరం చచ్చిపోదాం" అనివుంటే?

నన్ను చావమనే అధికారం తనకి లేదనుకున్నాడా?

నాకు నవ్వొచ్చింది. అంతదూరం అసలతడు ఆలోచిస్తేగా?

పాపం మగవాడు!

పాపం ఈ సమాజంలో ఒక మనిషి!

ఏమిటి ఇతన్నిగురించి ఇంత సానుభూతిగా ఆలోచిస్తున్నాను నేను- ఈ సమయంలో కూడా! మరో అయిదునెలల్లో నా కడుపులోని ఇతడి బిడ్డ ఈ ప్రపంచంలో కళ్ళు తెరవబోతోంది. అయినా ఈ జనారణ్యంలో నన్ను నిర్దాక్షిణ్యంగా వదిలేయడానికి నిర్ణయించుకున్న ఇతడి మీద నాకు కోపం రాదేం?

నేను పిచ్చిలా ఆలోచించగలుగుతున్నందుకా?

ఒక సగటుమనిషి అయిన ఇతణ్ణి అర్థం చేసుకోగలుగుతున్నందుకా?

అంటే... నేనేకాదు, నా (తన) బిడ్డకూడా ఇతడికి అవసరంలేదు!

ఎన్నో కలలుకంటూ, మరెంతో పొంగిపోతూ

ఆ బిడ్డ రాకకోసం ఎదురుతెన్నులు చూసిన ఇతడికి ఆ ఒక్క సంఘటన కారణంగా ఆ బిడ్డమీద కూడా విరక్తి పుట్టిందా?

ఇతడి ప్రేమ విరిగిపోయిందా?

సరే... నేను మైలపడ్డాననుకో! అణ్ణెంపుణ్యం ఎరుగని ఆ బిడ్డేంచేసిందని?

నా కడుపులో వుంది కాబట్టి నా ద్వారా ఆ బిడ్డకూడా అపవిత్రమైపోయిందా?

"నువ్వు నాకొద్దు. నా బిడ్డని మాత్రం నాకియ్యి సీతా" అని అతడు అడిగితే నేను కాదంటానా?

అంత హృదయంలేనిదాన్నా నేను?

నన్నతడు అర్థం చేసుకోలేదా?

నేనే అతణ్ణి అర్థం చేసుకోవడంలేదేమో? నేను అవసరంలేనప్పుడు నా బిడ్డకూడా అతడికి అవసరంలేదు.

ఆ బిడ్డని పోషించుకోగలిగే ధైర్యం అతడికి లేదేమో?

అతడి భవిష్యత్తుకి ఆ బిడ్డ ఆటంకం అవుతుందేమో?

లేక దయతలచి బిడ్డని నాకు వదిలేస్తున్నాడా?

నాకు నవ్వొచ్చింది.

ఇతడి గురించి ఎంత ఉన్నతంగా ఆలోచిస్తున్నాను నేను?

ఎంత పిచ్చిదాన్ని?

అసలు వినోద్ కన్ను నా మీద పడింది అన్న విషయం తెలిసీ దానికంత ప్రాముఖ్యత ఇవ్వందీ, పెద్ద జాగ్రత్త తీసుకోందీ ఇతడు కాదూ?

అతణ్ణి భయపెట్టి వున్నా అతడితో పోట్లాటకి వెళ్ళి వున్నా ఈ కథ మరోలా వుండేది. నలుగురికీ తెలిసివుండేది ముందుగానే. వినోద్ ఇంత ధైర్యం చెయ్యలేకపోయేవాడు.

కానీ ఇతడేం చేశాడూ?

"వాడి మొహం, ఇది వూరు కాదూ?" అన్నాడు.

"వాడేం చెయ్యగలడూ?" అన్నాడు.

"దీన్నో పెద్ద సమస్యలా తీసుకుని ఎందుకు పట్టించుకుంటావు సీతా?" అన్నాడు. అంతేగానీ, వూళ్ళో పెద్దలకో, వినోద్ తండ్రికో ఎందుకు చెప్పలేదు?

అతడికే వార్నింగ్ ఎందుకివ్వలేదు?

కనీసం నన్ను ఇంట్లోనుండి బయటికి వెళ్ళద్దు అని ఎందుకు చెప్పలేదు?

అతడేం చెయ్యగలడన్న లెక్కలేనితనమా?

మనుషుల మంచితనం పట్ల ఇతడు ఏర్పరచుకుని వున్న విశ్వాసమా?

రెండోదే నిజం కావచ్చుగా?

ఇవేవీగాక నలుగురికి తెలిస్తే చిన్నతనంగా నామోషీగా, వుంటుందని భయపడ్డాడా?

ఏమో...ఏమీ అర్థంకావడం లేదు.

ఇరుగూపొరుగూతో కలసి వూరి చివరనున్న బావికి వెళ్ళి నీళ్ళు తెచ్చుకునే నన్ను ఓ జత కళ్ళు ఆసక్తిగా ఆకలిగా గమనిస్తున్నాయనీ, ఆ కళ్ళు ఓ వయసులో వున్న యువకుడివనీ, అతడు ఈ వూరికి రాజులాంటి ఓ భూస్వామి తిరుగుబోతు కొడుకనీ- ఈవిషయాలన్నీ తెలుసుకున్నరోజు భయం వేసింది.

నా భయం అర్థం లేనిదన్నాడు శ్రీకాంత్.

"ఇంతమాత్రానికే ఇలా భయపడేదానివి సిటీలో అయితే ఏంబతగ్గలవు పిచ్చి సీతా" అన్నాడు.

అతడి మాటలు నాకు ధైర్యాన్నిచ్చాయి. క్రమంగా వినోద్ చూపులకి అలవాటుపడ్డాను. నెలలూ ఏళ్ళూ గడుస్తున్నా అతడేం సాహసం చెయ్యకపోవడంతో అతడంతకంటే ముందుకు రాడని పట్టించుకోవడం మానేశాను. అతడు అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడని నేను వూహించలేకపోయ్యాను.

'వినోద్ అంత మంచివాడు కాదు' అన్న విషయం విని కూడా ఇంతకాలం అతడు నాజోలికి రాలేదూ అంటే భయపడుతున్నాడు, ధైర్యం చెయ్యలేకపోతున్నాడు, నా భర్త విద్యావంతుడు, ఈ వూరికి అతడి అవసరం వుంది, అతడి భార్యనైన నన్ను అతడేం చెయ్యలేడు-అని గర్వపడ్డానే కానీ పొంచి వున్న మేనీటర్‌లా అతడు తన దాహాన్ని తీర్చుకుంటాడని వూహించగలిగానా?

ఆ మాత్రపు అనుమానం నాలో కలిగివుంటే నీళ్ళకెందుకు వెళ్ళేదాన్ని?




శ్రీకాంత్ మాత్రం "ఓ మనిషిని పెట్టు కుంటే నీళ్ళు తెచ్చిపెట్టదూ? నువ్వెందుకు కష్టపడాలి సీతా" అన్నాడు.

అప్పుడు నేను- "అలా నలుగురితో కలసి సరదాగా వెళ్ళినట్టు వుంటుంది. అంతకంటే నేనెక్కడికి వెళుతున్నాను? ఊహుఁ...నేనే వెళ తాను" అన్నాను.

అతడు కాదనలేదు.

వినోద్ సంగతి తెలిశాకయినా అతడు "వద్దూ" అని వుంటే నేనెందుకు వెళ్ళేదాన్ని!

ఈ విషయంలో నేనెంత నిర్లక్ష్యంగా వ్యవహరించానో నా భర్తగా అతడూ అంత నిర్లక్ష్యంగా వ్యవహరించాడు.

నేను గర్భవతినయి వినోద్ అనే ఒక వ్యక్తి ఈ వూళ్ళో ఉన్నాడని, అతడు నా మీద కోరికతో వున్నాడనీ మర్చిపోతున్న సమయం! అలాంటి రోజుల్లో ఓ కనుచీకటి వేళ ఒంటరిగా బావి దగ్గరకు వచ్చి నీళ్ళు తోడుకెళుతున్న నన్ను తాగి ఒళ్ళు మరచినస్థితిలో వున్న వినోద్ భల్లూకంలా పట్టేశాడు. నిర్దాక్షిణ్యంగా తన కోరికని తీర్చుకున్నాడు. తన దాహాన్నీ తాపాన్నీ చల్లార్చుకున్నాడు.

శారీరకంగా బలంలేనిదాన్ని అందులో గర్భిణిని అతణ్నెలా ఎదుర్కోగలను?

నా వేడికోళ్ళూ, దీనాలాపాలూ చెవిటివాడి ముందు శంఖం వూదినట్టు ఆ తాగుబోతు మీద ఎలాంటి ప్రభావాన్ని చూపించలేదు.

శ్రీకాంత్ వూళ్ళో లేడావేళ. బ్యాంకు పని మీద టౌన్‌కి వెళ్ళాడు. ఎవరో ఈ దృశ్యం చూశారు. స్పృహలో లేని నన్ను తెచ్చి ఇంట్లో పడేశారు. ఎప్పటికో స్పృహ వచ్చింది. అప్పటికి శ్రీకాంత్ వచ్చాడు. ఊళ్ళోవాళ్ళొచ్చి విచారం ప్రకటించిపోతున్నారు. ఒకరిద్దరు పోలీసు రిపోర్టు ఇవ్వమన్నారు.

"అమ్మో...వద్దు- పరువు పోదూ" అన్నారెవరో.

"పాపం ఇంత జరిగాక చెడిపోయిన భార్యతో ఎలా కాపురం చేస్తాడో మాష్టారు" అన్నారు ఎవరో.

శ్రీకాంత్ ఉలకలేదు పలకలేదు. నా దగ్గరికి రాలేదు. నన్ను ఓదార్చలేదు.

కనీసం నావైపు కన్నెత్తి కూడా చూడలేదు.

గాలివానలో చిగురుటాకులా వణికిపోతున్న నా మనసుని నేనే మభ్య పెట్టుకోచూశాను.

కొందరాడవాళ్ళు వచ్చారు. నాకు శైత్యోపచారాలు చేశారు.

"నయం... కడుపు పోలేదు! అదృష్టవంతురాలే" అన్నారు.

"ఏంఅదృష్టం...శీలం పొయ్యాక" అన్నారు కొందరు.

నేను విన్నాను. నాతోపాటు శ్రీకాంత్ కూడా విన్నాడు ఆ మాటలు.

అతణ్ని పలకరించే ధైర్యం నేను చెయ్యలేదు.

నన్ను దగ్గరికి చేరదీసే ధైర్యమో, మానవత్వమో... ఏదో అతడిలోలేదని ఇప్పుడు పూర్తిగా అర్థమైంది నాకు! ఎంత ప్రేమించేవాడైనా ఈ దేశపు నగటు మగాడు ఆ ప్రేమని ఎంతవరకు పరిమితం చేసుకోగలడు అర్థంచేసుకుంటున్న కొద్దీ ఈ దేశపు స్త్రీజీవితం పట్ల నాకు చాలా జాలి కలుగుతోంది.

ఇదేమిటి నేను నాగురించికాక, అంధకార బంధురంలా కనబడుతూన్న నా భవిష్యత్తుగురించి కాక ఇలా ఆలోచిస్తున్నానూ?

ఎందుకు నా ఆలోచనాసరళిలో ఇంతఅనూహ్యమైన మార్పు వచ్చింది?

రేపట్నుండి ఈ సమాజంలో ఇనుపముక్కుల కాకుల్లాంటి ఈ మనుషులు నన్నెంత బాధపెడతారో నాకు తెలుసు! ఓదార్పవచ్చిన వారి సానుభూతి హక్కులవెనకఉన్న చులకనని, అంతులేని కుతూహలాన్ని ఇంకా పేరు పెట్టి ఇదీ అనిచెప్పలేని కిందస్థాయి భావాల్ని వాళ్ల కళ్లల్లో, మొహంలోనూ గమనిస్తూనేవున్నాను!

ఈనాలుగు రోజులు భయం, దుఃఖం బెంగా నాలో ఘనీభవించి ఆలోచనలు కొత్త మలుపుతిరిగాయి! సమస్యల్ని సంఘటనల్ని మనుషుల ప్రవర్తన వెనకవున్న పరిస్థితుల్ని విశ్లేషించి చూడటం ప్రారంభించింది నా మనోనేత్రం నాప్రమేయం లేకుండానే.

ఫలితంగానే కాబోలు నాకు శ్రీకాంత్‌మీద




కోపం, అసహ్యం, ద్వేషంలాంటి భావాలు కలగ డంలేదు!

'నాజీవితం ఏమిటీ?' అన్న ప్రశ్నార్థ కంకూడా నా ముందు నిలవదేం?

జీవితంలో ఇరవై ఏళ్లు మాత్రమే గడి చాయి!

మిగిలిన జీవితాన్ని నాతోపాటు మరో ప్రా ణిని బతికించుకోవడం ఎలా అన్న దిగులు నాలోకలగదేం?

నాకేం అర్థంకావడంలేదు!

ఇంతనిబ్బరం ఇంతలో ఎలావచ్చి చేరింది నాలో?

జీవితంలో తొలిసారిగా బలంగా తగిలిన ఈ దెబ్బ నన్నింత ధైర్యవంతురాల్ని చేసిందా?

అదే నిజమైతే నేనెంత అదృష్టవంతురా ల్ని?

వేకువ ఝాము అయింది...

శ్రీకాంత్ తన సూట్‌కేస్, బ్యాగు అందుకు న్నాడు! నావైపైనా చూడలేదు!

"వెళుతున్నాను" అనేసి ఇంట్లో నుండి బయటకినడిచాడు!

ఘనీభవించిన దుఃఖంలోనుండి, ఏ వైపు నుండి ఉబికి దూసుకువచ్చిందోగానీ ఓ కన్నీ టిచుక్కవచ్చి నా ఎడమకను కొలుకులో నిలి చింది!

మూడుముళ్ల బంధాన్ని మానసికమైన పవిత్రబంధాన్ని నిర్దాక్షిణ్యంగా తెంచేసుకుని వెలుగులోవెళ్లే ధైర్యంలేక చీకట్లో పారిపోతున్న ఆ మామూలు మనిషివైపు చూస్తూ జాలిగా నిట్టూర్చాను.

శ్రీకాంత్ నామానాన నన్నువదిలి వెళ్ళిపో యాడని తెలిశాక నలుగురూ నాలుగు రకా లుగా అన్నారు!

"అతడంతపని చేస్తాడనీ తెలును! మగాడ న్నవాడు ఇంతపని జరిగాక పెళ్లాన్ని ఎలా ఏలుకోగలడు"? అందొకావిడ!

"మగాడంటే మాస్టార్" అన్నాడొకాయన!

"మంచిపనిచేశాడు! అతడి అవతారం చూసి ఆత్మహత్యచేసుకుంటాడేమోనని భయ పడ్డాను"

అంతా ఇలా అన్నవాళ్లే గానీ "అయ్యో! ఈ అమాయకురాలి తప్పేముంది? అతడెలా నిర్దా క్షిణ్యంగా ఎలా వదలివెళ్లగలిగాడు? ఒంటరిగా ఎలా బతుకుతుంది? అందులో నూ గర్భవతి"... అన్నవాడు ఒక్కరూలేరు!

అంతదాకా నామీద ఆదరణ చూపించిన ఈ జనాలు ఇప్పుడు నా మీద కక్షగట్టినట్టు మాట్లాడటం ఆశ్చర్యంగా, విషాదంగా చూ స్తుండిపొయ్యాను!

మగాడి అండలేని ఆడదాని జీవితానికి విలువలేదా?

అందుకేనా పిన్ని అన్ని కష్టాలు అనుభవి స్తూ కూడా నాన్నతో సంసారం కొనసాగిస్తోందా?

"ప్రేమించి, తల్లి దండ్రుల్నికాదని ఇలావ చ్చినవాళ్ల బతుకులంతా ఇంతే" అన్నారు అందరూ!

నన్నొక శత్రువులా చూస్తున్నారు! ము ఖ్యంగా స్త్రీలు! అదే నాకు ఆశ్చర్యం కలి గించింది! 'స్త్రీకి స్త్రీయే శత్రువు' అన్న విష యంలో ఎంత నిజంవుందో నాకు బాగా తెలిసి వస్తోంది. వీళ్ల మాటలు, ప్రవర్తనా, ఈ తీర్లూ...

"ఈ వూరొచ్చారేగానీ ఒక్కనాడైనా పాపం అతని తల్లీతండ్రీ అనివచ్చారా? అంత చదు వుకున్నవాణ్ని కొంగుకి ముడేసి తెచ్చుకుంది! ఆపెద్ద చదువుకి చాలా పెద్ద ఉద్యోగం వచ్చే దట" ఒకనాడు శ్రీకాంత్ సాహసాన్ని నా అదృష్టాన్ని పొగిడినవారి మాటలేఇవి!

అప్పుడలా ఎందుకందీ?

ఇప్పుడిలా ఎందుకంటోందీలోకం!

ఆనాడు నేను భర్త అనే మగవాడి అండలో వున్నాను. అతనికి వూళ్లో గౌరవం లభించింది! అతడి భార్యగా నాకు అందులో భాగంఇచ్చారు! ఇప్పుడతడు లేడు! పైగా అతడు చదువుకున్నవాడు! అందగాడు! నాకోసం అందర్నీ వదులుకుని వచ్చాడు అన్న విషయం, వీళ్లల్లో చెప్పలేని ఈర్ష్యని కలి గించాయి!

అయితే ఈనాడతడులేడు, అతడి అవ నరం వీళ్లకి లేదుగాబట్టి, నాతో అనలే అవ నరం లేదుగాబట్టి పైగా నేను ఆడదాన్ని కాబట్టి ఇలా నిర్మొహమాటంగా తమ ఈర్ష్యాసూ యల్ని ఈ రూపంలో కక్కేస్తున్నారు!



"అనలు ఈవిడెవరు నీళ్లకి వెళ్లమన్నా రూ! మాస్టారు బాగానే సంపాదించేవాడు గదా? ఒక మనిషిని పనికి కుదుర్చుకుంటే పోలా? నన్నుచూడు, నా అందంచూడు అంటూబయలుదేరింది! అన్నివేళలూ మనవేనా? ఎదుటివాళ్లిచ్చే ఈగౌరవాన్నినిలుపుకోవడం అందరికీ తెలీవద్దూ"?

వీళ్లే ఒకప్పుడు "ఎంత నిగర్వులండీమీరు. బాగా చదువుకున్నభర్త! చక్కని దీపంలాంటిరూపం! ఇల్లుదాటకుండా దర్జాగా బతకవచ్చు! ఊరంతా గౌరవించే వాళ్లే. అయినా మాతో కలిసి బిందెపట్టుకుని నీళ్లకి వస్తున్నారంటే ఎంతమంచి వాళ్లు..."ఇలా అంటూ మొహమాటపడేలా పొగిడినవారే.

అంతాకలసి "అనలెలా బతుకుతుంది"? అని వాళ్లని వాళ్లు ప్రశ్నించుకున్నారు! అంటే "భర్త"లేడుగాబట్టి బతకలేనని వీళ్లనుకుంటున్నారు!

బతకలేనా??

"ప్చ్... ఈ వూళ్ళో బతకలేదు" తీర్మానించుకున్నారు వాళ్ళల్లో వాళ్ళే!

'నేనెందుకు బతకలేనూ?' అన్న ప్రశ్నవేనుకున్నాను నాకు నేను.

"ఈ వూళ్ళోనే వుంటావా"? ఎవరో జాలిగా అడిగారు.

అవును! నాకు పెద్దగా చదువులేదు. ఉన్న చదువు నాగరిక ప్రపంచంలో నా పొట్టనింపుతుందన్న నమ్మకంలేదు. నేను ఇక్కడే వుండిపోతాను. నన్ను నేను పోషించుకునే మార్గాన్ని గురించి ఆలోచించసాగాను. శ్రీకాంత్ దయదలచి ఇచ్చిపోయిన డబ్బుంది. అది నాకు అవసరంలేదు. అతడి పట్ల కోపంతో కాదు ఇలా అనుకుంటూంది.

నాకాళ్ళమీద నేను నిలబడటానికి, నా జీవితాన్ని నేను నిర్మించుకోవడానికి పునాదులు ఇప్పుడే ఏర్పాటు చేసుకోవాలి. ఎలా అది?

బతకడానికి ఉపయోగపడే మార్గాలు నాకేం తెలుసూ? అని ఆలోచించాను.

నాకేమీ తెలీదు. కనీసం టైలరింగ్ కూడా నాకురాదు. ఏదో ఎంబ్రాయిడరీ కొన్తవచ్చు. అది కడుపునింపదు. బయట పనులు నాకు రావు. ఎలా... ఏంచేసి బతకాలి నేను?

ఇంతకాలం ఇల్లు ఇచ్చి అద్దెసైతం తీసుకోవడానికి ఒప్పుకోని ఆయింటి యజమాని "నాలుగురోజుల్లో ఇల్లు ఖాళీ చెయ్యమ్మా" అన్నాడు మర్యాదగానే.

"నేను ఇక్కడే వుంటానండీ! మీ అద్దె మీకు కడతాను" అన్నాను.

"ఏమిటి?" ఆశ్చర్యపోయాడాయన "ఈడూరొదిలి పోవా"?

"ఎక్కడికి వెళ్ళను? నాకెవరూలేరు" అన్నాను. నేను దయనీయంగా అనలేదీ మాట, చాలా మామూలుగా చెప్పాను.

కానీ, ఆయన నావైపు చాలా జాలిగా చూశాడు "అద్దెనువ్వెక్కడ ఇవ్వగలవమ్మా"? అన్నాడు.

"ఫరవాలేదండీ! నా దగ్గర డబ్బుంది. ఇస్తాను" అన్నాను.

ఆయనేం అనుకున్నాడో వెళ్ళిపోయాడు.

నిజంగా నేనెక్కడికి వెళ్ళగలను? నా పుట్టింటికి నేనెప్పుడో చచ్చిపోయాను. ఆడపిల్లల తండ్రి మామయ్యకి నేనుభారంకాలేను. నేను ఇక్కడే వుండిపోవాలి.

శ్రీకాంత్ ఉన్నప్పుడు ఎపుడూ ఏదో ఓ పిండివంటో, కూరో తెచ్చి నన్ను బతిమాలి దాదాపు అంటగట్టినవాళ్ళు ఇప్పుడు నన్ను పట్టించుకోవడం మానేశారు.

నేను ఓపిక తెచ్చుకుని లేచాను. దొడ్లో ఉప్పునీళ్ళ బావిలోంచి నీళ్ళు తోడుకుని స్నానం చేశాను. ఇంట్లో వంట సరుకులూ బియ్యం అన్నీ వున్నాయి. వారం క్రితమే తెచ్చి పడేశాడు శ్రీకాంత్. నాఒక్క దానికి రెండు నెలలపాటు సరిపోతాయి. డబ్బు నా సూట్‌కేసులో ఎనిమిది వందలుంది. ఆనాడు మామయ్య ఇచ్చిన డబ్బు! "నీ దగ్గరే వుంచు" అంటూ శ్రీకాంత్ తీసుకోలేదది!

ఎప్పుడో ముఖ్యావసరాలకి నేనేతీసి ఓ రెండు వందలు వాడాను. ఎప్పుడైనా తను అవసరమై తీసుకున్నా వెంటనే ఇచ్చేసే వాడతడు. అది చూసి కాస్త ధైర్యం వచ్చింది.

ఓ మూడు నెలల పాటు నిశ్చింతగా వుండవచ్చు. ఈ లోపల ఆలోచించాలి ఏదో మార్గా




న్ని! ఆ పూట వంట చేసుకుని తిన్నాను. ఈ లోపల ఇంటి యజమాని వూళ్ళో నామాటల్ని చాటింపేసేశాడు. ఒక్కొక్కరే రావడం ప్రారంభించారు.

"నిజంగా నువ్వు ఇక్కడి నుండి వెళ్ళవా సీతా"? ఆశ్చర్యంగా అడిగిందొకావిడ! "వెళ్ళను" చిరునవ్వుతో అన్నాను.

"ఇక్కడే వుంటావా"?

"అవును"

"ఎలా బతుకుతావు"? నేను వంట చేసుకున్న విషయం గమనించి శ్రద్ధగా పరీక్షిస్తూ అడిగింది.

"ఎలాగో బతుకుతాను"

"అవున్లే- పుట్టించినవాడు తిండి పెట్టక చంపుతాడా?"

నేను ఇక్కడే వుండి పోతాననడం వాళ్ళకి చాలా ఆనందం కలగజేసింది. నేను వాళ్ళకొక కాలక్షేపాన్నవుతానన్న ఉత్సాహం అది.

ఒక వృద్ధురాలు మాత్రం అంది "అయ్యో! అందమైన ఆడపిల్లవి! ఒంటరిగా ఈలోకంలో ఏ విధంగా బతుకుతావు తల్లీ? ఆ దేవుడు నీ బతుకు బండలుచేశాడు".

"పోనీలే అవ్వా! ఎంత చేసుకున్నవాళ్ళ కంత అనుకుందాం! నాకు మీరంతా లేరా? మీరు మాత్రం తోడుకాదూ? వూళ్ళోంచి తరిమి కొడతారా? ఏదోలా బతుకుతాను" అన్నాను.

ఆవిడ నిట్టూర్చి వెళ్ళిపోయింది- ఊరంతా ఇదొక వింతవార్తయిపోయింది.

ఆ వృద్ధురాలే సలహా ఇచ్చింది- "విస్తరాకులు కుట్టు! అప్పడాలు చెయ్యడం నేర్పిస్తాను. ఒత్తుకో! ఊరగాయలూ అవీపెట్టుకో! నేను అమ్మిపెడతాను".

"అలాగే నేర్పించవ్వా! పొలం పనులూ అవీ నేను చెయ్యగలనా?" అడిగాను.

ముసలామెకళ్ళల్లో ఓ నీటి పొర కదులాడింది. "పూలదండలాంటి పిల్లవి! వాటికి పనికిరావమ్మా! ఎండనకా వాననకా ఒళ్ళు దాచుకోకుండా పనిచెయ్యాలి. ఆకష్టాన్ని ఓర్చుకోలేవు" అంది.

తలూపాను.

ఆ సాయంత్రం బిందె పట్టుకుని నేను వూరి చివర బావి దగ్గరికి నీళ్ళకి బయలుదేరితే వూరు మొత్తం ముక్కు మీద వేలేసుకుంది. కానీ, నా దగ్గర డబ్బు కుప్పతెప్పలుగా లేదు. నా పనులు నేను చేసుకోవాలి.

పైగా వీళ్ళమాటలకి ఎత్తిపొడుపులకీ హేళనలకీ నేను మానసికంగా సిద్ధమైపోయాను.

ఇలా నన్ను హేళన చెయ్యడం, ఎత్తిపొడవడం, ఛీత్కరించుకోవడం వీటికి వీళ్ళూ అలవాటు పడాలి. తరువాత విసుగెత్తి ఊరుకోవాలి. అదీ వీలయినంత తొందరగా పూర్తయిపోతే బాగుంటుంది. ఇప్పుడు జరిగినదానికంటే గొప్పగా నాకేమీ జరగదుగదా ఇక! అందుకే బయటికి వచ్చాను నేను.

"ఇది నిజంగా బరితెగించిన రకమే! సిగ్గూ ఎగ్గూలేనిది! ఇంత జరిగాక ఏ బావిలోనో దూకి చావకుండా దర్జాగా బతకడానికి తయారయింది" అన్నారు మొహాన్నే.

నేనెందుకు చావాలో నాకు అర్థంకాలేదు. వీళ్ళందరూ అన్నట్టు నా జీవితం నాశనం కావడానికి కారకుడుగా చెప్పబడుతున్న వినోద్ చావనక్కరలేదు.

నన్ను నిర్దాక్షిణ్యంగా వదిలివెళ్లిపోయిన నా భర్త చావనక్కరలేదు! నేనుమాత్రం చావాలి... ఏం పాపంచేశానని?

ఎందుకిలా అంటున్నారు వీళ్లు?

ఇదేనా సమాజపు మనస్తత్వం?

వీళ్లని ఇంకా అర్థంచేసుకోవాలి నేను! నవ్వుతూ వుండటం నేర్చుకోవాలి!

ఒక్క స్త్రీలమాటలేకాదు, అనేకజతల మగ చూపులు నన్నిప్పుడు పట్టి పట్టి చూస్తున్నాయని కూడా తెలిసింది!

'చూసుకోనీ- నాకేం నష్టం' అనుకున్నాను ఉదారంగా.

క్రమంగా నాకర్థమైంది... నేను మామూలుగా వీళ్లల్లో కలసిపోవడానికి ప్రయత్నించినా వీళ్లు నన్ను తమలో కలుపుకోవడానికి ఇష్టపడరని! దాదాపు నన్ను వెలివేశారని! అయినా నాకు బాధ కలగలేదు! తమలాంటి ఒక మనిషిని, సాటిమనిషిని, కష్టాల్లో వుందని వీళ్లు భావిస్తోన్న ఆ మనిషికి ఏకాస్త చేయూతనయినా అందించడానికి చేతనయివుండికూడా

వీళ్లు అంగీకరించటం లేదంటే ఏం అనుకోవాలి?

తెలియనితనం అనుకోవాలా ?

అలాంటప్పుడు వీళ్లమీద నాకుకోపం ఎందుకూ పాపం?

హఠాత్తుగా ఎవరో అడిగారు "నీ మెడలో మంగళసూత్రాల తాడేది సీతా... తీసేశావా?" చాలా ఆశ్చర్యంగా.

నేనేమీ సమాధానం చెప్పలేదు! తలూపి పూరుకున్నాను! ఆరోజు వినోద్‌తో పెనుగులాటలో అది తెగిపోయింది. మళ్లీ వేసుకోవాలని నేననుకోలేదు! అదే పెద్ద తప్పయిపోయింది అందరిదృష్టిలో! వేసుకోవాలని నాకనిపించలేదు!

అది మెడలో వున్నంత మాత్రాన నా జీవితానికి విలువవస్తుందా?

విలువ అంటే ఏమిటసలు?



క్రనుచీకటి పడుతోంది! సంధ్యదీపం వెలిగిస్తున్నాను! ఎవరో ఇంట్లోకి వచ్చారు! అడుగుల చప్పుడికి తలతిప్పిచూశాను! అతనిపేరు హరీంద్ర! ఈవూరే! పక్క వూళ్లో టీచర్‌గా చేస్తున్నాడు! భార్య రెండేళ్లక్రితం పోయింది! శ్రీకాంత్‌కి మంచిస్నేహితుడుగా వున్నాడు! ఇంటికి రావడం అలవాటే! శ్రీకాంత్ వెళ్లిపోయాక ఇదే రావడం!

నేను కూర్చోండి అనకముందే కూర్చున్నాడు!

"నీతో మాట్లాడాలని వచ్చాను సీతా" అన్నాడు!

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది! అతడు నన్నెప్పుడూ "సీతగారూ" అని తప్ప "సీతా" అని ఇంతచనువుగా పిలిచిఎరగడు!

సరేలే... ఇతడిప్పుడు గౌరవించకపోయి నంతమాత్రాన నాకు వచ్చేనష్టం ఏముంది?

"చెప్పండి" అన్నాను నేను!

ఏం చెబుతాడితడు? సానుభూతి వాక్యాలు చెబుతాడా లేక దెప్పిపొడవడానికి వచ్చాడా? దారంట వెళుతోంటే ఏదో ఒకటి అనడంకంటే ఇంటికొచ్చి నన్ను ఏమగవాడూ మాటలనలేదింతవరకూ! అది ఇతడితో ప్రారంభమయిందా?

కానీ! నిండా మునిగినదానికి చలేముందని?

"పాపం! నీ తప్పేంలేకపోయినా నువ్వు అన్యాయం అయిపొయ్యేవు" అన్నాడతడు!

నేనేం మాట్లాడలేదు!

నేనేం అన్యాయం అయ్యాను?

"నన్ను గురించి నాకు లేనిబాధ మీకెందుకూ?' అని అడిగి వీళ్లని రెచ్చగొట్టి వీళ్ల మనసులు బాధపెట్టడం నాకు యిష్టంలేదు! మౌనంగా వినడం అలవాటు చేసుకున్నాను!

" ఆ వినోద్ గురించి నీకు తెలుసా?" రహస్యం చెబుతున్నట్టడిగాడు!

తెలీదన్నట్టు తలూపాను! పెద్దగా వివరాలేం తెలీవు నాకు.

"వాడు నాకు బంధువే! చదువుకున్న దుర్మార్గుడు వాడు! డిగ్రీవుంది! ఆపైన చదవాలంటే బద్ధకం! చిన్న ఉద్యోగాలు పనికిరావు! ఆఫీసరు ఉద్యోగాలు కావాలి! బోడిడిగ్రీకి ఎవడిస్తాడు పెద్ద ఉద్యోగం? తండ్రి పట్నంలో వ్యాపారంపెట్టిస్తే నెలరోజుల్లో తాగి దివాళాతీశాడు! ఇలా లాభంలేదని ఆయన పట్టించుకోవడం మానేశాడు! అచ్చేసిన ఆంబోతులా తిని వూరిమీదపడి తిరగడమే! ఎక్కడో వుండి వేలు వేలు ఖర్చు చేసే బదులు ఇక్కడేపడి వుండటం మేలు అనుకున్నారు అమ్మా అబ్బా! పెద్దసిటీల్లో మనం ఎంతగొప్పవాళ్లమైనా సముద్రంలో నీటిబొట్టుతో సమానమేనని గ్రహించాడు వీడు! ఇక్కడ మకుటంలేని మహారాజులా అందరిమీదా జులుం చలాయిస్తూ తిరుగుతున్నాడు! పదితరాలు పడితిన్నా తరగనంత ఆస్తి వుంది! చూసిన ఆడదాన్ని




వదలడు! వాడి అదృష్టం ఏమిటోగానీ చాలా మంది ఆడవాళ్లు వాడంటే ఎగబడతారు" చెప్పుకుపోతున్నాడు!

ఇతడు ఏ ఉద్దేశంతో ఈమాటలు చెబుతున్నాడు?

అసలు ఏమాత్రం జ్ఞానం ఉన్న మనిషి అయితే వినోద్ ప్రసక్తి నాదగ్గర తీసుకురాకూడదు! అది ఇతడికి లేదు! అంత గ్రహింపూలేదు! వినోద్ గురించి ఇతడు చెప్పేమాటల్లో నిజాలెంతవరకో నాకు తెలీదు.

హరీంద్ర మొహంలో కళ్ళల్లో గొంతులో అతణ్ణి గురించి చెప్పేప్పుడు ఈర్ష్య స్పష్టంగా కనబడుతోంది. పైగా బంధువంటున్నాడు. నేను అర్థం చేసుకోగలుగుతున్నది. ఇద్దరూ బంధువులు. ఇద్దరిదీ ఒకటే చదువు; ఇతడికి ఆస్తిపాస్తులు లేవు; భార్య పోయింది. ఇద్దరు పిల్లలు. జీతం రాళ్లతో బతకాలి.

కాని వినోద్ అలాకాదు. ఏమాత్రం కష్టపడకుండా విలాసజీవితాన్ని గడుపుతున్నాడు. అది ఇతడికి చాలా ఈర్ష్య కలిగిస్తోంది. నిజానికి మన సమాజం వినోద్‌లాంటి వ్యక్తుల్ని గౌరవించదు. పైకి గౌరవం నటిస్తుందేమో అతడి డబ్బూ, జులుం చూసి. అలాంటి వ్యక్తిని అందరిలా అసహ్యించుకోవాల్సిన ఇతడు అతణ్ణి చూసి ఈర్ష్యపడుతున్నాడూ అంటే ఇతడి సంస్కారం ఏపాటిదో నాకు అర్థమవుతుంది.

పైగా చాలామంది స్త్రీలు అతణ్ణి ఇష్టపడుతున్నారంటున్నాడు. ఇతణ్ణి గురించి నాకు తెలుసు! భార్య పోయింది. ఇతడికి స్త్రీ అవసరం వుంది. కాని పెళ్ళి చేసుకునే ధైర్యం లేదు! ఇతడికోసం ఎవరూ రారు! వినోద్ విషయం అలాకాదు! అందుకే అతడంటే ఇతడికి ఈర్ష్య!

ఈ మనుషులెంత సంస్కారులు?

వినోద్ వైభోగానికి ఈర్ష్యపడుతున్న హరీంద్రని చూస్తుంటే అసహ్యంకాదు...

అతడి బాధకి, నిస్సహాయస్థితికి జాలికలిగింది!

ఇంతకీ ఎందుకు చెబుతున్నాడు నాకిదంతా?

హఠాత్తుగా అన్నాడతడు "నువ్వు చాలా అందమైనదానివి సీతా! నీ అందం నా మతి పోగొడుతోంది! నాజూకు పరువాల బొమ్మవి నువ్వు"

నేను మొదట స్తంభించిపోయాను! క్షణంమాత్రమే! అతడి ఉద్దేశం నాకర్థమైంది!

ఒకసారితడు శ్రీకాంత్ ఉన్నప్పుడు ఏమన్నాడూ...

"సీతగార్ని చూస్తుంటే నా తేబుట్టువు గుర్తు వస్తుంది నాకు" అన్నాడు.

ఈనాడు నేను ఒంటరిదాన్నని ఒకనాడు తోబుట్టువులా భావిస్తున్న నన్ను నీఅందాలు మతిపోగొడుతున్నాయని చెబుతున్నాడు!

ఔరా... ఈ మనుషులంతా హిపోక్రట్సేనా?

మంచితనం సంస్కారం అనే ముసుగులో బతికేస్తున్నారా?

నాకు హఠాత్తుగా అనాడు అత్తయ్య పల్లెలో అన్నమాటలు గుర్తొచ్చాయి "సీత నాజూకుగా వున్నా ఎంత చక్కని అవయవసౌష్టవం అని! ఎక్కడోగానీ ఇలాంటి అమ్మాయిలని చూడం" అంది!

ప్రతీరాత్రీ నా నగ్నదేహంతో తన ఇష్టం వచ్చినట్టు ఆడుకుంటూ తమకంగా తపనగా "ఈ అందాల్ని ఈ అర్భకవపుశరీరం ఎలా భరిస్తోంది? నా మతి పోతోంది సీతా! దేవుడు నీకోసమే నన్ను పుట్టించేడేమో" మత్తుగా అనేవాడు శ్రీకాంత్!

ఇప్పుడు ఈ హరీంద్ర...

అంటే ఆడదానిలోని అందాలే మొదటగా ఎదుటి ఆడదాన్నిగానీ, మొగవాణ్ణిగానీ ఆకర్షిస్తాయన్నమాట. మొదట అందం, తరువాతే గుణం, మనసూ! ఈ సత్యం ఇంతకాలం గ్రహించలేకపోయాను!

అత్తయ్య అన్నప్పుడు, శ్రీకాంత్ అన్నప్పుడు, ఇరుగూపొరుగూ అంతా నా అందాన్ని మెచ్చుకుంటూన్నప్పుడు పొంగిపొయ్యానుగానీ నా అందాల్ని తప్ప నన్నెవరూ గుర్తించడంలేదని గ్రహించలేకపోయాను!

అనాడు శ్రీకాంత్‌ని ఆకర్షించిందయినా, వినోద్‌ని పిచ్చివాణ్ణి చేసిందయినా, ఈనాడు ఈ హరీంద్రని వెర్రెత్తిస్తున్న దయినా ఈ



అందమే! నాకంటూ ప్రత్యేకమైన గుర్తింపులేదు!

"మాట్లాడవేం సీతా! నీకు తోడులేదు! ఒంటరిగా ఈ లోకంలో ఎలా బతగ్గలవు? నేనూ ఒంటరివాడినే! నీకింకా అయిదోనెలే అనుకుంటాను! అబార్షన్ చేయించుకోవచ్చు! నాతో వచ్చి నా పిల్లల్ని చూసుకుంటూ వున్నావంటే చాలు! జీవితాంతం నీ భారం నేను మొయ్యగలను! నీకు పిల్లలు పుట్టకుండా జాగ్రత్తపడదాం! అయితే పెళ్ళిమాత్రం చేసుకోలేను..." అతడు చెబుతోంటే నివ్వెరపోయిచూస్తున్నాను.

ఈ మగాడికి ఎంత ధైర్యం?

నాకు మగతోడులేదు. తనకి స్త్రీ అవసరం. అతడి పిల్లలకి నేను చాకిరీచెయ్యాలి! పెళ్లాం అవసరం తీర్చాలి! అందుకు ప్రతిగా బతికినంతకాలం నాకిన్ని మెతుకులు పడేస్తాడు! అందుకు ప్రతిఫలంగా నా కడుపులోని బిడ్డని నేను చంపుకోవాలి! శాశ్వతంగా మాతృత్వాన్ని వదులుకోవాలి! పెళ్ళిమాత్రం చేసుకోడు!

ఎందుకు చేసుకోడూ?

చెడిపోయిన ఆడదాన్ని చేసుకునే ధైర్యంలేదు! చేరదీసే ధైర్యం మాత్రం వుంది! ఎందుకంటే అతడి మగసిరికి ఇదొక ప్లస్‌పాయింట్ అవుతుంది కాబట్టి!

తనకోసం తన సుఖంకోసం తన బిడ్డల సౌకర్యంకోసం నా జీవితాన్నే తనకి తాకట్టు పెట్టమంటున్నాడు. దానికి 'నా జీవితభారాన్ని తను మోస్తానన్నంత' పెద్దపేరు పెట్టాడు! అవతలిమనిషి అసహాయతని ఆధారంగా తీసుకుని తన అవసరాల్ని గడుపుకోవాలని చూస్తాడు మనిషి!

మనిషి ఎంత స్వార్థపరుడు?

"మాట్లాడు సీతా! శ్రీకాంత్ ఎలాగూ తిరిగి రాడు. ఇప్పటికే ఈ వూళ్ళో చాలామంది

మగాళ్ళకన్ను నీమీద పడింది! నేను మర్యాద స్తుణ్ణి. నా నీడలో నిశ్చింతగా బతగ్గలవు" అన్నాడతడు.

ఇతడు మర్యాదస్తుడా?

ఎలా?

వాళ్ళెవరో తమ కోర్కెల్ని పబ్లిగ్గా చెప్పు కుంటున్నారు గాబట్టి దుర్మార్గులు! ఇతడు సంస్కారమనే ముసుగుని నాముందు మాత్రమే విప్పుతున్నాడు. అందుకని ఇతడు మర్యాదస్తుడు! ఇతణ్ని ఒక్కణ్ని అనుకుని ఏం లాభం పాపం? ప్రపంచమే ఇలా ఉంది! సమాజంలోని ప్రతిమనిషీ ఇలాగే ఉన్నాడు! స్వార్థచింతన! పరువు మర్యాదలనే ముసుగు చాటున నికృష్టంగా బతుకుతున్నాడు!

వాటిని తొలగించుకుంటే బయటపడే రూపం చాలా భయంకరంగా ఉంటుంది! ఇలా ఆలోచించడం ప్రారంభించేసరికి నాకు అతనిమీద అసహ్యం కలగలేదు!

"సమాధానం చెప్పు సీతా" అసహనంగా అన్నాడతడు.

అప్పుడు నోరువిప్పాను నేను- "చూడండి, స్త్రీలందరూ మీరు ఊహిస్తున్నట్టు రాక్షసులుగా ఉండరు! సవతిపిల్లల్ని కన్నబిడ్డల్లా చూసుకు నేవాళ్ళుంటారు! మీకు భార్యా, మీ పిల్లలకి తల్లీ అవసరం! ఓ పేదింటి పిల్లని చూసి కట్నకానుకల ప్రసక్తి లేకుండా పెళ్ళిచేసు కోండి! అన్ని అవసరాలూ తీరిపోతాయి" అన్నాను సలహా ఇస్తున్నట్టు.

హరీంద్రమొహం ఎర్రగా అయిపోయింది! నామాటలు అతడికి కోపాన్ని అవమానాన్ని కలిగించాయని నాకు అర్థమవుతూనే ఉంది.

అతడు నాకు కాదు, నేను అతడికి క్షమాపణ లు చెప్పుకున్నాను. "మీమనసు నొప్పిస్తే క్షమించండి! మీ ప్రతిపాదనకి నేను సిద్ధంగా లేను"!

అతడు లేచి నిబడ్డాడు. "ఇంకోసారి ఆలో చించి చూడు" అన్నాడు ఇంకా ఆశ చావన ట్టు!

"ఇక ఆలోచించాల్సింది ఏమీలేదు" అన్నా ను.

"ఎలా బతుకుతావు ఈ సమాజంలో ఒంట రిగా! వినోద్‌లాంటి చీడపురుగుల మధ్య"? నచ్చజెప్ప చూస్తున్నట్టున్నాడు.

"ఫరవాలేదు... బతకగలనన్న ధైర్యం నాకుంది" నెమ్మదిగా అన్నాను.

ఆశాభంగంతో అతడి మొహం ఎలాగో అయింది. కొద్దిక్షణాలుమాత్రమే. చాలా చిత్రంగా అతడిమొహం మామూలుగా అయి పోయింది.

"ఇప్పుడు మనమధ్య జరిగిన ఈ విషయా న్ని మర్చిపో సీతా! నేను నీ విషయంలో పొరబడ్డాను! నీకలా రాసివుండి ఇలా జరి గిందిగానీ నిప్పులాంటిదానివి పాపం! నేనిలా అడిగానని ఎవరికీ చెప్పకు" అతడి కంఠంలో భయం, వేడికోలూ రెండూ ఉన్నాయి.

మళ్ళీ సంస్కారం అనే ముసుగుచాటున దాక్కుంటున్నాడు.

"ఏమో నా బాధలు అలా ఉన్నాయి..." సంజాయిషీ ఇచ్చుకుంటున్నాడు.

"నేనేమీ అనుకోను" స్పష్టంగా అన్నాను "ఎవరితోనూ చెప్పను! మీరు నిశ్చింతగా వెళ్ళి రండి" అన్నాను.

హరీంద్ర తలొంచుకుని వెళ్ళిపోయాడు.

ఇవి నా జీవితానికి మరొక హెచ్చరిక, మంచి తనం, మర్యాద అనే ముసుగుచాటున వీల యితే కబళించడానికి పొంచి ఉండే రకా లుంటారు... తస్మాత్ జాగ్రత్త అని!

అంతేకాదు... నేను చాలా అందమైన దాన్నని, నా అందం ఇప్పుడు బాహాటంగా చాలామంది దృష్టిలోకి వచ్చిందని, దానిమూ లంగా నేను చాలా ఇబ్బందుల్ని ఎదుర్కోవ లసి ఉంటుందన్న హెచ్చరిక హరీంద్ర రూ పంలో ఇలా అందింది నాకు. ఇదీ నా మంచికే అనుకుంటాను.

'ఊళ్ళో చాలామంది చూపులు నీమీద పడ్డాయి' అన్న అతడి మాటల్ని గురించే ఆలోచిస్తూండిపోయాను. జీవించడానికి అవస రమైంది ఒక్క తిండే కాదు, మనిషికి రక్షణ కూడా అవసరమే.

'నన్ను నేనెలా రక్షించుకోవాలి?' అన్నది కూడా ఇప్పుడు ఆలోచించుకోవాలి.

"హరీంద్ర వచ్చి వెళుతున్నాడెందుకు సీ




తా?" అంటూ వచ్చింది పక్కింటి సులోచన.

ఆమె కళ్ళల్లో బోలెడు కుతూహలం.

ఏం చెప్పను?

నిజం చెప్పనా...?

అబద్ధం చెప్పనా?

నిజం చెప్పడానికి నాకిప్పుడేం భయంలేదు. కానీ హరీంద్రకి మాట ఇచ్చాను.

అందుకే అబద్ధం చెప్పాను- "పలకరించి పోవడానికి వచ్చాడు" అన్నాను.

ఈ సమాజంలో సత్యహరిశ్చంద్రుల్లా బతకడానికి ప్రయత్నించకూడదు. రాజీపడటటం నేర్చుకోవాలి... జీవితంలో వ్యక్తులతో... వాళ్ళు నిండివున్న సమాజంతో.

"అతనంత మంచివాడుకాదు! నువ్వు ఒంటరిదానివి- రానివ్వకు" సలహా ఇస్తూనే- "ఏమంటాడేమిటి?" అడిగింది ఆరాగా.

"ఏమంటాడు... ఏమీ అనడు" అన్నాను.

నమ్మలేనట్టు చూసింది- "నేనెవరితో చెప్పనులెద్దూ"!

ఆ ఆరాటానికి నవ్వొచ్చింది "నిజం సులోచనగారూ... అతడేం అంటాడు పాపం? శ్రీకాంత్ కి స్నేహితుడుగా నా క్షేమం విచారించడానికి వచ్చాడట" అన్నాను.

ఎంత ఆశ్చర్యం! నేను పిన్నిలా అవసరాన్ని బట్టి సులభంగా అబద్ధాలు చెబుతున్నాను.

"ఓయబ్బో మాలావు స్నేహితుడు" ముక్కుమూతీ తిప్పింది. "అసలొడే వదిలేసి వెళ్ళాక ఈయన క్షేమసమాచారాలు విచారణ ఎందుకంట. చేరనివ్వకు. పెళ్ళీపెటాకులూ లేవు. పక్కలోకి పెళ్ళాలుకావాలి! ఎక్కడినుంచి వస్తారు? వస్తాను- పనుంది" అంటూ వెళ్ళిపోయింది గబగబ.

ఆ అర్జంటు పనేమిటో నాకుతెలును. ఈ విషయం అందరికీ చెప్పాలి. 'చెప్పుకోనీ, వాళ్ళ ఉత్సాహమూ తీరుతుంది. నాకేం నష్టముంది? ఈ చిన్నజీవితంలో ఇదీ ఒక అనుభవం మాత్రమే' అనుకున్నాను.

రోజులుగడుస్తున్నాయి. జీవితంలో సంతోషమూలేదు, విచారమూలేదు, నేను మామూలుగానేవున్నాను. నాలో వాళ్ళూహించిన మార్పులు కనబడక జనాలు చాలానిరుత్సాహపడుతున్నారు. ఇంతలో వాళ్ళని నిరుత్సాహపరచడానికా, వాళ్ళకి కొద్దిరోజుల కాలక్షేపానికా అన్నట్టు జరిగిందానంఘటన.

ఇంతక్రితం రోజుకి రెండుసార్లు మంచినీళ్ల కోసం బావికివెళ్ళేదాన్ని. ఇప్పుడు అవసరాలు తగ్గాయి. ఒక్కసారివెళ్ళి తెచ్చుకుంటేచాలు. ప్రతి ఉదయం వెళ్ళితెచ్చేసుకుంటాను. ఇంతక్రితంలాఎవరూ నన్నుతమతో కలవనివ్వడంలేదుగాబట్టి, నాతోరావడానికి ఇష్టపడటంలేదుగా బట్టి నేను ఒక్కతినేవెళుతున్నాను. దీన్నిగురించికూడా ఆలోచించానునేను.

నిజంగా వీళ్ళకి నాతో రావడం ఇష్టంలేదా?

అదేనిజమైతే చటుక్కున ఏపెరటి ద్వారంగుండానో వచ్చినన్ను పలకరించటం ఎందుకు?

నేనీవూళ్ళో ఎలా బతకదలచుకున్నాను...

భర్తవదిలేసి వెళ్ళినందుకెంత చింతిస్తున్నానో...

ఏంకూరలు వండుకుంటున్నానో...

వినోద్‌తో ఆరోజు సంఘటన ఎలాజరిగిందో...

ఇవన్నీ చచ్చేంతకుతూహలంతో అడిగి తెలుసుకుంటారెందుకూ?

అంటే, వీళ్ళకి నాతో మాట్లాడటం, నాసంగతులు తెలుసుకోవడం ఇష్టమేనన్నమాట! కానీ, వళ్లిగ్గా నాతో కలవడానికి సమాజానికి భయపడుతున్నారు.

సమాజం అంటే ఎవరూ?

వీళ్ళే.

ఒకరికొకరు భయపడుతున్నారు. నాతో పలికితే, మాట్లాడితే పక్కవాళ్ళు ఏమనుకుంటారోనని భయం.

'చెడిపోయినదానితో స్నేహం ఏమిటీ' అంటారన్నజంకు.

వాళ్ల భర్తలకి కూడా భయపడతారేమో బహుశా

అసలు చెడిపోవటం అంటే ఏమిటీ?

మొన్న సులోచన చెల్లెలు చెప్పింది. ఆ

పిల్లకి వినోద్ అంటే చాలా ఇష్టం. దూరపు బంధుత్వంకూడా వుంది. వీళ్ళుకట్నాలు ఇవ్వ లేదనివాళ్ళు పెళ్ళికి ఒప్పుకోరు. ఈ పిల్లకి అతడంటే హీరో వర్షిప్ ఇంతజరిగినా కూడా.

"ఇది అందరికీ తెలిసి జరిగింది. అతడికి ఎందరమ్మాయిలతో రహస్యసంబంధాలు లేవు" అంటుంది పైగా.

అదేకాబోలు మగాడికి ఈ సృష్టీ, సమాజ మూ, ప్రసాదించినవరం. అతడితో పెళ్ళిజరగ దని తెలిసీ అతణ్ని గురించి కలలు కనటం మానుకోలేదు.

ఏమిటది?

ఇది చెడిపోవటంకాదా?

అదిమానసిక వ్యభిచారంకాదా?

నా ప్రమేయం లేకుండా ఒక కాముకుడి దౌర్జన్యానికి బలయిపోయిన నేను చెడిపోయిన దాన్నా?

స్వచ్ఛంగా అతణ్ని కామించి కలల్లోకావు రంచేసే తనుమాత్రం లోకందృష్టిలో హద్దుల్లో వున్న ఆడపిల్ల. వంశగౌరవం నిలబెట్టేది! ప్చ్...!

ఎప్పుడు ఎదుగుతారు ఈ మనుమలు?

సీతకి ఎదురయిన అనుభవంలాంటి అను భవం ప్రతి ఒక్కరికీ ఎదురయిన నాడా?

నాకు నవ్వొచ్చింది.

అలా జరిగిననాడు నాలా నిబ్బరంగా ఎంత మంది ఉండగలరు?

నెపాన్ని అవతలివాళ్లమీదికి నెట్టేసి తాము నిర్దోషులు, పవిత్రులుఅని చాటుకోవటానికి ప్ర యత్నిస్తారు.

ఈవూళ్ళో నామీద కాస్తదయచూపించే ఆ ముసలమ్మ అంది- "ఈ ఇరుగుపొరుగు అమ్మ లక్కలకికూడా వాళ్లమొగుళ్ళని నువ్వెక్కడవల లోవేసుకుంటావోనన్న భయంపట్టుకుందమ్మా" అని.

నాకేం ఆశ్చర్యం అనిపించలేదు. వాళ్ళు ఎదిగిన మనుమలని నాకు అర్థమవుతూనే వుంది. వాళ్ల పిచ్చిగాకపోతే ఎంతమందిని నేనువలలోవేసుకోగలను?

వూరింతటినీనా?

పోనీ,నేను తిరుగుడు మనిషినికానే,

ఎందుకిలా అనుకుంటారు వీళ్ళు?

ఎందుకంటే వీళ్ళు సామాన్యమైన మనుమ లుకాబట్టి. నాకు నేనే సమాధానం చెప్పుకున్నా ను.

ఏదేమైతేనేం మానసికంగా నేను ఎదగడాని కి ఈ పరిస్థితిలూ, మనుమలూ, వీళ్ళప్రవర్తన లూ దోహదపడుతున్నాయి నాకు. ఈసమాజం గురించి బాగా అవగాహన వస్తోంది నాకు. నేనేగొప్ప పుస్తకాలూ చదవలేదు.

బతుకనే ఈ వింతపుస్తకంలోని ప్రతీపుటా ఒక్కోపాఠాన్నే నేర్పుతోందినాకు. అనుభవాలు చాలా త్వరగా, మానసికంగా బండబారుస్తు న్నాయి నన్ను. ఇలా ఆలోచిస్తూ బావిదగ్గరికి చేరుకునే సరికి కనిపించిందొక గ్రూప్ అక్కడ నాకు.

ఈ వూరి యువకులు!

"వస్తోంది... వస్తోంది" గుసగుసలు చెలరే గాయి! కాస్త అర్థమయ్యింది! నాకోసం ఎదురు చూస్తున్నారన్నమాట.

ఈరోజు కాస్తలేటుగా వచ్చాను. బావి దగ్గర ఆడపురుగు లేదు! వున్నా వాళ్ళు, వీళ్ళు నన్నేం అనదలుచుకున్నా, చెయ్యదలుచుకు న్నా రక్షిస్తారా!

ఆ దేవుడు కూడా రక్షించలేడు! అలాంట ప్పుడు, ఈ జీవితానికి ఎవరిమూలంగానూ రక్షణ లేదన్న విషయం స్పష్టంగా అర్థమైపోతు న్నప్పుడు దాన్ని గురించి భయపడటం ఎందుకూ!

ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కోవడానికి మానసికంగా సిద్ధపడటమే నేను చెయ్యవల సింది. వాళ్ళని పట్టించుకోనట్టుగా వచ్చి బిందెని దించి చేదబావిలో వేశాను.

చటుక్కున వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు ఒక యువకుడు.

తలెత్తి చూశాడు!

వెకిలిగా నవ్వుతున్నాడు...

తల తిప్పి చూశాను.

దాదాపు పదిమంది వున్నారు. ఆడది, ఒంటరిది, నిస్సహాయురాలూ ఏం చెయ్యగల దన్న ధీమా వాళ్ళమొహాల్లో!




వాళ్ళు నన్నేం చేయ్యదలచుకున్నారో నాకు తెలీదు! నా ధైర్యం మాత్రం సడలలేదు!

"ఎంత అందంగా వున్నావూ." అన్నాడతడు!

ఒక్క క్షణం నాకేం మాట్లాడాలో తోచలేదు.

"ఎంతధైర్యమో చూడండ్రా" అన్నారెవరో.

వీళ్ళల్లో చదువులేనివాళ్ళున్నారు! పక్కవూళ్ళోకెళ్ళి చదువుకుంటున్నవాళ్ళూ, చదువులు పూర్తి చేసిన వాళ్ళూ వున్నారు! కానీ, వీళ్ల చదువు వీళ్ళకి సంస్కారాన్నివ్వలేదు! తలచుకుంటుంటేనే చాలావిచారంగా ఉంది!

"చెయ్యి వదులుబాబూ" నెమ్మదిగా అన్నాను.

"బాబూ?" ఆశ్చర్యంగా చూశాడతడు "నేన్నీకు బాబులా కనపడుతున్నానా సీతా శిరోమణీ? నీకంటే నాలుగేళ్ళు పెద్ద వుంటాను! నా వయసు పాతికపైమాటే" ఎకసెక్కెంగా అన్నాడు.

"కావచ్చు- చెయ్యి వదులు... నేను వెళ్ళాలి" మర్యాదగా అన్నాను.

"ఆరోజు వినోద్ వదలడానికే పట్టుకున్నాడేమో అడగరా చిన్నా" ఎవరో అన్నారు! అంతా నవ్వారు.

మళ్ళీ వాళ్ళందరివైపు చూశాను! ఎలా వీళ్ళబారినుండి తప్పించుకోవడం?

"నువ్వు చాలాఅందగత్తెవు సీతామణీ. వినోద్ అందుకే ఎంగిలి మంగలానికి కూడా కక్కుర్తిపడ్డాడు" అన్నాడు మళ్ళీ.

ఎంతో రోతపుట్టించేమాటలవి! వీళ్ళ సంస్కారంగురించి అర్థంచేసుకుంటూన్న నాకేం ఆ మాటలు పెద్ద విచిత్రం అనిపించలేదు.

"అందుకే అతడు నలుగురిదృష్టిలో దుర్మార్గుడయ్యాడు! మీరూ అలా అనిపించుకుంటారా? ముఖ్యంగా నామానాన నన్ను బతకనీయండి బాబూ" బతిమాలుకున్నాను.

పకపక నవ్వాడు చిన్నా! మిగతా బృందంకూడా!

"దుర్మార్గుడయ్యాడా వినోద్? ఎవరు చెప్పారు చిట్టీనీకు? మా దృష్టిలో హీరో అయ్యాడు. ముఖ్యంగా నాగరాజుకూడా వినోద్ గొప్పతనాన్ని ఒప్పుకున్నాడు" అన్నాడు.

ఈ నాగరాజెవరో నాకు తెలీదు! అతడు వీళ్ల దృష్టిలో హీరో కావడంలో చిత్రం ఏమీలేదు! దాదాపు ప్రతిమనిషిలో ఒక వినోద్ వుంటాడేమో! అందరూ అతడిలా ధైర్యం చెయ్యలేరు! మూకబలంమీద అంతసాహసం చెయ్యగలరు. వీళ్ళందరూ విడివిడిగా చాలామంచివాళ్ళూ బుద్ధిమంతులూ కావచ్చు!

ఇలా మందిలో కలసినప్పుడే వీళ్ళ బుద్ధి తాతలకాలంనాటిదవుతుంది!

మనిషి కోతి అవుతాడు!

'ఎలా ఇప్పుడు నన్ను నేను రక్షించుకోవడం?" ఆలోచిస్తున్న నాకు దూరంనుండి బిందెలతో కబుర్లాడుకుంటూ వస్తూన్న ఇద్దరు స్త్రీలు కనిపించారు.

నాకు ధైర్యం వచ్చింది. వాళ్ళని చూసి తప్పకుండా వీళ్ళు పారిపోతారు. ప్రస్తుతానికి వీళ్ళ బారినుండి తప్పించుకోవచ్చు. ఇకనుండి ఎప్పుడూ ఇలా ఒంటరిగా బావికి రాకూడదు! పొద్దున్నే జనసంచారం బాగా వున్నప్పుడు రావాలి!

ఇలా అనుకుంటున్నానునేను! చిన్నా నా చేతిమీద తన చేతి పట్టుని బిగించి నా కళ్ళల్లో కళ్ళు కలపడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్ళెవరూ దూరంనుండి వస్తున్న ఆడవాళ్ళని గమనించలేదు. ఇంతలో నేను వూహించనివిధంగా జరిగిపోయింది ఆ సంఘటన.

ఎక్కడినుండి వచ్చాడో హఠాత్తుగా అక్కడ ప్రత్యక్షమయ్యాడు వినోద్. చిన్నా జుట్టుపట్టి వెనక్కి గుంజాడు. అది చూసి నాతోపాటు చిన్నా మిత్రబృందం కూడా తెల్లబోయింది! అందరం చూస్తుండగానే చిన్నాని ఎడాపెడా కొట్టసాగాడతడు! అందరూ స్థాణువుల్లా నిలబడిపోయారు.

మాటావలుకూ లేకుండా చావచితకతన్నాడతణ్ణి! చిన్నా మిత్రబృందం కదల్లేదు, మెదల్లేదు. చివరిగా వీపుమీద గుద్ది అతణ్ణి కిందికి తోశాడు వినోద్. కిందవడ్డ చిన్నాపైకి లేవలేదు!

నిశ్చేష్టురాలినై ఇదంతా చూస్తున్నాను నేను!

వినోద్ నావైపు చూశాడు!

తరువాత తలతిప్పుకున్నాడు!

నా చేతిలోని చేదని తీసుకుని బిందెకి నీళ్ళు తోడాడు!

అక్కడినుండి కదిలి వెళ్ళిపోతూ- "సీతా- నువ్వెళ్ళిపో" అన్నాడు.

అప్పటికి చిన్నా బృందం చిన్నాని తీసుకుని వెళ్ళిపోయారు!

అక్కడికి చేరుకుని జరిగిందంతా చూస్తూ చిత్తరువుల్లా నిలబడ్డ ఇద్దరు స్త్రీలలో కూడా చైతన్యం వచ్చింది! నేను బిందెని చంకకి ఎత్తుకున్నాను!

"ఫరవాలేదే... కథ ఆగిపోలేదన్నమాట?" ఒకామె అంటోంది.

ఆమె ఏ ఉద్దేశంతో ఆమాట అందో నాకు అర్థమైంది!

కానీ, దాన్ని గురించి ఆలోచించటంలేదు నేను!

ఒకే ఒక్కసారి నావైపు చూసిన వినోద్ చూపుల్లోని ఆ భావాన్ని గురించి ఆలోచిస్తున్నాను!

పశ్చాత్తాపం అది!

★ ★ ★

"అవ్వా నాగరాజు ఎవరూ?" మునలమ్మని అడిగాను.

ఆవిడ ఉలిక్కిపడి- "నాగరాజా"? అంది!

ఆవిడ ఉలికిపాటుని గమనిస్తూ- "అవును" అన్నాను!

"వాడొక పెద్దరౌడీ అమ్మా" అంది!

"వినోద్ కంటేనా?" అడిగాను క్షణం ఆగి!

మునలమ్మ నావైపు తేరిపారచూసింది "వినోద్ ఆలనాపాలనా లేక ఆ విధంగా తయారయ్యాడుగానీ, నాగరాజు అలాక్కాదు తల్లీ! పదిసార్లు జైలుకి వెళ్ళివచ్చాడు! ఒక హత్య చేశాడు! కొంపదీసి వాడికన్ను నీమీద పడలేదుగదా?" అడిగింది భయంగా.

"వాడసలు వూళ్ళోలేడే ఈమధ్య"? అని కూడా అంది!

ఆ ఉదయం జరిగిన సంఘటన గురించి చెప్పాను. వూరంతా ఇప్పటికే ఈ వార్తతో కుతకుతలాడుతోంది! ఈ వృద్ధురాలు ఏదో పనిమీద పక్కవూరికి వెళ్ళి ఇప్పుడే తిరిగి వచ్చింది! అందుకే నా నోట తొలిసారిగా వినాల్సి వచ్చింది! అంతావిని ఆవిడ మొహం పాలిపోయింది!

"ఈ నాగరాజుకీ, వినోద్‌కీ పడదా అవ్వా?" అడిగాను!

"అయ్యో! ఈ రాక్షసులముందు నువ్వెలా బతుకుతావు తల్లీ"? ఆర్ధంగా అంది అవ్వ!

"ఎందుకవ్వా అలా అంటున్నావు?" అడిగాను నిబ్బరంగానే.

"ఈ చుట్టుపక్కల పల్లెల్లో ఈ నాగరాజు పేరుమోసిన గూండా వెధవమ్మా? నిజంగా వినోద్‌కీ, వాడికీ పడదు! వాళ్ళ మాటల్నిబట్టి వాడికళ్ళు నీమీద పడ్డాయని తెలుస్తూంది! దానికితోడు ఇప్పుడు ఈ విషయంలో వినోద్ కలిపించుకుని వాడిమనిషిమీద చెయ్యి చేసుకున్నాడని తెలిస్తే వాడు పిచ్చికుక్క అవుతాడు! వినోద్ వెనకవున్న డబ్బుకీ, అతని తండ్రి పలుకుబడికీ భయపడుతూ వచ్చాడు ఇంత కాలం! వినోద్ నిన్ను అన్యాయం చేశాక అతని తల్లిదండ్రులు అతన్ని గురించి పట్టించుకోవటంలేదు! చాలా కోపంగా వున్నారు! వూళ్ళో కూడా చాలామంది 'ఛీ' కొడుతున్నారు! ఇప్పుడు నాగరాజుగాడు ధైర్యం చేస్తాడు! ఈ అంబోతుల కుమ్ములాటలో లేగదూడవి నువ్వేం అవుతావే! నామాటవిని ఈవూరు వదిలిపెట్టి వెళ్ళిపో సీతమ్మా..." చాలా ఆందోళనగా అంది వృద్ధురాలు!

తల అడ్డంగా తిప్పాను- "నేను ఎక్కడికి వెళ్ళను అవ్వా? నాకెవరున్నారు? ఎక్కడికి వెళ్ళినా ఇదే ప్రపంచం కదావుంది? ఇలాంటి మనుషులేకదా తారసపడతారు? ఇలా ఎన్ని వూళ్ళని తిరగను? ఎలా జరగాలనివుంటే అలా జరుగుతుంది! కానీ..." అన్నాను నిర్లిప్తంగా!

"అయ్యో! చూలాలివే! ఇకనుండి నీకుతోడుగా రాత్రిళ్ళు నేను పడుకుంటానుతల్లీ" అంది అవ్వ అదే భయకంపిత స్వరంతో.

చాలారోజుల తరువాత తొలిసారిగా నాకళ్ళల్లోకి నీళ్ళొచ్చాయి! ఎంతయినా, ఎంత తెలు

నుకున్నా మనిషి మనిషే! అనుభూతులకి దూరం కాలేదు!

అవ్వ గొణుక్కుంటూంది- "నువ్వు బంగారంలాంటిదానివని తెలిసినా ఈ వూరునమ్మదు! నిన్ను వేధించకవదలదు! ఎట్టా బతుకుతావో ఏమో ..."!!!

వృద్ధురాలిమాటలకి ఫలితం ఆరాత్రే కనిపించింది!

అర్ధరాత్రి ఎవరో తలుపులు దబదబబాదారు! మంచినిద్రలో వున్న మునలమ్మ నిద్రపట్టక పొర్లాడుతూన్న నేను త్రుళ్ళిపడ్డాం!

మళ్ళీ తలుపు బాదారు!

"ఎవరూ"? మునలమ్మ కంఠం హెచ్చించి బిగ్గరగా అడిగింది!

తలుపులు బాదటం ఆగిపోయింది!

భయంగాలేచి వెళ్ళి తలుపు దగ్గర నిలబడింది ఆవిడ!

కాస్సేపాగి మల్లీ తలుపు బాదారు!

"ఎవరంటూంటే? ఏంరోగాల్రామీకు? ఒంటరిదాన్ని చూలాలిని— చేసి ఏడిపిస్తారా? ఏం పొయ్యేకాలంరా మీకు"? బిగ్గరగా అరవసాగింది!

ఉన్నట్టుండి బయటనుండి పెద్ద గొడవ... అరుపులూ వినిపించాయి!

"ఏంటవ్వా"? అదుర్దాగా అన్నాను!

"వినోద్ గొంతు వినబడుతోందే సీతమ్మా! ఇప్పుడు తలుపు బాదింది నాగరాజు మనుములు! ఈ వెధవలు ఇలాంటివనేదో చేస్తారని అతడు కాపేసి వున్నట్టుంది! వాళ్ళకీ, అతనికీ పోట్లాటలాగుంది! ఎందుకైనా మంచిది... మనం కిటికీ కూడా తెరవ్వద్దు" అంది వణుకుతూన్న గొంతుతో.

కాస్సేపయ్యేనరికి బయట గోల జాస్తయింది! వూరు మేలుకుంటోందని అర్థమవుతోంది! ఎలాగైతేనేం అరగంటపోయాక గొడవ నద్దుమణిగింది!

ఎవరో అంటున్నారు- "అపిల్లని వూళ్ళోనుండి వెళ్ళగొడితేనరి! ఏమిటి నంసార్ల పొరుగున ఈగోల?"

ఈ మాట వినగానే అవ్వ కోపంగా తలుపు తీనుకుని వెళ్ళింది- "ఎవర్రా నంసారులు? నంసారులుకాని వాళ్ళెవరంట? నిన్నటిదాకా మీ అందరికంటే గౌరవంగా బతికిందే అపిల్ల, దానిజీవితాన్ని నాశనం చేసిందికాక తలాకాస్త పంచుకుందామనుకునే ఈ రాక్షనుల్ని చెప్పుతో కొట్టాల్సిందిపోయి ఆ అమాయకురాల్ని అంటారా! ఎక్కడికి తరుముతార్రా? ఏంపాపం చేసిందని? ఒక మనిషిలాగా బతకాలనుకోవడం తప్పా?"

ఎవరూ ఏమీ మాట్లాడలేదు!

మళ్ళీ మాట్లాడింది మునలమ్మే- "నాయనా వినోద్‌బాబూ! నీకు చేతులెత్తి మొక్కుతాను! ఆ పిల్లనుదుట దేవుడుకాదు రాత రాసింది... నువ్వూ ఆ మొగుడూ! ఇంకా ఎందుకు నువ్వు కల్పించుకోవడం? తన బ్రతుకు తనని బతకనీ! ఆడది ఒకసారి చెడిందని పేరుబడ్డాక అందరికీ లోకువే దాని తప్పున్నా లేకపోయినా! నువ్వు చెయ్యాల్సింది కాస్తాచేసి ఇప్పుడు ఈ నాగరాజుకెందుకు అడ్డం రావడం? నువ్వు చేసిందానికంటే ఇంకా ఎక్కువ ఏం అన్యాయం చేస్తాడు? తీస్తే ప్రాణం తీస్తాడేమో! ఆ అమ్మాయి కష్టాలు తీరిపోతాయి! అంతే గదా! దయచేసి నువ్వు కల్పించుకుని వూరంతా ఒక కొలిక్కితెచ్చి ఆ పిల్లని ఇంకా ఛీ కొట్టించకు" ఏడుస్తూ కోపంగా అరుస్తోంది.

బదులు నమాధానంలేదు!

కాస్సేపటి తరువాత లోపలికి వస్తూ- "ఆ నాగరాజుగాడు లేనప్పుడే ఇంత గొడవైతే రేపు వాడొచ్చాక ఇంకెంత గొడవవుతుందో! వాడు మనిషికాదు- రాక్షనుడు" గొణుగుతూ పడుకుంది అవ్వ!

నేను మెల్లిగా నవ్వాను "కానీ అవ్వా! నువ్వే అన్నావుగా, నా ప్రాణం తియ్యడమేగా మిగిలివుంది? అంతకంటే అపకారం ఏం చెయ్యగలరు ఎవరైనా నాకు? నాకింకా బతకాలనివుంది? ఆ అవకాశం కూడా దొరక్కుండా చేసినా ఎవర్నీ నేను నిందించను! జరిగేదేదో జరగనీ" అన్నాను.

అవ్వ లేచివచ్చి నాదగ్గర పడుకుని పసిబిడ్డలా నన్ను గుండెల్లోకి పొదువుకుంది! ఏమిటో ఈ అనుబంధాలు! చాలా చిత్రంగా

కలుస్తాయి! ఈ వృద్ధురాలు ఎవరో... నేనెవరో! నేను దిక్కులేనిదాన్ని తనోదిక్కులేనిది! ఈ క్షణాల్లో నాకు అండ అయింది!

"ఏదో ఆలోచించాలి, ఈ కష్టాలనుండి నిన్ను బయటపడెయ్యాలి సీతమ్మా" అంది అవ్వ!

ఆ మిగిలినరాత్రి అవ్వకి నిద్రపట్టిందోలేదో నాకు తెలీదుగానీ మానసికంగా బాగా అలసిన నాకు చాలా గాఢనిద్ర పట్టింది!



"నువ్వింక బావికి నీళ్ళకి వెళ్ళొద్దు సీతమ్మా! ఈ వూళ్ళోవాళ్ళు మనుమలుకారు! రోజూ ఓ బిందె నేను తెచ్చిపడేస్తాను" అంది అవ్వ!

అవ్వవైపు కాస్త దీనంగా చూశాను నేను- "ఈకాస్త బయట ప్రపంచం కూడా చూడొద్దంటావా అవ్వా? ఇలా ఎంతకాలం కాపలా కాయగలవు నాకు నువ్వు? నువ్వు తప్ప వూరంతా నన్ను ద్వేషిస్తోంది! ఏదైనా జరగలాల్సివుంటే జరక్కతప్పదు! కాకపోతే కాస్త ముందూ వెనుకగా! అంతే! నేను చాలా ధైర్యంగా వున్నాను- ఎలాంటిపరిస్థితినైనా ఎదుర్కొనేందుకు! ఇక వీళ్ళు మనుమలు కారంటావా? కాదు... వాళ్ళు నిజంగా మనుమలే! అందుకే ఈ రాగద్వేషాలు! నువ్వు వాళ్ళని అర్థంచేసుకోలేకపోయినా నన్ను చేసుకున్నావు! అది చాలు! నన్ను వెళ్ళనీ" అన్నాను.

మునలమ్మ నిట్టూర్చింది- "తెలివైనదానివి! రాతే బాగాలేదు! నాకు నీదే దిగులైంది"అంది.

నేను బిందెపట్టుకుని నీళ్ళకి బయలుదేరడం చూసి మళ్ళీ వూరు మొత్తం ముక్కుమీద వేలేనుకుంది "ఛీ... ఎంత సిగ్గులేనిది ఇది?" అంటూ ఖాండ్రించి వుమ్మింది!

'మీరంతా అమాయకులు! నన్ను నేనెలా బంధించుకోగలను? ఈ కాస్త స్వేచ్ఛని కూడా అనుభవించకుండా బతకలేను' అనుకున్నాను నేను!

నాకెందుకో ఆ బావితో సంబంధం విడదీయరానిది అనిపిస్తోంది! ఆ వూరు మొత్తానికి అది ఒక్కటే మంచినీళ్ళబావి! ఇలాంటి ఒక బావిదగ్గరే నేను శ్రీకాంత్‌ని చూశాను!

ఈ వూళ్ళో అడుగుపెట్టగానే ఈ బావినీళ్ళతో దాహం తీర్చుకున్నాం మొదట మేం! ఈ బావినీళ్ళు నా జీవితాన్ని ఒక అనూహ్యమైన మలుపు తిప్పాయి! రోజుకోసారన్నా ఆ బావి దగ్గరకి వెళ్ళందే నాకు మనసంతా ఏదోలా వుంటుంది! ఎవరేమనుకున్నా నేను అక్కడికి వెళ్ళకుండా వుండలేను!

దార్లో నాకు హరీంద్ర ఎదురయ్యాడు! నన్ను చూసి నవ్వాడు! ఆ నవ్వులో హేళనవుంది!

'చూశావా నీ బతుక్కేమాత్రం భద్రత వుందో' అన్న నిరసనవుంది!

నేను చాలా మామూలుగా చూశానతడివైపు!

"ఏంతల్లీ! వూరికే నిప్పెట్టేలావున్నావే?" ఓ నడివయన్కురాలు నిరసనగా అనవ్యాంగా చూస్తూ అడిగింది!

నేనేం సమాధానం చెప్పలేదు! మూగదానిలా, చెవిటిదానిలా నడుస్తూనే వున్నాను!

"అయితే ఈవిడకీ, వినోద్‌కీ జత కుదిరిపోయినట్టుంది! సందేహంలేదు- అందుకే ఆ ధైర్యం" ఓ పదహారేళ్ల కుర్రాడి కామెంట్ అది!

బాలలైనా, పెద్దలైనా, వృద్ధులైనా ఈ సమాజంలో బతికేవాళ్ళు అంతకంటే ఉన్నతంగా ఎలా ఆలోచించగలరు పాపం?

నాకెందుకో హఠాత్తుగా నాన్న గుర్తు వచ్చాడు!

ఎక్కడున్నాడో నాన్న! పరువునే ప్రాణంగా భావించే నాన్న ఆడదాని గుణం ప్రవర్తనల్నే మహాసంపదగా భావించే నాన్న ఎప్పుడో రెండేళ్ళనాడు మరణించిందనుకున్న తన కూతురు




ఇలా ఒక మారుమూల పల్లెలో దిక్కూ మొక్కూ లేకుండా చెడిపోయి ఆయన దృష్టిలో... సమాజం దృష్టిలో వూరంతటిచేత 'ఛీ' కొట్టించుకుంటూ భర్తచేత పరిత్యజింపబడి మానావమానాల్ని పక్కకినెట్టి మొండిగా బతుకుతోందని తెలిస్తే ఏం చేస్తాడు?

పెద్దకత్తి ఎత్తుకొచ్చి నన్ను పొడిచి చంపుతాడా?

లేక తనే ఉరేసుకుంటాడా?

ఏమో... ఈ రెండింట్లో ఏదైనా చెయ్యొచ్చు!

"ఏవమ్మా సీతమ్మా" ఎవరో పలకరించారు!

తలతిప్పి చూశాను!

ఎవరో రైతు! ఎప్పుడో చూశాను! 'ఫలానా' అని గుర్తులేదు!

"మా అబ్బాయి మాస్టారుదగ్గర చదువుకునేవాడు" అన్నాడు గుర్తు చేస్తున్నట్టు!

'అలాగా'? అన్నట్టు నవ్వుమొహంతో చూశాను!

ఫరవాలేదు! ఇంతమాత్రం ధైర్యంగా ఈయన నన్ను నడివీధిలో పలకరించగలుగుతున్నందుకు మెచ్చుకోవచ్చు!

"ఈ సంగతి తెలుసా?" అడిగాడు.

"ఏం సంగతండీ"? అడిగాను!

"మాస్టారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు"!

అప్పుడు చూశాను ఆయన మొహంలోకి నిశితంగా!

"అవునమ్మా! రెండురోజులక్రితమే! బస్తీలో! అక్కడేదో కంపెనీలో ఉద్యోగం చేస్తూండేవాడంట ఈ రెండునెలలుగా! ఆ కంపెనీ యజమానికి ఒక్కతే కూతురు! తన సంగతులు దాచకుండా చెప్పుకున్నాడుట! ఆయన ఇష్టపడి పిల్లనిచ్చాడు! ఇప్పుడెక్కడో హైదరాబాదులో పెద్దమాస్టారి ఉద్యోగం వచ్చిందట! తొందర్లో భార్యతో వెళ్ళిపోతాడట! ఆ పెళ్ళాం కూడా మంచి అందగత్తేనట" చెబుతూ నా మొహంలోని భావాల్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు!

నాకేం చిత్రం అనిపించలేదు! ఈ విషయం నామీద ప్రభావం చూపించలేదు! శ్రీకాంత్ మళ్ళీ పెళ్ళిచేసుకోకుండా వుంటాడని నేననుకోలేదు! అలా అని చేసుకుంటాడనీ అనుకోలేదు! అసలా విషయమే ఆలోచించలేదు నేను!

అయినా అతడు ఒంటరిగా ఎందుకుండిపోతాడు?

మగవాడు... అతడికి అవకాశాలు బోలెడు! దర్జాగా తన గతాన్ని చెప్పి మరీ చేసుకున్నాడు. పోనీ, ఈసారైనా సుఖపడతాడేమో!

నవ్వొచ్చింది నాకు!

నాతో అతడు సుఖపడలేదా?

ఈ పెద్దమనిషి నాతో ఇంత ఆసక్తిగా చెప్పడానికి కారణం... ఈ విషయం నాతో చెప్పి నేను ఎంతలా బాధపడతానో చూడాలన్న కుతూహలంతో అన్నమాట!

ఆయన ఆశించిన భావాలేం నాలో కనబడకపోవడంతో- "వస్తానమ్మా! ఎంతైనా గుండెనిబ్బరం మనిషివి" అనేసి వెళ్ళిపోయాడు!

ఆ అనడంలో వ్యంగ్యంవుంది!

నేనాలోచిస్తున్నాను! శ్రీకాంత్ పెళ్ళి గురించి విని నాకు బాధకలగదేం?

అతడిపట్ల నాలోవున్న ప్రేమా అభిమానం ఆవిరయిపోయాయా?

అసలతడిపట్ల నాకు వుండింది ప్రేమేనా?

లేక స్త్రీపురుష సహజమైన ఒట్టి ఆకర్షణ మాత్రమేనా?

ప్రేమే వుండి వుంటే ఇంత త్వరగా అతణ్ని ఎలా మర్చిపోగలిగాను?

అతణ్ని గురించి ఆలోచించకుండా ఎలా వుండగలుగుతున్నాను?

అతడు మరో స్త్రీతో జీవితాన్ని పంచుకున్నాడన్న వార్త విని కనీసం నాలో ఎలాంటి చలనమూరాదేమిటి?

ఏమిటి... మనిషికి సహజమైన అనుభూతులకు దూరమైపోతున్నానా నేను?

'మెటీరియలిస్ట్' అంటారే... అలా అయిపోతున్నానా?

కాదు...

కానేకాదు...




నిశ్చయంగాకాదు...!

ఇప్పుడు నాదృష్టిలో శ్రీకాంత్, వినోద్, హరీంద్ర అంతా ఒక్కటే.

ఎవరూ ఎక్కువాకాదూ, ఎవరూ తక్కువా లేదు.

ఎవరిమీదా ప్రేమలేదు.

ద్వేషమూలేదు.

ఇలా బతకటమే హాయిగావుంది. శ్రీకాంత్ పెళ్లిచేసుకున్నాడంటే ఈర్ష్యలేదు.

వినోద్‌వట్ల ద్వేషంలేదు.

ఈలోకం మీద అసహ్యంలేదు.

ఏమీలేదు.

నేనునేనుగా వున్నాను. ఒక మనిషిలా బతుకుతున్నానన్న సంతృప్తి మిగులుతోంది. ఇంకో ఆలోచనకూడా వచ్చింది.

అదే శ్రీకాంత్‌లా నేను ఇంకోపెళ్లిచేసుకుంటే వీళ్లంతా ఏంచేస్తారు?

నన్ను బతకనిస్తారా?

ఈ వూహకే నవ్వొచ్చింది.

అనవసరపు అర్థంలేని సమాధానం సిద్ధంగాఉన్న ఆలోచన కాదూ ఇది?

ఏమిటో నెలలు నిండుతున్నాయి. నడవడం భారంగావుంది. బిందెమొయ్యడం ఇంకా బాధగావుంది. అలా అని బావిదగ్గరకి రాకుండావుండలేను.

'పుట్టే బిడ్డ ఎవరోగానీ ఈ 'అమ్మ'ని బాగా ఇబ్బంది పెడుతోంది' ఆనందంగా అనుకున్నాను.

ఇదిగో నాలో ఇంకా ఇలాంటి అనుభూతులు బోలెడున్నాయి. అందుకే జీవితాన్ని కోరుకుంటున్నాను. నిశ్చితంగా బతగ్గలుగుతున్నాను.

నేను నీళ్లు తీసుకుని వూళ్లోకి తిరిగి వచ్చేసరికి ఎదురైన ప్రతిఒక్కరు అడగసాగారు- "శ్రీకాంత్ మాస్టారు పెళ్లిచేసుకున్నాడట, తెలుసా సీతా?" అని!

"తెలును" అని సమాధానం ఇచ్చాను!

"గుండెలు కాదు, ఈ పిల్లవి బండలు- ఏ కాస్తయినా బాధ కనిపిస్తుందేమో చూడండి ఆమొహంలో..."

'పిచ్చివాళ్లలారా యింతమాత్రానికే బాధపడేదాన్నయితే మూడు నెలలక్రితమే చచ్చిపోయివుండేదాన్ని. మీకళ్ళముందు ఇలా వుండగలిగేదాన్నికాదు. నేను మళ్లీ జన్మనెత్తానంటే మీరు అర్థంచేసుకోలేరు. కానీ నేను మిమ్మల్ని అర్థంచేసుకోగలిగానన్న తృప్తి మిగులుతోంది' నాలో అనుకున్నాను.

★ ★ ★

"సీతమ్మా... నీ మేలుకోరి ఒక విషయం చెబుతాను- వినుకుంటావా అమ్మా?" వృద్ధురాలు అడిగింది నన్ను ఆపూట.

"ఏంటవ్వా అది?" కడుతూన్న పూలమాలని ఆపేస్తూ అడిగాను.

అవ్వదగ్గర విస్తళ్లు కుట్టడం...

పూలు అల్లటం...

అప్పడాలు ఒత్తడం...

ఒకటేమిటి... ఇలాంటి చిన్నచిన్న పనులన్నీ నేర్చుకుని తృణమో ఫణమో స్వంతంగా సంపాదించుకోవటం ప్రారంభించాను. నాదగ్గరవున్న ఎనిమిదివందల్లో మూడు వందలు పెట్టుబడిపెట్టాను. ఇంటద్దె, పాలూ తప్ప ఇతర ఖర్చులేంలేవు. అవ్వ కట్టెపుల్లలు తెచ్చిస్తుంది. దాదాపు నాదగ్గరే వుంటుంది. పెరట్లో కూర పాదులు పెట్టాను. ప్రస్తుతానికి తిండి సమస్య పరిష్కరింపబడినట్టే.

నా కడుపులోని బిడ్డ బయటకి వచ్చిననాడు ఈ సంపాదన చాలదు. అప్పటి కేదో దారి వెతుక్కోకతప్పదు... నాలో ఏదైనా చింతవుందీ అంటే అదిమాత్రమే. కాన్పుకి అవసరం అని ప్రతిపైసా కూడబెడుతున్నాను.

"నువ్వేం భయపడకు, నాకు తెల్సిన నర్సు వుంది. హస్తవాసి మంచిది. అనుభవం కూడా వుంది. పిల్చుకొస్తాను. పురుడుపోసి వెళుతుంది" అని ధైర్యంగా చెబుతుంది అవ్వ.

ఇప్పుడు అవ్వ నాకు ఒక తోడూ నీడా అయింది. అలాంటి అవ్వ మేలుకోరి ఏదో చెబుతానంటే 'వద్దూ' అంటానా?

అవ్వ ప్రారంభించింది. వంటరిగా నువ్వు ఈ వూళ్లో బతకలేవు. ఈ వూళ్లోనేకాదు, ఈ లోకంలోనే బతకలేవు. నువ్వు పెళ్లిచేసుకోవాలి

మళ్ళీ. నీకొక అండ కావాలి సీతమ్మా".

నాకు నవ్వొచ్చింది.

నవ్వాను కూడా.

"అదిగో నువ్వట్లా నవ్వకూడదు! నా మాటలు జాగ్రత్తగా వినాలి" కోపగించుకుంది!

"చెప్పవ్వా" అన్నాను!

"నన్నెవరు చేసుకుంటారూ? అని సందేహపడకు! భగవంతుడెవర్నో చూపిస్తాడు"!

"ఎవర్ని చూపించాడూ?"

"అదే చెబుతున్నా! గోపాలరావని నడివయను మనిషి! బోలెడంత ఆస్తి వుంది! ఈఊరే! రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నా బిడ్డలు పుట్టలేదు! భార్యలేమో పొయ్యారు! ఏభై ఏళ్ళు వచ్చాయి! బిడ్డల మీద మమకారం చావలేదు! బంధువుల బిడ్డల్ని పెంచుకోవడం ఎందుకనో ఇష్టంలేదు! నీ విషయం అంతా చెప్పానమ్మా! దేవుడికి రోజూ పువ్వులిస్తాను వాళ్ళింట్లో! దేవుడు ఏంబుద్ధి పుట్టించాడోగానీ నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు..." చెబుతోంది అవ్వ!

నేను ఆశ్చర్యంగా చూశాను! ఇలా ఆశ్చర్యపోవాల్సిన సంఘటనలూ, విషయాలూ చాలా అరుదుగా ఎదురవుతున్నాయి ఈమధ్య! ఈ గోపాలరావుగారి గురించి ఎప్పుడో విన్నాను!

"పెళ్ళాం కోసం కాదమ్మా ఆయన పెళ్ళి చేసుకుంటానంటూన్నది! నీ కడుపులో బిడ్డ కోసం! నిన్ను పెళ్ళిచేసుకుంటే ఆ బిడ్డ తన బిడ్డ అవుతాదన్న ఆశ! తన వంశానికి వారనుడవుతాడన్న కోరిక! డబ్బుంది! ఎవర్నీ లెక్క చేసే మనిషి కాదు! వూరంతా ఆయన్ని గౌరవిస్తుంది! ఏదైనా అనుకున్నా మనసులో అనుకోవాల్సిందేగానీ బయటికి అనే ధైర్యం ఎవరికీ వుండదు! ఈ నాగరాజులూ, వినోదులూ నిన్ను కన్నెత్తి తేరిపార చూసే ధైర్యం చెయ్యలేరప్పుడు! నీకొకరక్షణ, నీ బిడ్డకొక తండ్రి దొరుకుతాడు! అంతేకాదు... డబ్బు అంటూ వచ్చాక నిన్నందరూ నెత్తిన పెట్టుకుంటారు- గౌరవిస్తారు..." ఇలా చెబుతోంది!

అయ్యో! పిచ్చి అవ్వా డబ్బుతో వచ్చే గౌరవానికీ, విలువకీ ఆశపడే స్థితిలో నేను ఉన్నానా?

"మాట్లాడవే సీతమ్మా?" అంది అవ్వ!

"వద్దు అవ్వా" అన్నాను!

"ఏంసీతమ్మా? ముసలాయన అనా?" ఆత్రుతగా అడిగింది!

"అదేం కాదవ్వా! నా బతుకు నేను సొంతంగా బతకాలని వుంది నాకు!"

"నీ సంగతే నువ్వు ఆలోచించుకుంటే ఎట్టా? పుట్టబోయే బిడ్డ..." చెప్పబోయింది!

"నేను నా బిడ్డను పోషించుకోగలను! రక్షించుకోగలను! పెళ్ళిమీద నాకు ఇప్పుడు ఇచ్ఛలేదు! బిడ్డకోసంగా ఇష్టంలేనిపని ఏదీ నేను చెయ్యలేను! నాగరాజుకీ, వినోద్‌కీ భయపడి మనసు చంపుకోమంటావా అవ్వా?" అడిగాను!

"అదికాదు తల్లీ..."

"నన్ను నువ్వయినా అర్థంచేసుకో అవ్వా! నాకు డబ్బు వద్దు! నాకు భర్త వద్దు! ఈ దొంగ గౌరవాలూ, కుళ్ళు విలువలూ నాకొద్దు! నాబిడ్డకి ఒక కొత్త తండ్రి వద్దు! నేను చాలు! నాకు నా బిడ్డ చాలు! ఈ లోపల నాకు ఎవరి మూలంగా ఏదైనా అపకారం జరుగుతుందంటావా? కానీ, దానికి నేను ఎప్పుడూ సిద్ధం! స్వతంత్రంగా నన్ను బతకనీ అవ్వా! తన స్వార్థం కోసమే నాకు ఆశ్రయం ఇస్తానంటున్నాడో, ఆయనలో కాస్త మానవత్వం అన్నది వుందో నాకు తెలీదు గానీ ఆ గోపాలరావుగారికి నా కృతజ్ఞతలు తెలియజెయ్యి! అంతేగానీ నన్ను ఈ విషయంలో బలవంతపెట్టకు! నా క్షేమం కోసం నువ్వు ఎంత తపన చెందుతున్నావో నాకు తెలుసు! నాకు నువ్వు అండగా వున్నావు! అదిచాలు! నాకు ఒక మగతోడు అవసరం అని నేను అనుకోవటంలేదు" అన్నాను నెమ్మదిగా స్పష్టంగా!

వృద్ధురాలు ఇంకేమీ మాట్లాడలేకపోయింది! ఈ సమాజంలో బతికే మనుషులతో పోల్చుకుంటే ఈ గోపాలరావుగార్ని కాస్త మెచ్చుకోకతప్పదు! మనిషన్నాక ఆ మాత్రం ధైర్యం, తెగువ వుండాలి! ఆ మాత్రం యువతలో వుంటే ఎంత బాగుణ్ణు...

శ్రీకాంత్‌లో ఆ ధైర్యమే వుంటే... ప్చ్...




"ఇంకేమీ ఆలోచించేది లేదంటావా సీతమ్మా" అడిగింది మరోసారి అవ్వ ఆశగా!

"ఏమీ లేదవ్వా" అన్నాను!

"నీయిష్టం తల్లీ! ఇదే జన్మబంధమోగానీ, కూర్చున్నా పడుకున్నా తింటున్నా తిరుగుతున్నా నీదే దిగులైపోయిందే తల్లీ నాకు! ఇంత నిజాయితీగా అంత 'నా' అన్న ఆశలేకుండా ఎలా బతుకుతావు? అదీ ఈ క్రూర జంతువుల మధ్య" నిట్టూరుస్తూ అంది!

"బతగ్గలనన్న నమ్మకం నాకుంది" అన్నాను!

"ఆ భగవంతుడే కాపాడాలి నిన్ను" అంది దిగులుగా చూస్తూ!

ఎందుకీ ముసలి ప్రాణికి నావల్ల ఇంత అకారణమైన దయ, ప్రేమ?

తనవాళ్ళంటూ ఎవరూ లేనందువల్లా?

లేక మానవత్వం పాలుకాస్త ఎక్కువైనందువల్లా?

అయినా ఎంత చిత్రం... ఒక్కో మనిషి చిత్తం ఒక్కో విచిత్రం! నాన్న ఆడదాన్ని పంజరంలో బంధించాలనుకునే కోవకి చెందిన వ్యక్తి!

శ్రీకాంత్ కావాలనుకున్న స్త్రీని స్వంతం చేసుకుని, అవసరం లేదనుకున్న తక్షణం నిర్దాక్షిణ్యంగా వదిలి వెళ్ళిపోగలిగిన మనిషి.

వినోద్ యుక్తాయుక్త విచక్షణ లేకుండా కోరుకున్న ఆడదాన్ని పొంది తీరాలన్న పట్టుదల కలిగినవాడు!

ఈ గోపాలరావు వీళ్ళందరికీ భిన్నమైన వ్యక్తి! తన స్వార్థం కోసమే కావచ్చు... కొంత సాహసం చెయ్యదలచుకునే వ్యక్తి!

ఈ అవ్వ కూడా సాటిమనిషివల్ల కాస్త దయ, కరుణ, జాలి, అభిమానం కలిగిన వ్యక్తి!

ఏమిటో వింత వింత మనః ప్రవృత్తులు కలిగిన మనుషుల విచిత్ర సమ్మేళనమే ఒక సమాజం!

ఈ సమాజంలో నాలాంటి సీతలెందరో!

* * *

"రెండుగంటలయింది! ఇక ఈరోజుకి పడుకోండర్రా! నాకు నిద్రవస్తోంది" అన్నాను!

"ఊహూఁ... చెప్పక్కా" అంటోంది సుధ!

అజిత్ తదేకంగా నావైపే చూస్తున్నాడు!

"ఇక చెప్పను! రేపు ఆదివారం మీఇద్దరికీ, నాకు కూడా సెలవు! రేపు చెప్పుకుందాం! ఇక నిద్రపోండి" ఖచ్చితంగా అన్నాను!

సుధ అయిష్టంగా ఒప్పుకుంది! ముగ్గురం నిద్రకి ప్రయత్నించాం! కానీ ఎవరికీ అంత సులభంగా నిద్ర పట్టలేదు.

"అజ్జూ! ఆలోచన మానేసి నిద్రపోమ్మా" అన్నాను.

"నువ్వు నిద్రపోమ్మా" తన చిట్టి చేత్తో నా మొహం తడుముతూ అన్నాడు!

వాడి చేతిని ముద్దు పెట్టుకున్నాను! బాబు నేను ఆశించినవిధంగా పెరుగుతున్నాడు! అదే ఈ జీవితంలో నాకు లభించిన పెద్ద తృప్తి! ఈనాడు అవ్వ లేకపోయినా ఆ లోటు తీరుస్తూ నన్ను అర్థం చేసుకున్న సుధ స్నేహం దొరికింది! అదో తృప్తి! ఇలా ఏదో సంతృప్తి లేకపోతే ఎంత సమస్యల్ని లెక్క చెయ్యని మనిషీ, సమాజాన్ని ఎదుర్కోగలిగిన మనిషీ శాంతంగా బతకదేమో!

అందుకు ఉదాహరణ నా జీవితమే! నాకు జీవితంమీద తప్ప ఇంకే విషయంవల్లా ఆశలూ, ఆకాంక్షలూ లేవు! ఆ జీవితం ఈమాత్రం నిబ్బరంగా నిశ్చింతగా గడపగలుగుతున్నానంటే ఇలాంటి చిన్నచిన్న సంతృప్తులే పెద్ద అండ అయ్యాయేమో!

ఏ వేకువఝామున నిద్రలోకి జారామో మాకే తెలీదు!

తెల్లారి నేను లేచేసరికి బారెడు పొద్దెక్కింది!

అప్పటికే అజిత్, సుధ స్నానాలు చేసి ఫ్రెష్‌గా దర్శనమిచ్చారు!

"త్వరగా కదిలి స్నానం చేసిరా అక్కా! కడుపులో ఎలకలు ఉరుకులు పరుగులు తీస్తున్నాయి- బ్రేక్‌ఫాస్ట్ రెడీ" అరిచింది సుధ!

సుధ... ఒక మల్లెపూవు...

ఒక మంచిగంధపు సువాసన...

ఒక తెలిమబ్బు...

ఒక మంచుబిందువు...

అన్నీ కలిసిన ఒక స్వచ్ఛమైన... సుధ!

ఈ చిన్నపల్లెలో నాకు ఎదురైన అనేక అనుభవాల్లో ఒక మంచి అనుభవం సుధ!

నాకూ, ముఖ్యంగా అజిత్‌కి ఒక ప్రియనేస్తం! వూరంతా వెలిపెట్టిన నన్ను సాహసంతో అంటిపెట్టుకుని తిరగగలిగిన సాహసం అవ్వ తరువాత తనే చేసింది! 'అందుకు సుధకి నేను కృతజ్ఞురాలినై వుండాలా?' అన్న ఆలోచన నాకెప్పుడూ రాదు!

మిగతా మనుమలకంటే కాస్త భిన్నంగా అయినా సుధ నాకు కన[illegible]లుగుతోందంటే వీళ్ళందరికంటే తనలో కొన్ని ప్రత్యేకతలు ఉండొచ్చు! అంతే! అదేమీ వింతగాదు! ఈ ప్రపంచంలో మనుమలంతా ఒకేలావుండరు! అందుకు ఉదాహరణ సుధ!

నేను స్నానం చేసి వచ్చాక టిఫిన్లు చేస్తుండగా వచ్చింది పక్కింటావిడ- "సీతా! శ్రీకాంత్ వచ్చాడట తెలుసా?" అంటూ!

అంతులేని ఆసక్తి ఆవిడ కళ్ళల్లో!

"తెలును" అన్నాను మామూలుగా!

సుధ అప్పటికే మింగేలా చూస్తోంది ఆవిడ వైపు!

"ఎవరు చెప్పారు?" ఆశ్యర్యంగా అడిగింది నేనిచ్చిన కాఫీ కప్పు అందుకుంటూ.

"నేను" చప్పున అన్నాడు అజ్జూ!

"నువ్వా... నీకెవరు చెప్పారు?" ఇంకా ఆశ్చర్యంగా అడిగింది!

"స్కూల్లో పిల్లలు చెప్పారు" అజిత్ సమధానం ఇచ్చాడు!

"చూశావా. మీ నాన్నని?" అడిగింది!

"లేదు" అన్నాడు అజిత్.

"చూడాలనిపించదూ?" ఆసక్తిగా అడిగింది.

నేను మామూలు చిరునవ్వుతో వింటూంటే సుధ చర చరమంటూంది. నాకు భయపడి వూరుకుందిగానీ, లేకపోతే ఆవిణ్ణి దులిపి పారేసేది ఈనరికి!

"చూడాలనిపించటంలేదు" అజిత్ సమాధానం.

"మీ నాన్నంటే నీకు కోపమా అజ్జూ?" ఆవిడ ప్రశ్న

"లేదు" వీడి సమాధానం.

"ఇష్టమా?"

"కాదు."

"చూడకూడదనిపిస్తుందా?"

"అనిపించదు ఆంటీ! అసలేం అనిపించదు" నవ్వుతూ చెప్పాడు.

"ఎక్కడో వింత పిల్లాడివి! తల్లికి తగిన బుద్ధులే వచ్చాయి" అంది విచిత్రంగా చూస్తూ.

సుధ ఏదో తీవ్రంగా అనబోయి నా చూపుల్ని గమనించి ఆగిపోయింది.

"మీ నాన్న అచ్చు నీలాగే వుంటాడు తెలుసా?"

బాబు నోరు విప్పకముందే సుధ అక్కసు పట్టలేనట్టు "అలా వుండబట్టేగా అతడి కొడుకు వీడని మీరంతా నమ్ముతున్నారు" అనేసింది.

ఆవిడ మొహం నల్లబడింది.

"సుధా లోపలికి వెళ్ళి స్టౌ మీద కాసిని బియ్యం పడెయ్" అంటూ సుధని పంపేశాను.

ఆవిడతో పోట్లాటకి దిగినా దిగగలదు.

సుధ వెళ్ళిన వైపే కోపంగా చూసి- "ఈ అమ్మాయికి చిన్నాపెద్దా తెలీదు! తను మగరాయుడిలా ఉద్యోగం చేస్తోందని గర్వం" అంది.

నేనేమీ బదులివ్వలేదు.

"మీ నాన్న ఇంకో ఆవిణ్ణి పెళ్ళి చేసుకున్నాడు తెలుసా?" మళ్ళీ అడగటం ప్రారంభించింది అజిత్‌ని.

నేను మౌనంగా వింటున్నాను. ఇందుకే సుధకి కోపం, వాళ్ళని వారించనని తిట్టనని, నేను ఒక క్రమపద్ధతిలో అజిత్‌ని ఈ ప్రశ్నలకి ఈ సమాజపు పోకళ్ళకి అలవాటు చేస్తున్నానని చెప్పినా వినిపించుకోదు.

"పాతికేళ్ళొస్తున్నాయి! ఇంకా ఎప్పుడు ఈ మనుమల్ని అర్థం చేసుకుంటావు సుధా" అంటే...

"ఏంఫరవాలేదు... వీళ్ళని అర్థం చేసుకు





న్నంతమాత్రాన ఏమీ ఒరిగి నా ఒళ్ళో పడదు, నన్ను మెచ్చి ఎవరూ మెడల్స్ వెయ్యరు" కచ్చితంగా అంటుంది.

"తెలుసు అంటీ! నాకు అన్నీ తెలుసు" అజిత్ చెబుతున్నాడు.

"నీకెవరు చెప్పారు?" ఆవిడ ప్రశ్న

"మీరంతా చెప్పారుగా" బాబు సమాధానానికి ఆవిడ అవాక్కయిపోయింది.

"మీకంటే ముందే అమ్మ చెప్పింది- నాకన్నీ తెలుసు."

"తెలిసినా నీకు కోపం రాదూ?" తేరుకుంటూ అడిగింది.

"ఎవరి మీద... అమ్మ మీదా?" వాడి ప్రశ్నకి మళ్ళీ తెల్లబోయిందావిడ.

"అదీ, అలా అడుగు" అన్నట్టు కిచెన్‌లో నుండి తొంగిచూస్తూ నవ్వుతోంది సుధ.

"నాకు మీ మీద కూడా కోపంలేదు ఆంటీ! ఈ వూళ్ళో ఎవరి మీదా లేదు..."

వాడి జవాబులకి వూపిరి తిరగనట్టు లేచి నిలబడి- "వస్తాను సీతా- పనుంది" అంటూ వెళ్ళిపోయింది ఆవిడ.

సుధ బయటికొచ్చి- "మూర్ఖురాలు! ఇది సినిమా అనుకుంది. డాడీ... అంటూ పరుగెత్తాడనుకుంది. వీడు సీత కొడుకని మర్చిపోయింది" అంటూ అజిత్ బుగ్గలు ముద్దుపెట్టుకుంది.

వాడు సిగ్గుపడ్డాడు.

"అక్కా కిచెన్‌లో ఒక కుర్చీ వేసుకుని కూర్చో నువ్వు! అజ్జూ నాకు అన్నీ అందిస్తూంటాడు. నేను వంట చేసేస్తాను. నువ్వు మిగతా కథ చెప్పు" అంది.

కథ...

"అవునమ్మా! పద" అజిత్ నా చెయ్యి పట్టుకుని లాగాడు!

"పదండి" కదిలాను.

అజిత్ వంటగదిలో నాకు కుర్చీ ఏర్పాటుచేశాడు.

స్టౌముందు కూర్చుని- "కత్తిపీట అందుకో... వంకాయలందుకో, నూనె సీసా పట్రా" అంటూ అజిత్‌ని పురమాయిస్తూ- "నువ్వు కానీ అక్క" అంది సుధ.

నేను కళ్ళుమూసుకున్నాను. రాత్రి సగంలో ఆగిపోయిన నా జీవితకథ తాలూకు ఫిలింద్రీళ్ళు గ్యాలరీళ్ళలా నా కళ్ళముందు మెల్లిగా తిరగటం ప్రారంభించాయి. మళ్ళీ చెప్పడం మొదలెట్టాను నేను.

వెయ్యి చెవులుచేసుకొని వింటున్నారు వాళ్ళిద్దరూ.

"ఆ బిందె చంకనేసుకుని నువ్వురావడం నేను చూడలేకపోతున్నాను. పురుడొచ్చేవరకూ ఇక నువ్వు బావిదగ్గరికి వెళ్ళొద్దు సీతమ్మ" అంది అవ్వ.

"అలాగే అవ్వా... ఈ ఒక్కరోజుకి వెళ్ళి రానీ" బతిమాలుకున్నట్టన్నాను.

"సరే... ఈ ఒక్కరోజే. రేపట్నుండి ఇల్లు కదలడానికి లేదునువ్వు. నిండుచూలాలివి, ఇదేం బాగాలేదు" అంది.

"అలాగే అన్నానుగా, ఏమిటో ఒక్కసారి అలావెళ్ళిరాందే నాకేంతోచదు" అన్నాను.

"నీజీవితాన్ని ఉద్ధరించింది కాదూ ఆ బావి" అంది కోపంగా.

"అవును... నిజంగానే ఉద్ధరించింది, లోకం అంటే ఏమిటో అర్థమయ్యేలాచేసింది" నవ్వుతూ కదిలాను.

"నీ బతుకు ఇలా నవ్వుతోనే వెళ్ళిపోవాలన్న ఈ ముసలిదాని కోరికని ఆ గుడ్డిదేవుడు విన్నాడో లేదో" యాతనగా అంటుంది అవ్వ వెనక నుండి.

మామూలుగా బావిదగ్గరికెళ్ళి నీళ్ళుతోడుకున్నాను. తిరిగివస్తుండగా దార్లో వినోద్ ఎదురయ్యాడు. నన్నుచూసి తలదించేశాడు. అతడంతే, నన్నుచూస్తే తలఎత్తడు, తలవంచి వెళ్ళిపోతాడు, నేను ప్రత్యేకంగా అతణ్ని పట్టించుకోను.

దార్లో ఎదురయ్యే ప్రతి మనిషీ ఎంతో అతడూ అంతే, నాఆలోచనల్లో అతడికెలాంటి స్థానమూవుండదు. ఇప్పుడు నా ఆలోచనలన్నీ రాబోయే పురుడుమీదే.

ఎలావుంటుందో...

ఏంజరుగుతుందో?





కాన్పు సులభంగా అయిపోతే ఫరవాలేదు. కాన్పు కష్టమై నేను పోతే...

ఈవూహకే నాగుండె అదిరిపడుతోంది.

ఈప్రపంచంలో అప్పుడే కళ్ళు తెరిచిన పసికందు ఏ అండాలేకుండా ఎలా బతుగ్గలదు?

అప్రయత్నంగా నాకళ్ళలో నీళ్ళు తిరిగాయి. 'నేనేపొయ్యాక ఆబిడ్డసంగతి నాకెందుకూ'...అని అనుకోలేకపోతున్నాను.

మాతృత్వపు మమకారం అలాంటిది, శ్రీకాంత్ దూరమయ్యాక ఇంతనిశ్చింతగా బతకగలుగుతూన్న నేను ఇంకా నాకంటికైనా కనబడని కడుపులోని బిడ్డమీద ఎన్ని ఆశలు పెంచుకుంటున్నానో నాకే అర్థమవుతోంది.

ఆబిడ్డని ఒక ప్రత్యేకమైన వ్యక్తిగా తీర్చిదిద్దాలి, ఈసమాజానికి ఒకవరంలా అందివ్వగలగాలి, ఇదీ నాకోరిక, ఇది నాస్వార్థంకూడానేమో.

ఈమాట అవ్వతోఅంటే కోప్పడింది. "నీకేంఫరవాలేదు, లక్షణంగా కొడుకునో కూతుర్నో ఎత్తుకుంటావు, పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు సీతమ్మా" అంది.

"ఒకవేళ దురదృష్టకరవశాత్తూ అలాంటిదే జరిగిందే అనుకో అవ్వా నాబిడ్డని నువ్వు జాగ్రత్తగా చూసుకుంటావుగదూ"? అడుగుతూంటే నాకంఠం వణికింది.

"పిచ్చిసీతమ్మా... ఈ అవ్వను గురించి నీకు అనుమానమా?" అంది.

కాస్సేపాగి మెల్లగా "నిజంగా అలా జరిగితే బిడ్డని గోపాలరావుగారికి ఇచ్చేస్తానునరేనా" అంది.

ఈమాట వినగానే కాస్త నిశ్చింతగా అనిపించిందినాకు.

అయినా మళ్ళీ ఏదో యాతన...

అలాగాక మరోలా జరిగే అవకాశంకూడా

వుంది. ఆ బిడ్డకే ఏదైనా జరిగితే...

ఆకులా వణుకుతాను ఈ ఆలోచనకి

వద్దు...వద్దు...అలాంటిపాపిష్ఠి ఆలోచనే రాకూడదు నాకు,

నేనెంతదుర్మార్గురాలిని...

ఇలా ఆలోచిస్తానేమిటి?

నా మనసు ఈ విషయంలో ఇంతకీడుని శంకిస్తుందేం?

శుభాన్నే ఆశించదేం?

అసలు ఇప్పటి నా యీపరిస్థితిని గురించి గాక ఇంకాముందుకెళ్ళి ఆలోచిస్తానేం?

విషవలయంలోలా చిక్కుకుపోయివున్న ఇప్పటి స్థితి గురించి కాస్తయినా భయపడక ఇంత నిశ్చింతగా ఎలా వుండగలుగుతున్నాను?

ఎంతగా రాటుదేలిపోయాను ఈ విషయంలో...

అదేమాతృత్వం దగ్గరికి వచ్చేసరికి మామూలుస్త్రీలా బేలనైపోతున్నాను.

ఇలాంటి బలహీనతలే స్త్రీ మనుగడని దెబ్బతీస్తున్నాయా?

"సీతా...ఆగే..." బొంగురుకంఠం నాఆలోచనలకి, నానడకకి కళ్ళెంవేసి ఆపేసింది.

నడవలేకనడుస్తూ వూరిమధ్యకిచేరుకున్నాను అప్పటికే నేను.

ఆ వీధి జనంతో కళకళలాడుతోంది.

ఎదురుగా కాస్త మొరటుగా, తెల్లగా, బలిష్ఠంగా వున్న వుంగరాల జుట్టుగల వ్యక్తి. మెల్లకన్ను. నవ్వుతున్నాడు...

ఆ నవ్వులో కసి...

కోపం...

దాహం...

ఎవరితడు?

"ఏంటలా చూస్తావు? నాగరాజునే! నీ మిండ మొగుడిచేత నా వాళ్ళని చితకతన్నిస్తావా? ఈ నడిరోడ్డులో నీ గుడ్డలిప్పిపారేస్తే ఎవడడ్డువస్తాడో చూస్తాను..."

స్థంభించిపోయాను!

నాగరాజు...

ఇతడా?

కనీసం ఇతడి మొహం అయినా చూసి ఎరుగను నేను...

ఇతడితో నాకు శత్రుత్వం లేదే...

ఎందుకితడికింత కక్ష నామీద?

నాకేం పాలుపోలేదు. అతడు ఒక్కో అడుగే ముందుకేస్తున్నాడు...

అతడు రాక్షసుడిలా కనబడుతున్నాడు నా కళ్ళకి...

నేను అప్రయత్నంగా ఒక్కో అడుగే వెనక్కి వేస్తున్నాను...

చాలారోజుల తరువాత తొలిసారిగా భయపడుతున్నాను నేను. నాగరాజు మనిషిలా లేడు...

ఒక రాక్షసుడిలా ఉన్నాడు...

నా నోరు తడారిపోతోంది...

దారినవెళ్ళే జనం ఆగిపోయ్యేరు...

చాలామంది తమ ఇళ్ళవాకిళ్ళలో నిలబడ్డారు...

అంతా చూస్తూనే వున్నారు...

నాగరాజు నా దగ్గరికి వచ్చి మొరటుగా నా చంకలోని బిందెని లాగి దూరంగా విసిరాడు. పెద్ద చప్పుడుతో కిందపడిపోయిందది. ఈసారి నాచేతిలోని బక్కెట్‌ని ఇంకోవైపు విసిరాడు.

"వద్దు... వద్దు" విహ్వాలంగా అరిచాను.

వినోద్ నన్ను నలిపి నాశనం చేసినప్పుడు కూడా నేనింత భయపడలేదు. ఎందుకో నాకు తెలీదు...

"నన్ను దయతలచి విడిచిపెట్టు. నను నీకేం అపకారం చేశాను? ఎందుకిలా నన్ను ఆటబొమ్మని చేసి ఆడుకుంటున్నారు..." నేను పైకి అంటున్నానో, నాలో నేనే అనుకుంటున్నానో నాకే తెలీదు.

ఒక ఆడదాన్ని...

తనకేమాత్రం అపకారం చెయ్యనిదాన్ని...

అసహాయురాల్ని...

నిండు చూలాలిని...

ఇలా నడివీధిలో...




ఉన్నట్టుండి కడుపులో ఎక్కడో పలుగుతో పొడిచినట్లు కలుక్కుమంది...

నడుములు నొప్పి...

భయంకరమైన నొప్పి...

నా కళ్ళు వచ్చుబడిపోతున్నాయి...

అంతవరకే గుర్తుంది నాకు...

విపరీతమైన భయంతో, ఆందోళనతో నాకు స్పృహ కోల్పోయింది...

ఆ తరువాతేం జరిగిందో నాకు తెలీదు.

★ ★ ★

నాకు మెలకువ వచ్చేసరికి పొత్తిళ్ళలో బిడ్డతో ఎదురుగా అవ్వ నిలబడి వుంది. ఒక్కక్షణం అయోమయంగా అనిపించింది.

మరుక్షణం సర్వం గుర్తొచ్చింది.

"సీతమ్మా... నీకు కొడుకమ్మా" అంది అవ్వ కళ్ళనీళ్ళతో.

నాకర్థమవుతోంది! నాకు తెలుస్తోంది!

అప్పుడే నాకు నొప్పులొచ్చాయి! బహుశా ఆ స్పృహలేనిస్థితిలో నడిరోడ్డు మీద బిడ్డని కని వుంటానా నేను?

నాకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి...

ఎందుకూ?

నడిరోడ్డులో నాగారాజు నన్ను అవమానించి నందుక్కాదు...

దిక్కులేనిదానిలా ఒక కుక్కకంటే హీనంగా నడిరోడ్లో బిడ్డకి జన్మనిచ్చినందుకూ కాదు...

నా బిడ్డనాకు భద్రంగా దక్కినందుకు!

నాగరాజు మాత్రం మనిషే! అతడి కక్షను నన్నవమానించి తీర్చుకోవాలని చూశాడు!

బిడ్డకోసం చేతులు చాపబోతూన్నాను నేను...

"సీతమ్మా..." ఆ బొంగురుగొంతువిని ఉలిక్కపడి చూశాను!

నాగరాజు...

నాకాళ్ళవైపు...

నాలో అంతులేని ఆశ్చర్యం...

అతని కళ్ళల్లో నీళ్ళు...

పశ్చాత్తాపం...

ఒక్కఉదుటన నా రెండుకాళ్ళూ పట్టుకున్నాడు నాగరాజు "సీతమ్మా... నన్ను క్షమించు తల్లీ! దుర్మార్గుడినమ్మా! రాక్షసుడిని! నడిరోడ్డులో తేలుబుట్టువులాంటి ఆడదానిపై చేయిచేసుకున్న పాతకుణ్ని! ఆడకూతురివి దిక్కుమాలినదానిలా నడిరోడ్డులో కనడానికి కారుకుడైన పాపిని తల్లీ! నన్ను నీకాలి చెప్పుతో కొట్టుసీతమ్మా..." భోరున ఏడుస్తున్నాడు నాగరాజు!

"లేరా వెదవచచ్చినోడా! చేసినంతా చేసి ఇప్పుడు ఏడుపుదేనికి? ఆ మహాతల్లికి నీలాంటి పాపులనీడయినా సోకకూడదు! లేచిపో..." ఉగ్రంగా అరిచింది అవ్వ!

అప్పుడే చూశాను తలఒంచుకుని దూరంగా నిలబడివున్న వినోద్‌ని! అతడి మొహం పాలిపోయివుంది!

ఈ వినోద్‌కీ ఈ నాగరాజుకీ బద్ధవైరం!

ఎందుకొచ్చి వుంటుందీ?

ఏ ఆడపిల్ల దగ్గరో, లేదా ఇలాంటి మరో పనికిమాలిన విషయం దగ్గరో...

నాగరాజు డబ్బులేని మొరటుగూండా! వినోద్ చదువూ, పలుకుబడీ, డబ్బూ వున్న రౌడీ! ఇప్పటిదాకా ప్రతివిషయంలోనూ వినోద్ పైచేయి అవుతూవచ్చింది! అతడి డబ్బుకీ, పలుకుబడికీ భయపడి నాగరాజు దూరంగా వుంటూవచ్చాడు!

కానీ, ఈనాడు నన్ను చెరిచి తనకోరిక తీర్చుకున్నాడు వినోద్! అక్కడితో అది ముగిసిపోలేదు! లోకం దృష్టిలో నేను దిక్కులేనిదాన్నైయ్యాను! వినోద్‌కి వూళ్ళో అంతో ఇంతో నిరసన ఎదురయింది! దాంతో అతడు నాగరాజుకి లోకువ అయ్యాడు! ఎంగిలాకులా భావిస్తున్న నామీద నాగరాజు కన్నుపడింది! లేదా అతడి మనుమలకన్నుపడింది.

అప్పటికే తనమూలంగా నాజీవితం ఇలా అయిందని పశ్చాత్తపపడుతున్నందువలనో, లేక తన ఆధిక్యతని నిలబెట్టుకోవడంకోసమో వినోద్ నాగరాజు మనుమల బారినుండి నన్ను తప్పించాడు ఆరోజు! అదేరోజు రాత్రి నన్ను అల్లరిపెట్టాలని చూసిన అతడి మనుమల్ని చితకతన్నాడు! నాగరాజు కక్షపెరిగిపోయింది!

'ఎవతో దిక్కులేని దానివిషయంలో నీ అధి



కారం ఏమిటన్న' కోపం...

'దాన్నే దోచేస్తాను, నడిరోడ్లో అవమానిస్తాను... నువ్వు ఏం చెయ్యగలవన్న' పంతంతో వినోద్ మీద ప్రతీకారం తీర్చుకునే ప్రయత్నంలో నన్ను అవమానించబోయాడు! అంతేగాని నేన తడికి శత్రువునైకాదు! నామీద ప్రత్యేకంగా ద్వేషం వుండీ కాదు!

ఈ సంఘటన తర్వాత నాగరాజులోని మాన వత్వం కళ్ళుతెరిచి వుంటుంది! పశ్చాత్తాపంతో అతడు దహించుకుపోతున్నాడు!

అంతకంటే ఇంకేం కావాలి?

తప్పులూ, పొరపాట్లూ అందరూ చేస్తారు! ప్రతిమనిషీ ఒక దేవుడిలా ప్రవర్తించలేడు! జీవించలేడు! కానీ తన తప్పుని గుర్తించి నిజాయితీగాపశ్చాత్తాపపడ్డ ప్రతిమనిషీ ఒక దేవుడుకాడూ?

ఇప్పుడీ నాగరాజు తన పొరపాటుని గ్ర హించి పశ్చాత్తపపడుతున్నాడు; మళ్ళీ ఇంకో స్త్రీకి ఇలాంటి అపకారం తలపెట్టడు! ఇతడి పాపం ఏదైనా వుండివుంటే ఇంతటితో పరిహార మైపోతుంది! నాగరాజు పునీతుడైపోతాడు!

అవ్వ అంటోంది "ఇది వూరా? ఈ వూళ్ళో వున్నది మనుమలేనా? ఒక ఆడదాన్ని ఒక రౌడీ వెధవ నడిరోడ్లో నిలబెట్టి గుడ్డలిప్పబోతే వినోదం చూస్తుంటారా? ఆ అభాగ్యురాలు నడి రోడ్లో బిడ్డనుకంటూ వుంటే మొహాలుచాటే స్తారా? ఇక్కడున్న వాళ్ళందరూ రాక్షసులు! దయ కనికరం లేని జన్మలేం జన్మలు? భగ వంతుడనే వాడుంటే నిలువునా తగలబడిపో కూడదూ ఈ వూరు? నెత్తుటి కందునీ బాలింత రాల్నీ పుట్టెడు మురికితో ఇద్దరు మగాళ్ళు ఇల్లు చేరుస్తూవుంటే చూస్తూ చూడనట్టు నటి స్తారా? రేపు నానా మాటలూ అని ఈ అమాయ కురాల్ని తూట్లు పొడుస్తారా?

నాకళ్ళు నిండుకున్నాయి మళ్ళీ!

ఈ నాగరాజూ, వినోద్ కలిసి నన్నూ నాబి డ్డనీ నడిరోడ్డు నుండి ఇంటికి చేర్చారు

కృతజ్ఞతతో నానోట మాటరాలేదు.

వీళ్ళరుణం నేనేజన్మలో తీర్చుకోగలను?

సాటి ఆడవాళ్ళు సమాజానికో, భర్తలకో భయపడి దాక్కుంటే పురిటిబాలింతరాల్ని భు జాలమీద ఇంటికి చేర్చారు! వాళ్ళు నాకంటికి దేవతామూర్తుల్లా కనిపిస్తున్నారు. రెండుచేతు లూ ఎత్తి వాళ్ళకి దండంపెట్టాను.

వినోద్ తల భూమిలోకి కృంగిపోతున్నంతగా ఒంగిపోయింది.

నాగరాజు మరోసారి బావురుమన్నాడు చిన్న బిడ్డలా!

"చాలుచాలుగానీ వెళ్ళిపోండి" ఛీత్క రించుకుంది వృద్ధురాలు!

వినోద్ తలవంచుకుని వెళ్ళిపోయాడు.

వెనుతిరిగి చూస్తూ, దండంపెడుతూ వెళ్ళి పోయాడు నాగరాజు!

బిడ్డని అందించింది అవ్వ. ఆర్తిగా అందు కున్నాను.

నాబిడ్డ...

నారక్తం...

క్షేమంగా నాకు దక్కింది!

మళ్ళీ 'నా' అన్న స్వార్థం...

మనిషిని కాదూ నేనూ...

నిశ్చింతగా బిడ్డని గుండెల్లో దాచుకున్నా ను!

చాలా సంతృప్తిగావుందిప్పుడు నాకు!. అవ మానాల తాలూకు చింతలూ, ఛీత్కారాల తా లూకు బాధలూ నన్నెంటాడటంలేదు!

నేనెంత అదృష్టవంతురాలిని!!!



ఊళ్లో ఆడవాళ్ళెవరూ నన్ను చూడటానికి రాలేదు ఓ వారం దాటిపోయినా! అందుకు నేనేం బాధపడలేదు! వాళ్ళ పరిస్థితి నేను

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్నీ అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు,
కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్
రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలూ,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్నీ అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీది
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




1Y/FSL/5112/TEL

అర్థంచేసుకోగలను!

వాళ్ళుమాత్రం మనుమలు కాదూ?

వాళ్ళల్లో కాస్తయినా దయా, జాలీ, సాను భూతీ అన్నవి లేకుండా వుంటాయా?

అయినా ఎవరికివాళ్ళు ఎదుటి మనిషికి భయపడుతారు. పైగా భర్తచాటు ఇల్లాళ్ళు! అందరిదృష్టిలో చెడిపోయినదాన్ని! పైగా ఆరోజు వినోద్ నన్ను భుజంమీద వేసుకుని ఇంటికి తీసుకొస్తే అతడి బద్ధ శత్రువు నాగ రాజు అతడి వెనకనే నా బిడ్డని ఎత్తుకొచ్చాడు. నన్ను అవమానిస్తే వింత చూడాలని కాచుకు న్న వాళ్ళకిది వూహించని దృశ్యం!

పైగా నడివీధిలో నాగరాజుని వినోద్ చావబా దాడు!

కానీ నాగరాజు ఎదురుతిరగలేదు...

పిల్లిలా అయ్యాడు!

అతడిలోని మానవత్వం కళ్ళు తెరిచిందని ఎవరూ అర్థంచేసుకోవటంలేదు! ఇప్పుడు నాగరాజు తన గూండాయిజానికి స్వస్తిచెప్పా డు! వినోద్ ఎదురయితే కోరచూపులు చూడ టంలేదు. తోబుట్టువుని పలకరించినంత ఆద రంగా నన్ను పలకరించి వెళుతున్నాడు! తన మనుమలచేత నాకు క్షమాపణ చెప్పించాడు!

ఇదంతా చూసేవాళ్ళకి ఎలా కనబడు తుంది?

ఈ ఇద్దరు మగాళ్ళూ నాకు దాసోహం అని, కుక్కలు తోకాడించుకుంటూ విశ్వాసంగా యజ మానివెంట తిరిగినట్టుగా నాఇంటిచుట్టూ, నాచుట్టూ తిరుగుతున్నట్టు, నేనో పెద్ద దుర్మార్గు రాలినీ, కులటనీ అయినట్టూ కనిపిస్తుంది!

దీంతో వాళ్ళలో ఏ మూలనోవున్న సాను భూతి, జాలి నశించివుంటాయి. అలా అని ఎంతకాలమో నన్ను చూడకుండా, నాతో మాట్లా డకుండా వుండలేరు. నాబిడ్డని చూడకుండా వుండలేరు. ఎప్పుడో వస్తారు. నూటిపోటి మాట లతో ఏదో అంటారు. రహస్యంగా చూసివెళతా రు.

జరిగిన ఈ సంఘటన ఒకందుకు మంచిదే నేమో రాక్షసుడిలా పేరుపడిన నాగరాజు, మని షయ్యాడు! అతడి రౌడీయిజానికి ఇంకెవర్నూ భయపడరు. వయసులో వున్న స్త్రీలు అతణ్ణి చూసి దాక్కోనక్కరలేదు.

అతడికీ, వినోద్‌కీ మధ్య జరిగే గొడవల్లో ఇక తలలు పగలవు.

నేను నాకు జరిగిన అవమానాన్ని భరించ డంద్వారా ఎంత మేలు జరిగింది! అవమా నింపబడింది నేనొక్కత్తెనే? దానిమూలంగా వూరంతటికీ మేలు జరిగింది. ఇలాంటి అవ మానాలు నాకేం కొత్తగాదు! నేను వీటికీ, బాధ పడటాలకీ ఎప్పుడో అతీతురాలినైపోయాను. ఇది ఎవరు గమనించినా గమనించకపో యినా; అర్థం చేసుకున్నా చేసుకోకపోయినా ఫరవాలేదు. నేనెవర్నీ తప్పుపట్టను.

మిగతా అందరి పరిస్థితిలో నేనుంటే వాళ్ళ లాగే ప్రవర్తించనూ?

అలాంటప్పుడు వాళ్ళని ద్వేషించటం ఎందుకు?

ఆరోజు అవ్వ వెంట ఒక పెద్దాయన ఇంటికి వచ్చాడు. ఆయనే గోపాలరావుగారని అవ్వ చెప్పగానే నమస్కారం పెట్టాను.

"నీ గురించి విన్నానమ్మా" చాలా నిర్మ లంగా వుందాయనకంఠం!

"బాబుని ఒకసారి చూడాలనిపించింది" అన్నాడాయన.

"చూడండి... ఇంతగా అడగాలా" అన్నా ను చిరునవ్వుతో!

బాబుని అవ్వఅందించింది గోపాలరావుగా రికి! అప్యాయంగా అందుకున్నాడాయన! ఆ బిడ్డని ఆర్తిగా చూడటంతోనే తెలుస్తోంది ఆయనకి పిల్లలంటే ఎంత ఇష్టమో!

"నాకు పిల్లలంటే చాలా ఇష్టం అమ్మా! అదొక్కటే జీవితంలో తీరనికోరిక అయిపో యింది" అంటూంటే ఆయన కంఠం జీరబో యింది!

నేనేమీ అనలేకపోయాను! కాస్సేపటికి తేరు కున్నాడాయన!

"నువ్వు అనుభవిస్తున్న కష్టాలు నాదృష్టిలోకి వస్తూనే వున్నాయమ్మా! వినోద్‌ని పిలిపించి హెచ్చరించాను! నాగరాజుకీ వార్నింగ్ ఇద్దామ నుకుంటూండగానే ఇంతలో ఇంత గొడవా




జరిగిపోయింది" విచారంగా అన్నాడు.

"ఏవి జరిగినా అంతా తన మంచికే అను కుంటుందీ పిచ్చిపిల్ల బాబుగారూ" అంది అవ్వ!

"అదృష్టవంతురాలు" నిట్టూర్చాడాయన.

తరువాత అన్నాడు- "కొంతకాలం క్రితం మునలమ్మ నీగురించి చెప్పినట్టు నా వంశానికి వారసుడు అవసరం, నీకు రక్షణ అవసరం అని నిన్ను పెళ్ళిచేసుకుంటానన్నానమ్మా! అంతే తప్ప నాలో ఇంకో స్వార్థంలేదు! నాలో కోరికలూ, వాంఛలూ చచ్చిపోయాయి ఎప్పుడో! వృద్ధుడిని అయిపోయాను? అది మనసులో వుంటే నన్ను క్షమించు! నిన్ను చూస్తోంటే నాకు బిడ్డ గుర్తువస్తోంది" అన్నాడాయన కాస్త పశ్చా త్తాపం ధ్వనిస్తున్న కంఠంతో.

అప్పుడు గుర్తొచ్చింది నాకు... ఈ గోపాలరా వుగారే కదూ నన్నుపెళ్ళిచేసుకుంటానంది?

ఆయనవైపు పరీక్షగా చూశాను! మొహం నిర్మలంగా, కళ్ళు ప్రశాంతంగా వున్నాయి. ఏమాత్రం మనసులో కల్మషం వున్నా మనిషి మొహం అంత నిర్మలంగా, కాంతివంతంగా వుండదు!

ఎంత తమాషా... మొన్న నన్ను పెళ్ళిచేసుకో వాలనుకున్నాడాయన!

ఈనాడు బిడ్డతో సమానంగా భావిస్తానంటూ న్నాడు!

అయినా నాకు విచిత్రంగా అనిపించలేదు!

భార్య అవసరంకోసం కాదా 'పెళ్ళి' ప్రసక్తితె చ్చింది...

'బిడ్డ' అవసరం కోసం!

అప్పటి పరిస్థితి అది! ఇప్పటి పరిస్థితి ఇది! నిజంగా ఆయనలో ఏకోశానా దురుద్దేశ మూ, స్వార్థమూ లేదు.

అదే హరీంద్ర... ఒకనాడు నన్ను తోబుట్టు వులా భావిస్తున్నానన్నాడు!

తరువాత నన్ను ఉంచుకుంటానన్నాడు.

అతడిలో పుట్టెడు స్వార్థం...

అతణ్ని అంతస్వార్థపరుడిగా మార్చింది పరిస్థితులేకాదు, అతడి పిరికితనం కూడా.

నాగరాజు... నడివీధిలో అవరదుశ్శాసను డిలా నిందుచూలాలి వస్త్రాపహరణ చెయ్యా లని చూశాడు! అంతలోనే పశ్చాత్తాపపడి ఈనా డు నన్ను కన్నతల్లిలా, తోబుట్టువులా, ఒక దేవతలా చూస్తున్నాడు.

ఈ ముగ్గురుమగాళ్ళదీ... ఒక్కొరిది ఒక్కొ లాంటి పరిస్థితులు! ఎవర్నీ తప్పుపట్టాలని అనిపించదు!

"పగవాడైనా నూరేళ్ళూ సుఖంగా బతకా లని కోరుకుంటుంది బాబూ" అవ్వ చెబు తోంది! ఆయన నావైపు వాత్సల్యంగా చూస్తు న్నాడు!

ఓ అరగంట కూర్చుని వెళ్ళేముందు- "అ మ్మా సీతా! అప్పుడప్పుడూ వచ్చి బాబుని చూసి వెళుతూండవచ్చామ్మా నేను?" అడిగా డాయన.

"తప్పకుండా చూసి వెళ్ళండిబాబూ! నన్ను అడగాలా?" అన్నాను.

ఆయన మొహం సంతోషంతో విప్పారింది. "చాలా కృతజ్ఞుడిని అమ్మా! నువ్వు ఒప్పుకోవు అనిగానీ, నిన్ను నా బిడ్డగా బాబుని నామనవ డిగా స్వీకరించి ఇంట్లోనే వుంచుకునేవాణ్ని! లోకాన్ని నేను లెక్కచెయ్యను" అన్నాడాయన.

నేను నవ్వి వూరుకున్నాను!

వెళ్తూ "బాబు కాస్తపెద్దయిన దాకా నేను వచ్చి చూసివెళుతూంటాను! కాస్త పెరిగాక తనే నాదగ్గరికి వస్తాడు" సంబరంగా అంటూ వెళ్ళాడాయన!

నాకు చాలా ప్రశాంతంగా అనిపించిందా పూట! అప్పటినుండి రెండురోజులకోసారైనా వచ్చి బాబుతో ఓ గంటగడిపివెళ్ళేవాడాయన! తను వస్తూపోతూ, పండ్లూ, బిస్కెట్లూలాంటివి తెచ్చేవాడు! వద్దంటే ఆయన నొచ్చుకుంటా డని నేనేం చెప్పలేదు!

నా ఇంటికి ఆయన రాక వూళ్ళో సంచ లనం పుట్టించింది!

"సీత మునలివాణ్ని పట్టింది" అంది వూరు.

"అనుకోనీ అవ్వా! లోకం పాపం గుడ్డిది! గుడ్డిదానికి నిజాలేం కనబడతాయి చెప్పు! అలా అనుకున్నందువల్ల నాకు కొత్తగా వచ్చే

నష్టం ఏముంది?'' అన్నాను!

"అలాంటప్పుడు గోపాలరావుగారి ఇంటికే వెళ్ళిపోదాం సీతమ్మా! బాబుని దత్తత తీసుకుంటాడాయన! నిన్ను బిడ్డలా చూసుకుంటాడు! నీకు రక్షణ, బిడ్డ బతుకు బాగుపడటానికి అవసరమైన డబ్బూ దొరుకుతాయి'' ఆశగా అంది అవ్వ.

"వద్దవ్వా! వద్దు'' అన్నాను నెమ్మదిగా. "అంత స్వార్థం నాలోలేదు. నాబిడ్డకి నారక్షణ చాలు. నాబిడ్డని నేను పోషించుకోగలను. ఆయన బిడ్డని తన బిడ్డలా భావించినా, మనవడిలా భావించినా నాకు అభ్యంతరంలేదు. నన్ను నన్నుగా బతకనీ'' అన్నాను.

"అన్నీ తెలిసినదానివి! నీకు నేనేం చెప్పగలను'' అంది అవ్వ.

నా మనను నిర్మలంగా వుంది. దానిమీద ఎలాంటి మచ్చలూ, నీడలూ లేవు. ఎప్పటికీ అది అలావుండిపోవాలనే నా కోరిక. దానిమీద నహజమైన స్వార్థంకాకుండా బలమైన స్వార్థపు ఛాయలు పడకూడదు. అప్పుడు నేనూ అందరిలో ఒకతెనైపోతాను.

ఇలా ఆలోచిస్తే 'అందరిలో ఒకతెను కాకూడదూ, స్వార్థపరురాలు అనిపించుకోకూడదు' అన్న కోరిక కూడా స్వార్థమే కాదూ?

అవును! స్వార్థమే!

అయితే నా స్వార్థం మూలంగా ఎవరికీ ఎలాంటి అపకారం జరగదు. ఇలాంటి స్వార్థాలే మానవనహజమైన స్వార్థాలు.

★ ★ ★

చెప్పటం ఆపి శ్రో తలవైపు చూశాను. సుధ ఎప్పుడొచ్చిందోగానీ నా కుర్చీ దగ్గరే క్రిందకూర్చుని నా మోకాళ్ళమీద తల ఆన్చి తదేకంగా చూస్తోంది.

బాబు దూరంగా అల్మరా దగ్గరమినప్పప్పు జాడీ పట్టుకుని తదేకంగా నావైపే చూస్తున్నాడు. వాళ్ళిద్దరినీ అలాచూస్తూ మెల్లిగా నవ్వాను.

"ఇంత క్షమాగుణం నీలో ఎలావచ్చిందక్కా?'' ఆర్ద్ర కంఠంతో అడిగింది సుధ.

"జీవితం నాకు అందించిన విలువైన అనుభవాలనుంచి'' అన్నాను.

"మరి నీతో గత ఆరేళ్ళుగా స్నేహం చేస్తూ కూడా నేను ఏమీ మారలేకపోయానే''? అంది.

"దానికి నేనేమీ నమాధానం చెప్పలేను సుధా! ఇది మనిషి తనకుతానుగా పరిస్థితుల్నిచుట్టూవున్న నమాజం యొక్క ప్రభావాన్ని పరిశీలిస్తూ, విశ్లేషించుకుంటూ అలా అలా ఆలోచించుకుంటూపోతే ఈ ద్వేషభావం అన్నది నశిస్తుందా... లేక ఆ పరిస్థితులే మనిషిని అలా మారుస్తాయా? అన్నది నాకే అంతుపట్టలేదు! పిన్నికి, నాకు ఎదురయిన న్ని అనుభవాలు ఎదురుకాలేదు. పంజరంలో పక్షిలా బయటి ప్రపంచం చూడకుండానే ఒక్క నాన్న వలన బాధపడుతూ, తన జీవితాన్ని ఒక పాఠంగా తీసుకుని ప్రతి మనిషినీ సానుభూతితో అర్థంచేసుకోవడానికి ప్రయత్నించేది. ఆమె ప్రభావం నామీద అంతర్గతంగా వుండి వుండవచ్చు...

ఇప్పుడది నన్ను విశేషంగా చుట్టుముట్టి వుండవచ్చు. అయినా ఒకే ఒక నంఘటనతో నాలో పరిస్థితుల్నీ మనుషుల స్వభావ, మనస్తత్వాలనీ, నమస్యల్నీ విశ్లేషించుకుంటూపోవటం అనే అలవాటు వచ్చింది. అతిశయోక్తిగా అనిపించినా ఇది నా అదృష్టమే అని చెప్పకతప్పదు!

చూసే వాళ్ళకి నేను జీవితం అంతా పోగొట్టుకున్నాను అనిపించవచ్చు. అది నిజం కానేకాదు. వెయ్యిమందిలో ఒకరిగా అజ్ఞానంలో బతికేకంటే ఒంటరిగా కాస్త జ్ఞానంగా బతకటం మేలు. ఈ జ్ఞానం నమాజానికేం ఉపయోగపడకపోవచ్చు. దానికి అక్కరలేకపోవచ్చు...

నన్ను నేను, ఈ ప్రపంచాన్నీ అర్థంచేసుకోగలుగుతున్నాను అన్న తృప్తి చాలదూ?

నా జీవితం నీబోటి ఒకరిద్దరికైనా ముందు జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోవడానికి ఒక పాఠం కావచ్చు.

ఒక నాగరాజులో, ఇంకొక వినోద్‌లో మార్పువచ్చి వాళ్ళు మంచిమనుషులు కావడానికి కారణమైంది... ఇది చాలదూ?

రేపు అజిత్ ఒక ఆణిముత్యంలా నమా




జంలో ప్రత్యేకంగా బతకగలదు! నా బిడ్డగా అవికాదు చెప్తుంటా...ఒకవ్యక్తిగా! ఇది చాల దూ?

వీటన్నిటికంటే సంతోషకరమైనది అజ్ఞానంనుంచి జ్ఞానంలోకి వచ్చాను. ఈ ప్రపంచంలో దుర్మార్గులూ, స్వార్థపరులూ, పుట్టుకతో ఎవరూకాదు. ఏ పరిస్థితుల్లో, ఉమ్మడి సమాజమో వాళ్ళనలా మారుస్తోందన్న అవగాహన.

వాళ్ళు నన్ను వెలివేసినా, తరిమికొట్టినా, ఛీత్కరించుకున్నా వాళ్ల మధ్యనే కలిసి బతకగలుగుతున్న నిబ్బరం, ధైర్యం, నిశ్చింత, ఆత్మస్థైర్యం, నాలో రోజురోజుకీ పెరిగిపోవటమే. ఇంతకంటే మనిషిగా నాకు లభించాల్సిన ఆనందం, అనుభవించాల్సిన సౌఖ్యం ఏముంది చెప్పూ?" అన్నాను.

"నీకు నేనేం చెప్పగలనక్కా? కారుచీకట్లో కాంతిరేఖవి నువ్వు! గాఢాంధకారంలో చిరుదివ్వెవి నువ్వు" రుద్ధకంఠంతో ఆర్తిగా అంది సుధ.

అజిత్ అలాగే ఆలోచనగా చూస్తున్నాడు నన్ను.

"మనిషి మానసికంగా ఎంత ఎదిగినా, ఎంతగా తెలుసుకున్నా ప్రపంచాన్ని అర్థంచేసుకున్నా 'నేను' అన్న అహం, 'నా బిడ్డలు' అన్న స్వార్థం అంత సులభంగా వదలిపెట్టవు అన్న సత్యం కూడా నేను అర్థంచేసుకోగలిగాను. అవికూడా పూర్తిగా వదిలిపోతే మనిషి దేవుడైపోతాడేమో బహుశః" సాలోచనగా అన్నాను.

"అయితే అక్కా, నీకు మళ్ళీపెళ్ళి చేసుకోవాలన్న కోరిక, మరో వ్యక్తితో జీవితాన్ని పంచుకోవాలన్న ఊహ ఎందుక్కలగలేదు? పైగా వినోద్ నీ అనుగ్రహం కోసం, నీ సాన్నిహిత్యం కోసం సాంగత్యం కోసం, తహతహలాడుతున్నాడే?" ఎన్నోసారో ఇలా తను అడగడం!

"ఆకోరిక నాలోకలగలేదుసుధా" అన్నాను. "ఈ జీవితంలో నేను అనుభవించాల్సిన సుఖాలు, రుచులు... పొందాల్సిన అనుభూతులు, చూడాల్సిన కొత్త విషయాలు ఇక ఏమీలేవని అన్నింటినీ చూసేశాననే నాకనిపించింది. జీవితాన్ని పూర్తిగా చూసిన తృప్తిని పొందాక మళ్ళీ మొదట్నుండి జీవించాలన్న కోరిక నాలో కలుగలేదు. అందుకే వినోద్‌తోగానీ మరొకరితో గానీ నాజీవితాన్ని ముడేసుకోవాలనుకోలేదు. అయినా సమాజంతో ఉమ్మడిగా ఈజీవితాన్ని ముడేసుకున్నదాన్ని ప్రత్యేకంగా నాకు ఇంకో వ్యక్తి తోడంటూ ఎందుకూ చెప్పు?" అన్నాను.

"ఇంత ఔదార్యంతో ఈ ప్రపంచంలో బతకడం కష్టం అక్కా" అంది సుధ.

"నేను బతుకుతున్నాను కదమ్మా?"

"ఎందరు ఇలా బతగ్గలరంటావు?"

"సమాజాన్ని అర్థంచేసుకోగలిగితే ప్రతి ఒక్కరూ బతికెయ్యగలరు. లేదా దానికి లొంగిపోవడమో, భయపడి పారిపోవడమో జరుగుతుంది"!

"నిజమే. అయితే సమాజం తప్పుల్ని నువ్వు దానికి ఎత్తి చూపడానికి ప్రయత్నించలేదు. అది పెట్టిన హింసలు భరించావు! అది తప్పు కాదూ? ఎదుటి మనిషి తప్పుల్ని ప్రతిసారీ ప్రతివిషయంలో క్షమించుకుంటూ పోవడం ఎంతవరకూ మంచిదంటావు?" అడిగింది సుధ!

"సమాజం లోపాల్ని నేను ఎత్తిచూపడానికి ప్రయత్నించినా, వాళ్ళకి ఎదురుతిరగడానికి ప్రయత్నించి ఉండినా ఒకవినోద్‌లో ఒకనాగరాజులో మార్పు రాకపోవడమేకాదు నన్ను తరిమి తరిమి కొట్టి చంపివుండేవాళ్ళు! సహనంతో కాస్తయినా సాధించగలిగాను నేను. నేను వాళ్ళ మీదకి తిరగబడటం అంటూ జరిగివుంటే నేను మూర్ఖత్వంలోనో, అమాయకత్వంలోనో ఉన్నట్టు లెక్క కాదూ? పాపం వీళ్ళు అజ్ఞానంలో వున్నారు అని నేనెలా గ్రహించగలిగేదాన్ని? అలా చేసివుండిన పక్షంలో నేనంటూ వుండేదాన్నికాదు! నాకంటూ ఓ అస్తిత్వం వుండేది కాదు! ఇప్పుడే కాకపోయినా మరి కొంతకాలానికయినా వీళ్ళల్లో కొందరైనా 'ఈ సీత' జీవితాన్ని గుర్తుంచుకుని కొన్ని అనుభవాలంటూ వచ్చాక అర్థంచేసుకోగలరన్న నమ్మకం నాకుంది" అన్నాను.

"సరే... కథని కొనసాగించు" అంది సుధ కదిలి స్టౌ దగ్గరికి వెళ్ళుతూ.

ఇంతలో "సీతమ్మా" అంటూ బయటి




నుండి నాగరాజు కంఠం!

బయటికొచ్చాను! అతడి చంకలో అయిదేళ్ళ పాపఉంది.

"ఇది మాపాపే! ఇవాళ దీని పుట్టినరోజమ్మా! అమ్మగారికి దణ్ణం పెట్టుతల్లీ" అన్నాడు.

""ఇదేమిటి" నమస్కరిస్తున్న పావని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాను! సుధ, అజిత్ వచ్చారు!

"అజ్జూ! పావకి స్వీట్ పెట్టమ్మా" చెప్పాను!

అజిత్ నవ్వుతూ పావని లోపలికి తీసుకెళ్ళాడు!

"అయిదేళ్ళు వచ్చాయమ్మా సీతమ్మకి! నువ్వే అక్షరాలు దిద్దబెట్టాలి మంచిరోజుచూసి" అన్నాడు.

నాగరాజు జీవితంలో స్థిరపడ్డాడు! పెళ్ళిచేసుకున్నాడు! కష్టపడి కాస్త పొలం సంపాదించుకున్నాడు! పాత జీవితానికి స్వస్తి చెప్పాడు! కూతురికి నా పేరు పెట్టుకున్నాడు! వారానికోసారి వచ్చి నన్ను పలకరించందే అతడికి తోచదు!

నాగరాజు భార్యకూడా నన్ను గౌరవించడంతో అతడితో నాకున్న సంబంధాన్ని గురించి వూళ్ళోవాళ్ళు మాట్లాడుకోవడం మానేశారు ఇప్పుడు! ఎటుతిరిగీ ఒక్క వినోద్ మాత్రమే ఇంకా నామీద ఆశలు పెట్టుకుని ఒంటరి జీవితాన్ని గడుపుతున్నాడు.

ఒక్కోసారి విధి శపించినట్టు తయారయిన అతని జీవితాన్ని తలచుకుంటే జాలి వేస్తుంది నాకు!

నాగరాజు కూతుర్ని తీసుకుని వెళ్ళిపోయాడు!

"అక్కా! రా... వంటకూడా అయిపోయింది! మిగతా కథ చెప్పు" అంది సుధ.

* * *

'ముందు జీవితాన్ని ఎలాగడపాలి'? అన్న సమస్య కళ్ళెదుట నిలిచింది!

అప్పడాలు వత్తుకుంటూ, విస్తళ్ళు కుట్టుకుంటూ ఎల్లకాలం గడపడం వీలపడదు! నాకు తోడు ఇంకో జీవి భూమ్మీదకి వచ్చాడు! అవసరాలూ, ఖర్చులూ పెరిగాయి! ఎలా?

తీవ్రంగా ఆలోచిస్తుండగా తట్టింది ఆ ఆలోచన! బొత్తిగా చదువురాని మొద్దునేంకాదు. యస్.యస్.సి పాసయ్యాను. ఈ వూళ్ళో అనలు స్కూలులేక పిల్లలు అవస్థలు పడుతున్నారు. శ్రీకాంత్ ఖాళీచేసి వెళ్ళిన స్థానాన్ని నేను స్వీకరిస్తే... ఇటు వూళ్ళోవాళ్ళ అవసరం, నాఅవసరం తీరిపోతాయి.

"పిచ్చి సీతమ్మా! నీదగ్గరికి వాళ్ళ పిల్లల్ని పంపుతారా చదువులకి? వాళ్ళ బిడ్డలు చెడిపోరూ?" వ్యంగ్యంగాఅంది వృద్ధురాలు.

"లేదవ్వా! పంపుతారు! అవసరం నాదేకాదు! వాళ్ళదికూడా! మొదట అంతా నవ్వుతారు! ఓ నలుగుర్ని ఒప్పించుకోగలిగితే చాలు! క్రమంగా వాళ్ళే వస్తారు. ఇంట్లో కూర్చుని చెప్పుకోవచ్చు" అన్నాను.

"సరేకానీ... అదీచూద్దాం" అంది.

గోపాలరావుగారు వచ్చారు. ఆయనకి విషయం చెప్పాను.!

"నీకాళ్ళమీద నువ్వు నిలబడి జీవించాలన్న నీ కోరికా తపనా నాకు అర్థమయ్యాయమ్మా! నీ ప్రయత్నం నువు చెయ్యి" అంటూ ప్రోత్సహించాడు.

ఇప్పుడు లోకం దృష్టిలో నేను ఆయన ఉంపుడుగత్తెని!

ఆయన దృష్టిలో నేనాయనకి బిడ్డలాంటిదాన్ని!

నా దృష్టిలో ఆయనొక మంచివ్యక్తి.

ఆయన లోకాన్ని పట్టించుకునే మనిషికాదు!

"బాబుకి పేరేం పెడతావమ్మా?" అడిగాడాయన.

"ఆ విషయం ఆలోచించలేదండీ" అన్నాను.

"అయితే బాబు అనే పిలుద్దాం! స్కూలుకి వెళ్ళేప్పుడు ఏదో పేరుపెడితే సరిపోతుంది! పేరులో ఏముంది పెన్నిధి! నీ పెంపకంలో వీడొక వజ్రపు తునకలా ప్రకాశిస్తాడు" అన్నాడాయన నమ్మకంగా.

నెలరోజుల తరువాత మళ్ళీ బావికి బయలుదేరాను!

"సిగ్గులేనిది మళ్ళీ బయలుదేరింది"



ఒకామె మొహాన్నే అంది!

"పూరుమ్మడి ఉంపుడుగత్తెకి భయం ఏముంటుంది? మొగుడిచాటు ఇల్లాళ్ళం మన కి భయంగాని" ఇంకొకామె అక్కసుగా అంది.

ఎంత అజ్ఞానంలో వున్నారు వీళ్ళు?

మొగుడిచాటున మొగుడి రక్షణలో వున్నా మని చెప్పుకుంటూనే బయట ప్రపంచంలోకి రావాలంటే భయం అని వాళ్ళే చెప్పుకుంటు న్నారు! అంటే... వీళ్ళ భర్తలు పనికిమాలిన దద్దమ్మలు అని వీళ్ళే చెప్పుకుంటున్నారని వీళ్ళకి గ్రహింపువుందా?

ఇలాంటివాళ్ళని చూస్తే నాకు జాలి, అభి మానం కాక కోపం ఎలా కలుగుతుంది.

బావి దగ్గర నన్ను చూసి అమ్మలక్కలు మూతీముక్కూ తిప్పుకుని వెళ్ళిపోయారు గబ గబా! చాలారోజుల తరువాత వొచ్చానేమో కాస్సేపు అక్కడే కూర్చోవాలనిపించింది నాకు! బావి గట్టున కూర్చున్నాను.

సాయంవేళ...

పైరగాలి హాయిగా ఉంది. అవ్వ ఇంట్లో ఉంది. కాస్సేపు కూర్చున్నా ఫరావాలేదు! బాబు ఏడుస్తాడన్న భయంలేదు! పైగా చిన్ని బొజ్జనిండా పాలిచ్చి వచ్చాను. చప్టామీద బావి కి ఆనుకుని కూర్చున్నాను. నా మనసులో ఏ ఆలోచనా లేదు! మనసు నిర్మలంగా వుంది! ఇదే నేను జీవితంలో పొందగలిగిన వరం!

అలా ఎంతసేపు కూర్చున్నానో నాకే గుర్తులే దు! కను చీకటి పడటం హఠాత్తుగా గుర్తించి అవ్వ కంగారుపడుతుందన్న విషయం గుర్తొ చ్చి ఇక లేద్దాం అనుకుంటూ వుండగా...

"సీతా" వెనకనుండి పిలుపు విని పించింది.

ఉలిక్కిపడి చూశాను.

మసక చీకట్లో సమీపంలో నుండి కనిపిస్తూ న్న ఆకారం... వినోద్!

"నీతో మాట్లాడాలి సీతా" అతడొచ్చి నాక్కా స్త దూరంగా కూర్చున్నాడు.

నేను పెదవి విప్పి ఏమీ అనలేదు. అతడివై పే చూస్తున్నాను.

పీక్కుపోయిన మొహంతో జ్వరానపడి లేచి నవాడిలా కనిపించాడు! అప్రయత్నంగా అడి గాను- "ఒంట్లోబాగాలేదా?"

వినోద్ నవ్వాడు.

ఆ నవ్వులో కళాకాంతులు లేవు.

ఇతడు నాగరాజులా నాయింటికిరాడు.

నాకు తెలును ఇతడు పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నాడని!

హఠాత్తుగా అడిగాడు- "సీతా నాగురించి నీకేం తెలును?" అని.

"నాకేమీ పెద్దగా తెలీదు వినోద్! నువ్వో ధనవంతుల కొడుకువని మాత్రమే తెలును" అన్నాను.

"అంతేనా... నేనొక వెధవనని, దుర్మార్గుడినని, రాక్షసుడినని తెలీదా?"

"జరిగిపోయిన విషయాన్ని గురించి తల చుకుని బాధపడటం ఎందుకూ?

గతాన్ని గురించి ఇప్పుడు నువ్వు పశ్చాత్తాప పడుతున్నావు. అది చాలదూ? నువ్వు ఒకవేళ నువ్వు అన్నట్టు దుర్మార్గుడివై వుండినా అది ఒకప్పటిమాట, ఇప్పుడు నువ్వు చాలా మంచి వాడివేకదా?" నేనీ మాటలు ఓదార్పుగా అనలే దు... మామూలుగా నా మనసులో వున్నమాట ఉన్నట్టు బయటికి చెప్పాను.

"నిజంగా అంటున్నావా సీతా?"

"అబద్ధాలు చెప్పడం నేను ఏనాడో మర్చిపో యాను వినోద్" మెల్లిగా నవ్వి అన్నాను.

"సీతా నువ్వు దేవతవి! కానీ, దేవతలా నిన్ను దూరంనుండి పూజించలేను, నా గుండె ల్లో గుడి కట్టుకుని పూజించుకోవాలని వుంది! ఆ అవకాశం నాకిస్తావా సీతా?" దీనంగా అడిగాడతడు.

అతడి ఉద్దేశం నాకు అర్థమైంది.

వెంటనే ఏంసమాధానం చెప్పాలో తోచలే దు.

"పుట్టుకతో నేను దుర్మార్గుడిని కాను సీ తా..."

"ఈ ప్రపంచంలో పుట్టు దుర్మార్గులెవరూ వుండరు"

"నన్ను చెప్పనీ సీతా... నా మనసు విప్పి చెప్పుకోనీ"




అతడి మానసిక స్థితిని నేను గ్రహించాను. ఇతడు నా శరీరంతో తన కోరిక తీర్చుకున్నాడు. ఈవిషయం తెలిసి వూరంతా నన్ను చెడిపోయింది అంది. నా భర్త నన్ను వదిలి వెళ్ళిపోయాడు.

అయితే ఇతణ్ని పూర్తిగా వదల్లేదు సమాజం! సూటీపోటీ మాటలంది.

"నువ్వు దుర్మార్గుడివి" అని డైరెక్టుగా కాకపోయినా ఇన్‌డైరెక్ట్‌గా అతణ్ని పొడిచింది.

ఇలాంటి పరిస్థితిని అతనెప్పుడూ ఎదుర్కొని ఉండడు. ఇంటాబయటా అంతా అతణ్ని నిరసించారు. అసహ్యించుకున్నారు. అంతకు ముందెప్పుడూ ఇలా జరగలేదు.

'అదృష్టవంతుడూ, జల్సారాయుడూ' వగైరా బిరుదులతో అతణ్ని ఆకాశానికి ఎత్తినవాళ్ళు ఈ సంఘటనతో ఇతణ్ని 'ఛీ' కొట్టారు.

'నీ మూలంగా ఓ సంసారం కూలిపోయింది' అన్న విషయం అతడి మనసుకి నాటేలా చేశారు.

అతడూ మనిషే! ఈ నిందల్నీ ఈ తిట్లనీ, శాపనార్థాలనీ అనాదరణనీ, తిరస్కారాలనీ భరించలేకపోయాడు, తట్టుకోలేకపోయాడు, పైగా ఇంత హింసకీ అన్యాయానికి గురయి కూడా ఇతణ్ని నేను తిట్టలేదు, శపించలేదు.

అతణ్నొక మామూలు మనిషిగా గుర్తించడం, మళ్ళీ రెండుమూడుసార్లు అతడి మూలంగా నేను తీవ్రమైన అవమానాలకి గురయినా నోరువిప్పి అతణ్ని ఒక్కమాట అనకపోవటం... ఇవన్నీ అతడిలో పరివర్తనని కలిగించాయి.

నాగరాజు మొరటువ్యక్తి. పెద్దగా ఆలోచనా జ్ఞానం కలిగినవాడుకాదు. తన తప్పుని గుర్తించినవాడు కాబట్టి వెంటనే నాకాళ్ళు పట్టుకోగలిగాడు.

ఇతడు ఎంతయినా దారితప్పిన విద్యావంతుడు! ఇతడు పుట్టిపెరిగిన వాతావరణం వేరు! అతడిలా నన్ను వేడుకోలేకపోయాడు, ధైర్యంచేసి నా దగ్గరికి రాలేకపోయాడు. ఎక్కువగా లోకానికి భయపడుతున్నాడు. నన్ను బాధ పెడ్తుందని అతడిలోని మార్పుని ఎవ్వరూ గుర్తించలేదు.

అతణ్నెవరూ నాగరాజులా 'మారాడు' అనడంలేదు.

అతడు పశ్చాత్తాపంతో దహించుకుపోయి మనిషి సగం అయ్యాడు. ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి ఇప్పుడిలా నా ఎదుటికి రాగలిగాడు. అతడు నన్ను తన జీవితంలోకి రమ్మని అడుగుతున్నాడు.

తనమూలంగా అస్తవ్యస్తం అయి ఆధారం కోల్పోయిందనుకుంటూన్న నా జీవనలతకి తను ఆధారమై తన పాపాన్ని పరిహారం చేసుకోవాలనుకుంటున్నాడు. చాలా నిజాయితీగా ఈ నిర్ణయానికి వచ్చాడితను.

ఒకర్ని లెక్కచేసే తత్వంకాదు అతడిది. కాబట్టి ఎవరికీ ఈ విషయంలో భయపడడు.

వినోద్ చెబుతున్నాడు- "ఉన్నత వంశంలో గొప్ప ఇంట్లో పుట్టిన నేను జులాయిగా ఎందుకు తయారయ్యానో తెలుసాసీతా? నా తల్లిదండ్రులకి లేకలేక పుట్టిన ఏకైక సంతానాన్ని అయినందువల్ల చేసిన అతిగారాబంతో, అవసరానికి మించి అందించిన డబ్బు మూలంగా, అసలీ వూళ్ళో స్కూలు లేకపోవడానికి కారణం కూడా నేనే, చిన్నప్పుడు స్కూలుకి వెళ్ళడానికి మొండికేసేవాణ్ని...

అప్పుడిక్కడ స్కూలు ఉండేది. స్కూలు వున్నంతకాలం నాకు బాధలు తప్పవని అర్థమైంది. వెళ్ళనంటే ఇంట్లో ఒప్పుకోరు. టీచర్‌ని కొట్టేవాణ్ని తిట్టేవాణ్ని వేధించేవాణ్ని. మానాన్న నన్ను సమర్థించేవాడు. నా బాధపడలేక ఇద్దరు ముగ్గురు టీచర్లు ట్రాన్స్‌ఫర్ తెప్పించుకుని వెళ్ళిపోయారు. అయినా స్కూలు ఎత్తేయలేదు. ఒకరి తర్వాత ఒకరుగా టీచర్లు రావటమూ మానలేదు...

చివరికి నేను విసిగిపోయి స్కూలుతాలూకు పాకని తగలపెట్టేశాను. అంతటితో ఈ వూళ్ళో నాచదువు సాగదన్న నిర్ణయానికి వచ్చి నాన్న నన్ను సిటీకి తరలించాడు. ఆయన మళ్ళీ పట్టించుకోకపోవడంతో ఈ వూరికి స్కూలు అనేది లేకుండాపోయింది. ఈ వూరికో చిన్నసాకర్యమైనా ఆయన దయతో రావాల్సిందే.

ఇలా అతిగారాబంతో ఆలనాపాలనా కరువై నేనిలా తయారయ్యాను. కాలేజీ జీవితంలో

కూడా నాడబ్బు నన్నొక హీరోలా నిలబెట్టింది. నా స్నేహితులు నన్ను తాగుబోతుని చేశారు. పూర్తిగా చెడిపోయాను. తాగుబోతునీ, తిరుగుబోతునీ అయ్యాను.

నేను పూర్తిగా చెడిపొయ్యానని తెలుసుకుని తెచ్చి ఇక్కడ పడేశాడు నాన్న. ఈవూరుకూడా నన్నొక యువరాజానంది. ఇక్కడా మందుకీ, మగువకీ, కాకారాయుళ్ళకీ, కొదువలేదు. నాగరాజు నాకు ప్రత్యర్థి అయ్యాడు. ఇక్కడా నాప్రభ వెలిగిపోయింది. అలాంటి సందర్భంలోనే నువ్వు నాకళ్ళబడ్డావు...

నీ అందం నన్ను పిచ్చివాణ్ణి చేసింది. నన్ను నువ్వు గమనిస్తున్నావని నాకు తెలుసు. నీ భర్తకి చెప్పుకుంటావనుకున్నాను. రోజులుగడుస్తున్నా అలాంటిదేం జరగలేదు. నీభర్త నాతో ఎప్పుడైనా కలిసినా మర్యాదగానే మాట్లాడేవాడు. అది నాకుభయపడి, నా తండ్రి అధికారాలకి భయపడి అనుకున్నాను...

అయినా 'మర్యాదస్తురాలైన ఆడది' అనే విషయం అంత తొందరగా నేను నీమీదకి ఉరకకుండా కొన్త జంకు కలిగించింది. కానీ ఆరోజు...ఆదురదృష్టక్షణాల్లో నేను తాగిన మైకంలో వుండగా ఒంటరిగా నాకంటబడ్డ నిన్ను వదలలేకపొయ్యాను. వశువునయ్యాను. నీ జీవితం నాశనంచేశాను..." అతడి తల భూమిలోకి కుంగిపోయింది.

అతడి కంఠం నాకుమాత్రమే వినిపించేంత మెల్లిగా వుంది. ఆ కంఠంలో దిగులూ, దుఃఖం, వశ్చాత్తాపం, తనపట్ల తనకి అసహ్యం తనని అర్థంచేసుకోమన్న అర్థింపూ, అన్నీ ఉన్నాయి.

నేను వింటున్నాను. పాపం, నాగరాజులా పైకి పెద్దగా ఏడ్చి హృదయభారం దింపుకోలేని దురదృష్టవంతుడు.

"నేను బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను సీతా! మనస్పూర్తిగా చెబుతున్నాను. నా తల్లిదండ్రుల్ని ఒప్పించగలను. నీబిడ్డని నాబిడ్డగా చూసుకోగలను. దైవసాక్షిగా చెబుతున్నాను. నన్ను నమ్ము సీతా! నన్ను క్షమించి దయతలచి నాకోరిక మన్నించి, నాపాపాన్ని కడుక్కొనేందుకు అవకాశం ఇవ్వు..." అతడికళ్ళిప్పుడు చెమర్చాయి.

అతడెందుకలా తయారయ్యాడో అతడి మాటలే విపులంగా చెప్పాయి. అందుకతడిప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడు.

నేను నోరువిప్పాను- "నీమీద నాకేం కోపంలేదు వినోద్! నీమీదేకాదు, శ్రీకాంత్‌మీద, నాగరాజుమీద, ఈ వూళ్ళో ఎవరిమీదా నాకు కోపంలేదు..."

అతడు అడ్డువచ్చాడు- "నాకు తెలుసు- నువ్వు దేవతవు" మెరిసేకళ్ళతో అన్నాడు.

"కాదు, మీలాంటి మనిషినే నాకు మళ్ళీ పెళ్ళిచేసుకోవాలన్న కోరికలేదు. నిన్ను బాధపెడితే క్షమించు. నాజీవితం అన్యాయం అయిందని నేను అనుకోవడంలేదు. ఊరంతా అలా అనుకున్నా. అందుకు బాధ్యుడివి నువ్వు మాత్రం కాదని నేను నమ్ముతున్నాను. అది తెలుసుకుంటే నీకు బాధవుండదు. అశాంతి వుండదు. నీపట్ల ఏకాన్త కోపం, అయిష్టంవున్నా నీతో నేనిలా మాట్లాడను. నన్ను అర్థంచేసుకో, నా బిడ్డతో నన్నిలా బతకనియ్యి. మళ్ళీ భర్త సంసారంఅంటూ ఒక జంజాటం తగిలించుకోనటం నాకిష్టంలేదు. నిశ్చింతగా సుఖంగా బతుకుతున్నాను- ఈ జన్మకిది చాలు" స్పష్టంగా చెప్పాను నెమ్మదిగానే.

"నువ్వు సుఖంగా బతుకుతున్నావా?" వెలవెలబోతున్న మొహంతో అడిగాడతడు.

"అవును...మీకు అర్థంకాదు. చాలా సుఖంగా బతుకుతున్నాను. నిన్నొక మంచి స్నేహితుడుగా ఒకప్పుడు నాకు ఉపకారం చేసినవాడిగా ఎప్పుడూ గుర్తుంచుకుంటాను. ఇంతకంటే నేనేం చెప్పలేను" అంటూ లేచాను.

వినోద్ నోటమాట రానివాడిలా అయ్యాడు.

నేను నీళ్ళు తోడుకుని "వస్తాను" అంటూ బయలుదేరాను.

"ఓహెూ! బావిదగ్గర కథ సాగుతూనే వుందన్నమాట..." ఎవరిదో మొదట కంఠం!

నేను పట్టించుకోలేదు. ఇంతక్రితం వినోద్‌తో నేను మాట్లాడిన మాటల గురించి ఇప్పుడు ఆలోచిస్తున్నాను.

"ఒకప్పుడు నాకు ఉపకారం చేసినవాడిగా




ఎప్పుడూ నిన్ను గుర్తుంచుకుంటాను" అన్నా ను.

ఏ ఉద్దేశంతో అన్నానామాట?

నడివీధిలో పురుడుపోసుకున్నవాకు నన్ను దయగా ఇంటికి చేర్చిన సంఘటనని దృష్టిలో పెట్టుకుని అన్నానా...

లేక అంతక్రితం ఈ బావి దగ్గర జరిగిన ఆ సంఘటనని గురించి అన్నానా?

ఆనాడతడలా చెయ్యకపోయి వుంటే నేను భర్తచాటు భార్యలా అజ్ఞానంలో అలా బతుకుతూ వుండేదాన్ని. ఆ సంఘటన జరగబట్టే ఇన్ని అనుభవాలు ఎదురుగాబట్టే నాలో చైతన్యం కలిగి కొత్తసీతనయ్యాను అన్న ఉద్దేశంతో అన్నానా??

నాకే స్పష్టంగా అర్థంకావడంలేదు.

'నేనామాట వ్యంగ్యంగా అన్నాననుకుని అతడు బాధపడడుకదా'? అనిపించిందో క్షణం!

'లేదు... వినోద్ తెలివైనవాడు! అర్థంచేసుకోగలడు' అనుకున్నాను.

వినోద్ అంతటితో వదలలేదు! అవ్వచేత నాకు చెప్పించాడు.

"సీతమ్మా... అతడి మాట తల్లిదండ్రులు కాదనరు! అతిగారాబంవల్ల అలా తయ్యారయ్యాడేగానీ దుర్మార్గుడు కాడమ్మా! అతడే నీ మెడలో మూడుముళ్ళు వేస్తే ఈ జనం నోళ్ళు మూతలు పడతాయి. నీమీద మంచిమనసుతో ఉన్నాడు. వయసుకు వయసూ- మనసుకి మనసూ జతకుదిరిపోతాయి. కావాలంటే ఈవూరు వదిలివెళ్ళిపోవచ్చు" అని చెప్పబోయింది.

"వద్దు అవ్వా! నువ్వు ఈ విషయంలో నాకేం చెప్పవద్దు. అతడంటే నాకు కోపంలేదు. అందరిలా అతణ్నీ అభిమానిస్తున్నాను. నాకు మళ్ళీ పెళ్ళి, భర్త అవసరంలేదు. జనం నోళ్ళు మూతలుపడతాయంటావా... అలా జరగకపోయినంత మాత్రాన నాకు వచ్చే నష్టం ఏముంది చెప్పు? అమాయకులు ఏదో అనుకుంటారు. అవన్నీ ఘనం పట్టించుకుని బాధపడితే ఎలా? వయసు విషయం అంటావా, మానసికంగా నేను వృద్ధురాలినైపోయాను తెలుసా? ఈవూరు వదిలిపోవడమా... నాకిష్టంలేదు. ఇది చిన్న వూరే కావచ్చు. నాకు చాలా పెద్ద పాఠాల్ని జీవిత సత్యాలని విపులంగా చెప్పింది. ఎంతో తప్పనిసరి పరిస్థితి వస్తేగానీ నేనీ వూరు వదలను" ఖచ్చితంగా చెప్పాను.

అవ్వ చెప్పిచెప్పి విసిగిపోయింది. వినోద్ గోపాలరావుగారి చేత చెప్పించాడు. ఆయనకీ అదే సమాధానం ఇచ్చాను. వినోద్ మళ్ళీమళ్ళీ నన్ను కలిసి బతిమాలి భంగపడ్డాడు.

చివరికి తన తల్లిదండ్రుల్నే నా ఇంటికి పంపాడు. ఒప్పుకోమని దాదాపు వేడుకున్నారు వాళ్ళు. వాళ్ళ మాటల్ని బట్టే అతడి భవిష్యత్తుని గురించి వాళ్ళెంత ఆందోళన పడుతున్నారో నాకు అర్థమైంది.

లేకపోతే ఈ దేశపు సగటు మనుషులు, పల్లెటూరివాళ్ళు నాలాంటి ఓ స్త్రీని ఓ బిడ్డ తల్లిని కోడలిగా స్వీకరించడానికి సిద్ధపడగలరా?

అన్నివిధాలా ప్రయత్నించి విఫలమయ్యారు వినోద్. ఈ విషయం ఊళ్ళో తెలిసింది.

"ఓయబ్బో! ఆవిడెలా ఒప్పుకుంటుంది? నాలుగు కూరలూ, నవకాయ పిండి వంటలూ తినమరిగిన మనిషికి ఒక్క కూరా భోజనం సహిస్తుందా? మొదట నాగరాజూ, మునలి గోపాలరావు, పడుచు వినోదూ... ఇలా రోజుకొక రుచికావాలి. ఒక్కడికి అణిగిమణికి ఎలాపడి వుంటుంది? ఈవిడ అసలు రూపం బయటపడకముందే ఆ మాస్టారు బయటపడ్డాడు పాపం! అదృష్టవంతుడు"

ఈ వ్యాఖ్యానాలకి నవ్వొచ్చింది నాకు.

నిజంగా వీళ్ళు అమాయకులుగాకపోతే 'అంతమంచి రక్షణనీ, ఆస్తిని, అండనీ ఎందుకు వద్దంటుందీ'? అని ఆలోచించరా వీళ్ళు?

హఠాత్తుగా ఓ ప్రశ్న ఉదయించింది నాలో...

నా శరీరం అపవిత్రమైపోయిందనీ తన బిడ్డని వదులుకుని వెళ్ళిన శ్రీకాంత్...

తనమూలంగా నా జీవితం నాశనమైందన్న బాధతో ఎవరి బిడ్డనో తన బిడ్డగా, నన్ను

భార్యగా స్వీకరించడానికి సిద్ధపడుతున్న వినోద్...

వీళ్ళిద్దరిలో ఎవరు గొప్పవాళ్ళు?

హెచ్చూ... తగ్గూ మార్కులు వేసుకుంటూ పోతే వినోద్ మంచివాడనిపించవచ్చు. అయితే వినోద్ స్థానంలో శ్రీకాంత్ వున్నా శ్రీకాంత్ స్థానంలో వినోద్ వున్నా ఒకేలా ప్రవర్తించి వుండేవాళ్ళు.

అప్పుడు ఎవరు గొప్పని? ఎవరు తక్కువ? అన్న ప్రశ్నలే వుండవు.

అందరూ సమానమే! అందుకే వీళ్ళందర్నీ నేను అభిమానించగలను. ఎవర్నీ ద్వేషించలేకపోతున్నాను.

★ ★ ★

నా వూహ .నిజమైంది.

అవ్వ అనుమానించినట్టు పిల్లలకి నేను చదువు చెబుతానంటే మొదట వూరంతా నవ్వింది.

"ఆ చెడిపోయిన చేటు మొహం దాని దగ్గరికి మా బిడ్డల్ని పంపుతామా?" అంటూ గుండెల మీద చేతులుంచుకుందట.

అయినా, అవ్వ గోపాలరావుగారూ కలిసి మొదట ఓ నలుగురు పిల్లలు వచ్చేలా చేశారు. ఆ నలుగురూ వారం తిరిగేసరికి పదిమంది అయ్యారు. నెల తిరిగేసరికి పాతికమంది అయ్యారు. ఈ పాతికమందే శ్రీకాంత్ మధ్యలో వదిలివెళ్ళిపోవడంతో మర్చిపోయిన చదువుని చాలా సులభంగా గుర్తు తెచ్చుకుని కొనసాగించడంతో ఊళ్ళో అంతా ఎవరికివారే ఆలోచనలో పడ్డారు.

ఫలితంగా దాదాపు అందరూ వాళ్ళ పిల్లల్ని నా దగ్గరికి పంపడం ప్రారంభించారు. ఉదయం ఎనిమిదినుండి పన్నెండుదాకా కొందరికీ, రెండు నుండి నాలుగు దాకా కొందరి



కీ చెప్పసాగాను. ఈ లోపల గోపాలరావుగారి ప్రోత్సాహంతో ప్రయివేటుగా చదువు కొనసాగించాను.

రెండేళ్ళు గిర్రున తిరిగాయి. నేను ఇంటర్ మీడియట్ పూర్తిచేశాను. గోపాలరావుగారి పలుకుబడితో అదే వూళ్ళో గవర్నమెంటు టీచర్ని అయ్యాను. మధ్యలో ఓ ఆరునెలలపాటు ట్రయినింగ్ వచ్చింది. నా అదృష్టవశాత్తు ట్రయినింగ్ సెంటర్ పక్క టౌన్‌లోనే. అవ్వ బాబుని చూసుకునేది.

ఎలాగైతేనేం నా జీవితానికి ఒక ఆధారం ఏర్పడింది. ఇప్పుడు వూరంతటికీ నాతో అవసరం ఏర్పడింది. మనిషి అవకాశవాది. నా అవసరం వాళ్ళకి వుంది కాబట్టి నాకు పైపై గౌరవాలు ఇవ్వడం ప్రారంభించారు.

వాళ్ళు అసహ్యించుకున్నాడు నేను కృంగిపోలేదు. ఈవాడు గౌరవిస్తున్నారనీ పొంగిపోలేదు. నా జీవితాన్ని నేను సాగిస్తూనే వున్నాను.

ఈ రెండుమూడేళ్ళ నా జీవితంలో అయితే మార్పు రాలేదుగానీ వినోద్ జీవితంలో ఒకే వూహించని మార్పు వచ్చి మలుపు తిరిగింది. అతడి తల్లిదండ్రులు బతిమాలి, భంగపడి, ప్రాథేయపడి అతడికి పెళ్ళిచేశారు. మొదట్లో అతడికి వచ్చిన సంబంధాలన్నీ నా విషయం తెలిసి తిరిగిపొయ్యేవి.

గతకాలపు సంఘటననే అయితే ఎవరూ పట్టించుకోరు. ఇంకా నాతో అతడి సంబంధం కొనసాగుతోందన్న నమ్మకంతో అతడికి పిల్లనివ్వడానికి జంకారు. చివరికి ఈ విషయంలో వూరు ఓడిపోయింది. వినోద్ తల్లిదండ్రులు విజయం సాధించారు. అతడికి పెళ్ళయింది. అందుకు అందరికంటే ఎక్కువగా సంతోషించింది నేను.

ఇదేరోజుల్లో పరిచయం అయింది నాకు సుధ. పక్క వూళ్ళో అప్పర్ ప్రైమరీ స్కూల్లో టీచర్‌గా వచ్చిన సుధ ఈ వూళ్ళో వున్న బంధువుల ఇంట్లో వుంటూ రోజూ స్కూలుకి వెళ్ళి వస్తూండేది. మొదట మంచినీళ్ళ బావి దగ్గర పరిచయం అయింది నాకు వూళ్ళోకి దారి చూపించమని అడుగుతూ.

మంచినీళ్ళ బావితో రోజురోజుకీ నా అనుబంధం పెనవేసుకుపోతోంది తప్ప తరిగే ప్రశ్నే లేదు. సుధ పరిచయం...నాకు కొండంత అండగా వున్న అవ్వ విష జ్వరంతో పోవడం జరిగింది. జీవితాన్ని గురించి ఎంత విశ్లేషణాత్మక ధోరణిలో ఆలోచించడం అలవరచుకున్నా అవ్వ మరణం పెద్ద షాక్ నాకు.

దిక్కులేని నాకు దిక్కుగా నిలబడింది. నాకొక రక్షణ కవచంలా నా సుఖం కోసం పాకులాడింది. అంత జ్వరంలోనూ నేనూ, నా బిడ్డ ఈలోకంలో ఎలా బతుకుతామో....అని దిగులు పడుతూనే మరణించింది.

అవ్వ చిత్రమైన కోరిక....తన చితికి బాబు చేతగాదు, నాచేత నిప్పు పెట్టించుకోవాలని. వూరంతా మరోసారి ముక్కుమీద వేలేసుకుంది.

సుధ స్నేహంతో అవ్వలేని లోటు మర్చిపోవడానికి ప్రయత్నించాను. సుధే పెట్టింది బాబుకి 'అజిత్' అన్న పేరుని.



"చెప్పీచెప్పీ నాకు అలుపొచ్చింది. తరువాత కథ నువ్వు చెప్పు సుధా. నేనూ, అజ్జూ వింటాం" అన్నాను.

"కాదు... నువ్వు చెబితే నే వినడానికి బావుంటుంది- కాదురా అజ్జూ?" బాబుని అడిగింది.

"అమ్మకి అలుపొచ్చిందిగా ఆంటీ- నువ్వే చెప్పు" అజిత్ నా ఒళ్ళో దూరి నవ్వాడు.

"ఓరి భడవా! ఎప్పుడూ ఎంత దగ్గరికి తీసినా ముద్దు చేసినా నువ్వు అమ్మ పార్టీనే" బుంగమూతి పెట్టింది సుధ అలకగా.

"నేను అమ్మ పార్టీ కాదు" అన్నాడు వాడు.

"మరి?" కోపంగా అడిగింది.

"అందరి పార్టీ" అన్నాడు.

సుధ వాణ్ని మళ్ళీ ముద్దు పెట్టుకుంది.

"సుధా! నీ ముద్దులతో వాడి బుగ్గలు కరిగి పోతున్నాయే తల్లీ" అన్నాను.

"అవునమ్మా... నీ కొడుకు చక్కెర బెల్లం" వెక్కిరించింది సుధ.

"కాదు- కలకండ" కిలకిలా నవ్వాడు వాడు.

మళ్లీ ముద్దు పెట్టుకోబోయింది సుధ- "ఏదీ, రుచి చూడనీమ్మా"

నా ఒళ్ళో మొహం దాచేసుకున్నాడు.

"కథలూ, కబుర్లూ తర్వాత- భోజనాలకి వదండి ముందు" అన్నాను కదులుతూ. కబుర్లలో సుధా అజిత్‌ల అల్లర్లతో, కథలో మునిగి సుధ మాడ్చిన వంకాయ కూరతో భోజనం అయిందనిపించాం. ఇంతలో గోపాలరావుగారు వచ్చారు.

"తాతయ్యా" అజిత్ ఆయన దగ్గరికి ఉరికాడు.

వాళ్ళనలా వదిలేసి సుధా, నేనూ లోపలికివెళ్ళిపోయాం. గోపాలరావుగారు వూళ్ళోని ఇల్లూ, పొలాలు అమ్మేసుకుని ఏదో ఆశ్రమానికి వెళ్ళిపోయే ప్రయత్నంలో వున్నారు. చాలావరకూ ఆస్తిపాస్తుల్ని బంధువులకి పంచేశారు. అజిత్ పేరున కొన్త ఆస్తి పెడతానన్నాడాయన. నేను ససేమిరా ఒప్పుకోలేదు.

"అవసరంలేదండీ... శ్రీకాంత్ బ్యాంక్‌లో నా పేరు మీద వుంచివెళ్ళిన పాతికవేలూ అలా వడ్డీలతో పెరిగిపోతూనే వుంది. నేనింతవరకూ దాన్ని ముట్టుకోలేదు. మీ దయవలన నాకింత ఆధారం అంటూ ఏర్పడింది. దానితో వాణ్ని ప్రయోజకుణ్ని చెయ్యగలనన్న నమ్మకం నాకుంది- బలవంత పెట్టకండి" చాలా సున్నితంగా తిరస్కరించాను.

నా గురించి బాగా తెలిసిన మనిషికాబట్టి ఆయన ఇక ఏమీ మాట్లాడలేకపోయాడు. అసలీ తొమ్మిదేళ్ళల్లో నేను ఈ వూళ్ళో నాకంటూ ఓ సొంత ఇల్లుకూడా ఏర్పాటు చేసుకున్నాను. అందరూ అది వినోద్ కట్టించాడనీ, గోపాలరావుగారు కట్టించి ఇచ్చాడనీ అన్నారు కూడా.

ఇప్పుడు ఆశ్రమానికి వెళ్ళడానికి సిద్ధంగా వున్న గోపాలరావుగారికి ఒకటే బాధ... అజిత్‌ని చూడకుండా రెండురోజులు వుండలేడాయన. జీవిత చరమాంకంలోకి ప్రవేశించాడు. 'నా' అంటూ చెప్పుకోదగిన ఆత్మీయులులేరు.

చివరిరోజులు దైవసాన్నిధ్యంలో ఆధ్యాత్మిక చింతనతో గడపాలన్న తపనతో బయలుదేరుతున్నాడు. ఆయన వెళితే అజిత్ కూడా దిగులు పెట్టుకుంటాడని నాకు తెలుసు. అయినా తప్పదుగదా ఎవరిజీవితాలు ఎలా సాగిపోవాలో అలా సాగిపోతాయి. అలా ముగిసిపోతాయి. కాకపోతే మధ్యలో అనేక మలుపులు వుంటాయి- అంతే.

"పాపం వినోద్ జీవితమే ఎటూగాకుండాపోయింది" అంది సుధ.

అవును... నిజమే! పెళ్ళయిన రెండేళ్ళలో అతడి భార్యకి రెండు కాన్పులు వచ్చాయి. తొలిబిడ్డ అవిటిబిడ్డ. మలికాన్పులో అతడి భార్యా బిడ్డ కూడా పోతే కొద్దినెలల తేడాతో అవిటి బిడ్డ కూడా పోయింది. పెళ్ళప్పుడు అత్తగారి షరతుప్రకారం హైదరాబాదులో కాపురం పెట్టినవాడల్లా తిరిగి వచ్చేశాడు ఈ వూరికి.

నన్ను 'చెడిపోయింది' అన్నలోకమే అతణ్ని "చేసిన పాపం వూరకపోతుందా? అనుభవిస్తున్నాడు. వచ్చని కాపురాన్ని నిలువునా కూల్చి ఓ ఆడదానికి మొగుడి అండా, ఓ బిడ్డకి తండ్రి నీడా లేకుండా చేశాడు" అంది.

అప్పుడప్పుడు అజిత్‌ని వెంట పెట్టుకువెళ్ళి కాస్సేపు వాడితో గడిపి తీసుకొచ్చి వదిలివెళతాడు. అజిత్‌కి వయసుతోపాటు అన్నివిషయాలూ తెలుస్తూవచ్చాయిగాబట్టి వినోద్‌పట్ల ఒక విధమైన జాలి కొన్త అభిమానం కూడా కలిగాయేమో.

ఇంతక్రితం నా ఇంటికి రావడానికి సాహసించని వినోద్ ఇప్పుడు అజిత్ స్నేహంతో రాగలుగుతున్నాడు.

"ముసలాడు వెళ్ళిపోయే సమయానికి పడచువాడు తిరిగివచ్చాడు. పిల్లాడిని కూడా బాగా మాలిమి చేస్తోంది అతడికి" అను

కుంటున్నారు అంతా అని సుధ మండిపడు తూ చెప్పింది.

"అలా అనుకోవడం వాళ్ళ అలవాటు, బల హీనత, అనుకోనీ సుధా" అన్నాను నేను.

"అక్కా... అతను బాగా నలిగిపోయాడు. జీవితంతో అలిసిపోయాడు. కాస్త సేదతీర్చరా దూ" హఠాత్తుగా అంది సుధ.

"అతడిలాంటివాళ్ళు ఈ విశాలప్ర పంచంలో ఎందరో సుధా- ఈ సీత ఎందరి సేద దీర్చగలదు"

సుధ సమాధానం ఏమీ చెప్పలేకపోయింది.

గోపాలరావుగారు అజిత్ చెయ్యిపట్టుకుని లోపలికివచ్చారు.

"సీతా నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడా లమ్మా?" అన్నాడు వస్తూనే.

"చెప్పండి" ఆయనకి కుర్చీ చూపిస్తూ అన్నాను.

"శ్రీకాంత్ వూళ్ళోకి వచ్చాడు తెలుసా?" అడిగాడు.

"తెలుసు. నిన్న సాయంత్రం నీళ్ళకి వెళ్ళిన ప్పుడు కలిసి పలకరించాడు" చెప్పాను.

ఆయన ఆశ్చర్యంగా చూశాడు. తరువాత మౌనం వహించాడు. ఆలోచిస్తూన్నట్టుండిపో యాడు.

తరువాత తల అడ్డంగా వూపుతూ- "ఊ హూఁ... నేను చెప్పలేను. నేననలు ఇందులో కల్పించుకోకూడదు. నాకనలు ఇష్టంలేదు కూడా. చెప్పే అర్హత మాకెవరికీ లేదు" అంటూ లేచి- "బాబూ! ఇంటికి వెళదామా" అడిగాడు బాబుని.

"వెళదాం తాతయ్యా" ఉత్సాహంగా అన్నా డు అజిత్.

వాడితో అష్టాచెమ్మా దగ్గర్నుండి గు ర్రం ఆటదాకా ఆడతాడాయన. ఆయన వాడికి ఒక మంచి స్నేహితుడు. వాళ్ళు వెళ్ళిపోయాక మేం ఇద్దరం మొహమొహాలు చూసుకున్నాం.

"శ్రీకాంత్ గురించి ఏదో చెప్పబోయి ఆగిపో యాడాయన" అంది సుధ.

"అవును" అన్నాను.

"అయినా అతడినిగురించి చెప్పేదే ముంది? లక్షణంగా బతుకుతున్నాడు. జీవితా న్ని అనుభవిస్తున్నాడు. నీలాగ ఏదో జ్ఞానో దయం అయిందంటూ మడిగట్టుకు కూర్చోలే దు. భార్య చాలా అందంగా వుంటుందట. అతడి మామగారు ఈ వూళ్ళో పొలాలు కొన్నా డట. వాటి విషయం ఏదో చూసుకోవడానికి వచ్చాడు" అంది సుధ కాస్త నిష్ఠూరంగా.

"కాస్సేపు పడుకుంటాను సుధా! కాస్త తలనొ ప్పిగా వుంది" అన్నాను.

"కాఫీ కలపనా? టాబ్లెట్ వేసు కుంటావా?" ఆదుర్దాగా అంది.

"అంత పెద్ద నొప్పేంకాదులే! రాత్రి నిద్రలే దుకదూ! అలసట. అంతే! నువ్వు ఇంటిదాకా వెళ్ళిరారాదూ?" అన్నాను.

"వెళ్ళి కనబడి వస్తాను" అంటూ వెళ్ళింది. సుధ బంధువుల ఇంట్లో వుంటుంది.

తలుపులన్నీ వేసుకుని ఫాన్ పెట్టుకుని పడుకున్నాను. చాలా సులభంగా నిద్ర వచ్చింది నాకు. మనసుని, శరీరాన్ని మనిషి తన కంట్రోలు తప్పనివ్వనప్పుడు ఏ క్షణంలో కావాలంటే ఆ క్షణంలో నిద్ర తెప్పించుకోవ చ్చు. ఆకలిదప్పుల్ని కూడా కొంతవరకూ అదు పులో పెట్టుకోవచ్చు.

ఎలాంటి మానసికమైన కలతలు లేని నన్ను ఏ క్షణంలోకావాలంటే ఆ క్షణంలో కరుణించగలదు నిద్ర!

★ ★ ★

"అజిత్ ఈ రాత్రికి తనదగ్గరే వుంటాడు- ఇంటికి రాడు" అని చెప్పి పంపారు గోపాలరా వుగారు.

అది నాకూ, ఆయనకీ అలవాటే. నా దగ్గరు న్నంత నిశ్చింతగానూ ఆయన దగ్గర వుండగ లడువాడు. సుధ అయిదుగంటలప్పుడు వచ్చింది.

"ఈ రాత్రికి ఇక్కడే వుంటానక్కా" అంటూ.

నవ్వొచ్చింది నాకు. నెలలో ఇరవై రోజులు నా దగ్గరే గడుపుతుంది. ఏరోజుకారోజు "ఈ రాత్రికి ఇక్కడే వుంటానక్కా" అంటుంది చిన్న పిల్లలా.

"ఎందుకమ్మా నవ్వుతావు?"

"ఆర్మీలో పనిచేస్తున్న మీ బావగారు ము




హూర్తాలు పెట్టించమని పోరుతున్నాడని చెబుతున్నావే... అప్పుడు ఈ అక్కని విడిచి ఎలా వెళతావూ?'' అడిగాను.

బుంగమూతి పెట్టబోయి ఆగిపోయింది సుధ. దిగులుగా చూసింది.

''అదేనక్కా నా దిగులు! నా తల్లిదండ్రుల్ని తోబుట్టువుల్ని వదిలి దూరంగా వుండటానికి ఈ అయిదారేళ్ళుగా అలవాటుపడిపోయాను. బావ ఉద్యోగం వదిలెయ్యమంటాడు. వదలకా తప్పదు. నాకోసం ఇన్నేళ్ళు ఆగిన బంగారంలాంటి మనిషికోసం ఈ చిన్నత్యాగం చెయ్యలేనా! నా దిగులంతా నీకూ, అజ్జూకి దూరంగా వెళ్ళాల్సివస్తుందనే'' అంది.

''జీవితం అనేది ఒక పెద్ద ప్రయాణం సుధా! ఆ ప్రయాణంలో ఇదొక మజిలీ. కలిశాం- విడిపోక తప్పదు'' ధైర్యం చెబుతున్నట్టన్నాను.

''నీ స్థాయికి నేను ఎదగలేదు ఇంకా. అంత సులభంగా ఎలా అనుకోగలను?'' సుధ కంఠం జీరబోయింది.

నా మనసులోనూ దిగులుగా వుంటుంది ఈ విషయం తలచుకుంటే. కాని పైకి ప్రకటించను.

సుధ తండ్రిది చాలా పెద్దకుటుంబం. నలుగురు ఆడపిల్లల్లో చివరది తను. ముగ్గురు తమ్ముళ్ళున్నారు. ముగ్గురు కూతుర్లకి పెళ్ళిళ్ళు చేసేసరికి పుట్టెడు అప్పులతో రిటైరయి కూర్చున్నాడు ఆమె తండ్రి. అదృష్టవశాత్తూ బి.ఎ బి.ఇడి చేసిన సుధకి ఈ ఉద్యోగం దొరికింది.

అప్పటికే ఆమె బావ పెళ్ళికి తొందరపడుతున్నాడు. సుధ చూస్తూ తండ్రిని కష్టాలమధ్య వదిలి తనసుఖం తను చూసుకోలేకపోయింది. తను నాలుగేళ్ళు ఓపిక పడితే తండ్రి అప్పులు తీరి ఇద్దరు తమ్ముళ్ళ చదువులైనా పూర్తవుతాయని ఆశ.

అదే అతడితో చెప్పింది- ''నువ్వంటే నాకూ చాలా ఇష్టమే. నిజంగా నిన్ను ప్రేమిస్తున్నాను బావా. అయితే నన్ను కన్నవారి కష్టాల్లో నాకూ భాగం వుంది. మనకేం వయసు మీరిపోలేదు. నీకు ఇరవై అయిదు, నాకు ఇరవై. ఓ అయిదారేళ్ళు ఓపికపట్టగలిగేవనయితే నామీది నీ ప్రేమ అంతదాకా వేచి వుండగలదూ అనుకుంటే వుండు. నా తమ్ముళ్ళు ఒక దారికి వస్తారు. లేదూ, ఓపిక పట్టలేనూ... అంటావా? వేరే అమ్మాయిని వెతుక్కో...'' నెమ్మదిగా అయినా ఖచ్చితంగా చెప్పింది.

అతడికి నిజంగా ఈ అమ్మాయిపట్ల చాలా యిష్టంగా వుంది.

''సరే... కాని, ఇది నా ప్రేమకి ఓ పరీక్ష అనుకుంటాను. ఓడిపోయానో నిన్ను కోల్పోతాను'' అన్నాడు.

అయితే అతడు గెలిచాడు. అంతేకాదు. ఆర్థికంగా తనూ ఆమె కుటుంబాన్ని కాస్త ఆదుకున్నాడు. ఫలితంగా ఈ అయిదారేళ్ళలో ఆమె ముగ్గురు తమ్ముళ్ళ చదువులయ్యాయి. ఇద్దరు ఉద్యోగస్తులయ్యారు. ఆర్థికంగా చితికిపోయిన కుటుంబం నిలదొక్కుకోగలిగింది. పెళ్ళికి అటు అతడూ, ఇటు సుధ తండ్రీ తొందరపడుతున్నారు.

సుధని ఉద్యోగం వదులుకుని రమ్మంటున్నాడతడు. తనకోసం ఇంతకాలం ఓపిగ్గా ఎదురుచూస్తూ తన కుటుంబానికి చేయూతనిచ్చిన అతడికోసం ఉద్యోగం వదులుకోవడం సుధకి ఒక సమస్య కానేకాదు. ఇప్పటిదాకా ఓపిక పట్టిన అతడు రాబోయే వేసవి సెలవుల్లో వెంటనే పెళ్ళి జరిగిపోవాలి, ఇక ఆగే ప్రశ్నే లేదంటున్నాడు.

సుధకీ అభ్యంతరంలేదు. కానీ నేను, అజిత్ దూరమవుతూన్న విషయం తలచుకుంటే ఆ పూట భోంచెయ్యలేదు. కళ్ళు నీటికుండలవుతాయి.

ఏమిటీ అనుబంధాలు.

'నా' అనుకున్నవాళ్ళు దూరమైపోతారు...

వూహించని వాళ్ళొచ్చి ప్రాణంలా అవుతారు...

ఎక్కడి సుధ?

ఎక్కడి నేను...

మీరంతా దూరంగాపెట్టిన నన్ను కావాలని వచ్చి కావలించుకుని ఈ బంధాన్ని ముడివేసింది.

''అదుగో... ఇప్పటినుండి బాధపడుతూ

కూర్చుంటే ఎలా? రానీ మీ బావగార్ని. నేనే. అడుగుతాను ఇక్కడెక్కడన్నా ఉద్యోగం చూసు కోవయ్యా, లేదా అక్కడే నాకేదైనా చూడు. నీ ప్రాణమయిన సుధకి నేను ప్రాణం. నన్నొదిలి తానూ, తనని వదిలినేనూ ఉండలేము అని చెబుతాను- సరేనా...'' సుధని నవ్వించాను. ఎలాగైతేనేం.

''నిజంగా అలా జరిగితే ఎంతబావుణ్ణు'' దిగులుగా అంది.

మళ్లీ ''అయినా నన్ను మాటలతో మభ్యపె డతావుగానీ నువ్వు ఈ వూరొదిలి వస్తావా?'' అంది.

నేను మాటమారుస్తూ- ''పొద్దున కూడా నీ మాడుకూరతో చంపావు. ఏదైనా మంచి కూరచే ద్దూ. బావిదగ్గరకెళ్లి ఓ బిందె నీళ్లు పట్టుకొస్తా ను'' అన్నాను.

సుధకి వంటచెయ్యడం అంటే మంచిఉ త్సాహం కానీ సరిగా చేతకాదు. తన ముచ్చట ఈవిధంగా తీర్చుకుంటుంది.

''ఉండు... పచ్చిమిర్చి, ఉల్లిపాయలు, టమోటాలు వేసి, మెంతిపులుసు పోపుపెట్టి, బంగళాదుంపల వేపుడూ, కొబ్బరి పచ్చడీ చేస్తాను'' యుద్ధానికి బయలుదేరిన వీరనా రిలా కుచ్చెళ్లులో పైటకొంగుదోపి వంటగదిలో జొరబడింది.

నేను నవ్వుకుంటూ బిందె తీసుకుని బయ లుదేరాను. రోజూ రెండువూటలా బావిదగ్గరకి వెళ్లాల్సిందే. నా ఈ అలవాట్లలో ఏమాత్రం మార్పురాలేదు. ఈ వూరికి స్కూలు వచ్చినా, కరెంటువచ్చినా, బస్సు సౌకర్యం ఏర్పడినా ఇంకా కుళాయిలు మాత్రంరాలేదు. వచ్చినా నేను బావితో నా అనుబంధాన్ని వదుల్చుకోలే ను.

రేపోమాపో కుళాయిలు వస్తాయంటున్నా రు. నాగరికతకి చేరువవుతున్న జనానికి కష్టప డటం బొత్తిగా ఇష్టంలేకుండాపోతోంది. వూరంతటికీ ఒక్కటే మంచి నీళ్లబావి. కాళ్లీడ్చు కుంటూ ఇంతదూరం రావడం నాకు ఆనంద మేగానీ అందరికీ ఎందుకు సంతోషమవు తుంది.

నేను బావిదగ్గర చేరుకునేసరికి అక్కడ జనసంచారంలేదు. నెమ్మదిగా నీళ్లు తోడుకు న్నాను. తాడు బక్కెట్లో పెట్టాను. బిందెని చంకకి ఎత్తుకోబోతూండగా...

''సీతా''

ఆగిపోయాను! అది శ్రీకాంత్ కంఠం. బావి వెనుకవైపునుండి వచ్చాడు.

''ఈ అలవాటు ఇంకా మానుకోలేదా నువ్వు? మన జీవితాల్నే మార్చేసిన ఈ బావినీళ్లకోసం ఇంకా ఇంతదూరం వస్తూనేవున్నావా?'' అడిగా డు మృదువుగా.

నేనాగిపోయాను. అతడివైపు చూశాను...

నవ్వుతూ చూస్తున్నాడతడు...

అదేచూపు...

నన్ను నిలువెల్లా తడిమిచూస్తోన్న చూపు...

ఏమన్నాడు అతడు?

''మన జీవితాల్ని మార్చేసిన...'' అన్నాడు.

'మన'...

కలుపుతున్నాడేమిటి?

పదేళ్లనాటి నీజీవితం నీది, నా జీవితంనాది అన్నట్టు నిర్దాక్షిణ్యంగా తెంచుకువెళ్లిన అతడు ఇప్పుడు 'మన' అంటున్నాడు...!

''ఏమిటి సీతా అలాచూస్తావు? అయినా మాట్లాడటం మర్చిపోయినట్టు కనిపిస్తు న్నావు'' అన్నాడు.

నన్నగానవ్వాను నేను.

''ఏమిటి నవ్వుతావు? మన మనజీవితాలు అన్యాయం అయిపోలేదూ?'' అన్నాడు.

అదుగో మళ్లీ కలుపుతున్నాడు 'మన'..

''నా జీవితానికేమీ కాలేదు'' అన్నాను.

నిజంగా నా జీవితానికేమీకాలేదు. అతడి దృష్టిలో నా జీవితం అన్యాయం అయిందేమో. నా దృష్టిలో మాత్రంకాదు.

అతడి జీవితానికి మాత్రం ఏం? చాలా సుఖంగా వున్నాడుగా?

''అయితే నేను విన్నది నిజం అన్నమాట''

''ఏమిటి?''

''నీ గురించి''

''ఏం విన్నావు?''

''నువ్వు ఇదివరకటి సీతవికాదనీ, చాలా




మారిపోయావనీ" అదేలా పలికిందతడి కంఠం!

"నిజమే" అన్నాను.

నానుండి ఆ సమాధానం ఆశించనివాడిలా వింతగా చూశాడతను.

మళ్ళీ అన్నాడు- "చాలా మారిపోయావు"!

"జీవితం అన్నాక మార్పు చాలా సహజం"

"కోపంతో అంటున్నావా సీతా ఈ మాటలు?

"కోపమా... దేనికీ?" కాస్త ఆశ్చర్యంగా ప్రశ్నించాను!

"నువ్వు నిజంగా సుఖంగా వున్నావా?"

"ఎదుకులేను? చాలా సుఖంగా వున్నాను" మనస్ఫూర్తిగా అన్నాను.

"అప్పటికంటేనా?"

"ఎప్పటికంటే?"

అతడు ఇబ్బందిగా చూస్తూ- "మనం కలిసి భార్యాభర్తలుగా జీవించినప్పటికంటేనా?" అన్నాడు.

"అవును"

అతడి మొహం నల్లబడింది!

బహుశః ఇతడు నాగురించి, నా స్థితిగురించి చాలా తక్కువగా అంచనా వేసుకుని ఆలోచించి ఉంటాడు. ఎప్పుడైనా గుర్తంటూ వస్తే! అతడి వూహలకి విరుద్ధంగా వుందిక్కడ నా జీవితం! నేను చాలా ఆనందంగా ఉన్నాను! నాకాళ్లమీద నేను నిలబడి స్వేచ్ఛగా బతుకుతున్నాను.

అంతేకాదు, ఇక్కడ నా జీవితాన్ని గురించి ఇంకో రకంగా కూడా విని వుంటాడితడు!

'నేను' చాలాసుఖంగా, నీతో ఉన్నప్పటి కంటే సుఖంగా ఉన్నాను' అన్న నా మాటలకి వేరే అర్థం చెప్పుకున్న ఇతడి మగమనను కుమలటం ప్రారంభించింది.

ఎందుకితడికి ఈ విషయంలో ఇంతబాధ?

నిజానిజాలు పూర్తిగా తెలుసుకోకుండానే నేనేదో ఆనందాన్ని జుర్రుకుంటున్నానని, తన కోసం ఏళ్ళు గడిచిపోతున్నా ఇంకా ఏడుస్తూ ఎదురుచూస్తూ కూర్చోలేదని బాధ పడుతున్నాడే...

అదే నేను... నన్ను వదిలివెళ్ళి మూడునెలలు తిరగకముందే ఇతడు మళ్ళీ పెళ్ళి చేసుకుని పెద్ద ఉద్యోగం చేసుకుని మంచి సౌఖ్యవంతమైన జీవితంలోకి వెళ్ళిపోయాడు అని తెలిసిన రోజునకూడా నేను అప్పలు బాధపడలేదే?

ఏమిటి మా ఇద్దరి మధ్య ఈ తేడా?

నేను స్త్రీని, అతడు మగాడూ అయినందు వల్లనా?

కాదు... కానేకాదు...

ఆ లెక్కకి వస్తే స్త్రీకే ఈర్ష్యాసూయలు ఎక్కువ అంటారు! అదీ అబద్ధమే. ఈ విషయంలో ఇద్దరూ సమానులే.

నేను అతణ్ని అర్థంచేసుకున్నాను ఒక మనిషిగా! అతడు నన్ను అర్థం చేసుకోలేదు! ఇదే మా ఇద్దరి మధ్య తేడా! అంతా తెలుసుకోగలిగితే బాధ, దుఃఖం, ఈర్ష్య, ద్వేషం అన్నవి మనిషిని పెద్దగా బాధ పెట్టవు!

"నా జీవితం ఏమీ సుఖంగా లేదు సీతా" అన్నాడతడు.

నేనేమి మాట్లాడకుండా వింటున్నాను! ఇదంతా ఇతడు ఇప్పుడు నాకెందుకు చెబుతున్నట్టు?

"నేను పెళ్ళిచేసుకున్నాను తెలుసా?" మెల్లగా అడిగాడు!

తలూపాను "తెలుసు" అన్నట్టు.

ఉలిక్కిపడి- "తెలుసా? ఎలా? ఎప్పుడూ?" కొంచెం ఆతృతగా అడిగాడు.

"ఏమీ తెలీదు! పెళ్లయిందని మాత్రం విన్నాను"

"బాధపడ్డావా?"

"బాధా... ఎందుకూ?" అన్నాను! అన్నాక అర్థమైంది, అతడికి నా మాటలు ఎంత విచిత్రంగా అనిపిస్తున్నాయో!

మళ్ళీ అతడు కాస్సేపు మాట్లాడలేదు.

సుధ ఎదురుచూస్తుందేమో! నేను హఠాత్తుగా వెళ్ళిపోతే ఇతడు బాధ పడతాడేమో పాపం!

"సీతా... నువ్వు చాలా ఆనందంగా వున్నావు అప్పటికంటే ఇప్పుడు" అన్నాడు శ్రీకాంత్.

నవ్వి ఊరుకున్నాను.

"నీభార్య అంతంగా ఉండదా?" అని నేను అడుగుతానని కబోలు! తనే చెప్పారు- "నా భార్య అందంగానే ఉంటుందిగానీ, నీ అంత మాత్రంకాదు" అన్నాడు.

"అందానికి పరిమితులేమున్నాయి? ఎవరి అందం వారిది" అన్నాను.

"కావచ్చు.. నీకూ, ఆమెకీ చాలా తేడా ఉంది" అన్నాడు.

"ఉండొచ్చు! నేను నేనే! ఆమె ఆమే! ఇద్దరం ఒకటికాదు! ఇద్దరు వేరు వేరు మనుమల మధ్య తేడాలు ఉండటంలో విచిత్రం ఏమీలేదుగా" అన్నాను.

అతడు అవాక్కయి చూశాడు నా వైపు!

"వస్తాను శ్రీకాంత్... చీకటిపడింది" అన్నాను.

"కాస్సేపాగు సీతా! చీకటిపడితే ఏం? నేనున్నానుగా?" అతడన్న ఆ తీరుకి నాకు నవ్వువచ్చింది. ఇద్దరిమధ్యా ఒక బంధమంటూ ఉన్ననాడు ఇలాంటి చీకటిలో జరిగిపోయిన నా ప్రమేయంలేని ఒక పొరపాటుని మన్నించలేకపోయిన ఇతడు ఇప్పుడు ఈ చీకటిబారినుండి నాకు రక్షణ కల్పిస్తానంటున్నాడు! ఎంత చిత్రం?

ఎందుకితడు ఇలా మాట్లాడుతున్నాడు? ఇతడికి నాతో ఏంఅవసరం? నా అనుభవం అతడిలో ఏదో స్వార్థాన్ని పసిగట్టింది! అదే మిటో కాస్త ఓపిక పట్టి తెలుసుకోగలిగితే పోలా!

"నీలా లక్ష్మి అనుకూలవతికాదు సీతా- గర్విష్టి"...

అతడి భార్య పేరు లక్ష్మి అన్నమాట! ఆమె మీద నాకు ఇలా ఎందుకు చెబుతూన్నట్టు?

"డబ్బుగల ఇంట్లో నుంచి వచ్చింది! అందుకే ఆ గర్వం! నా జీవితంలో సుఖం కరువయింది" అన్నాడతడు.

శ్రీకాంత్ నా సానుభూతిని ఆశిస్తున్నాడు!

"చీరలూ, నగలూ తప్ప మరో విషయం పట్టించుకోదు! నీలా భర్తకి పంచాల్సింది శరీరాన్నే కాదు, ప్రేమాను రాగాల్ని... అన్న గ్రహింపులేని మనిషి"!

నాలా...

నేను తనకి ప్రేమని పంచేదాన్నన్న విషయం ఇప్పుడే గుర్తువచ్చిందా? ఎందుకు గుర్తుతెచ్చుకుంటున్నాడు?

పంచుతూన్న ప్రేమను తెంచుకుపోయిన రోజుల్ని చాలా సులభంగా మరచిపోయాడు.

"మనదేశంలో భర్తని ప్రేమించని స్త్రీలు చాలా అరుదు! కొందరికి అది పైకి ప్రకటించడంరాదు! పాపం లక్ష్మి అలాంటి స్త్రీ కావచ్చు" అన్నాను కాస్త ఓదార్పు అందిస్తూ.

"సీతా... నీకు లక్ష్మిమీద ఈర్ష్య అనిపించడంలేదా?" అడిగాడు చిత్రంగా చూస్తూ!

"ఎందుకు శ్రీకాంత్ ఈర్ష్య?"

"ఒకప్పటి నీ స్థానంలో తను ఇప్పుడుందని"!

నవ్వాను నిర్మలంగా! అలాంటి భావాలు నాలో లేవనీ, ఎప్పుడో అంతరించిపోయి నన్ను మనిషిగా మిగిల్చాయనీ ఇతడికి అర్థమయ్యేలా చెప్పడం ఎలా? పావం!

"లేదు... ఒక లక్ష్మిమీదేకాదు, ఈ ప్రపంచంలో ఏ మనిషిమీదా నాకు అసూయాద్వేషాలు లేవు" అన్నాను.

"అవునులే... చాలా ఎదిగిపోయావు" వ్యంగ్యంలో అతర్లీనంగా ఈర్ష్య, ఉక్రోషం!

వ్యంగ్యంలో 'నువు బాగా చెడిపోయావన్న విషయం నాకు తెలీదనుకుంటున్నావా...' అన్న భావం!

'నా వైభోగానికి నువ్వు బాధపడటంలేదే' అన్న ఉక్రోషం!

'నన్ను పోగొట్టుకునీ సుఖంగా వున్నావే' అన్న ఈర్ష్య!

వెరసి ఇతడో మనిషిలాకాదు... చిన్నపిల్లాడిలా అనిపించాడు! అజిత్ నయం పావం ఇతడి మీద!

"నేను ఈ వూరు ఎందుకొచ్చానో తెలుసా?" అడిగాడు.

"విన్నాను... ఏదో పొలం పనిమీద వచ్చావుటగదూ"

అతడిమొహంలో ఆశ్చర్యం ... 'ఈ విషయం తెలిసికూడా ఈ మనిషి ఈర్ష్య




పడదేం?' అన్నట్టుంది!

"గోపాలరావుగారు చెప్పారా?"

"లేదు... ఎవరో చెప్పారు"

అతడి మొహంలో ఆశాభంగం స్పష్టంగా కనిపించింది.

అంటే గోపాలరావుగారి ద్వారా నాకేదయినా చెప్పించాలని చూశాడా?

అదేనా ఇందాక ఆయన ఏదో చెప్పబోయి చెప్పలేక ఆగిపోయి వెళ్ళిపోయాడు...

ఆయన మాటలు గుర్తొచ్చాయి...

"ఊహూఁ... నేను చెప్పలేను! ఇందులో నేను కల్పించుకోకూడదు! నాకసలు ఇష్టంలేదు. చెప్పే అర్హత మాకెవరికీ లేదు"

ఏమిటా మాటలకి అర్థం?

అప్పుడు గమనించాను చీకట్లో దగ్గరికి వస్తున్న ఆకారాన్ని!

"సీతా..." వినోద్ కంఠం అది!

"నేనే" అన్నాను!

"ఎవరది పక్కన?" అనుమానంగా అడిగాడు.

"ఖంగారుపడకు... శ్రీకాంత్" అన్నాను.

చప్పున నిలబడిపోయాడు.

ఇది అతడు వూహించని విషయం, దృశ్యం అయినందువల్ల...

కొద్ది క్షణాలు నిశ్శబ్దం!

అతడే నోరువిప్పాడు- "బాబుకోసం ఇంటికి వెళ్లాను! సుధ నీకోసం ఖంగారుపడుతూ తనే బయలుదేరబోతోంటే నేనొచ్చాను"

"సుధ అనవసరంగా భయపడుతుంది. నాకేమవుతుందని?" అన్నాను.

వినోద్ కదల్లేదు! అలాగే నిలబడివున్నాడు!

నూతి చప్టామీద మేమూ, క్రింద అతడూ ... బొమ్మలా!

శ్రీకాంత్ అసహనంగా కదలడం గమనించాను నేను!

"అజ్జూ గోపాలరావుగారి ఇంటిదగ్గరున్నాడు వినోద్" అన్నాను.

వినోద్ సందేహిస్తున్నట్టు కదిలాడు! అతడు కనుమరుగయిన దాకా ఇతడేం మాట్లాడలేదు.

తరువాత అన్నాడు- "వినోద్ బాగా దగ్గరయినట్టున్నాడే" స్పష్టంగా హేళన ధ్వనిస్తోందా కంఠంలో.

"ఒక్క వినోదేకాదు, నాకందరూ దగ్గరివారే" అన్నాను.

"కొందరు మాత్రమే అని విన్నానే?" అదే వ్యంగ్యం.

"మనం విన్నవన్నీ ఎప్పుడూ నిజంకావు శ్రీకాంత్"

"నిజం చెప్పు సీతా... ఆనాడు ఆ సంఘటన జరగకముందునుండీ నీకూ, వినోద్‌కీ మధ్యసంబంధాలున్నాయికదూ"

నివ్వెరపోయాను ఈ ఆరోపణకి.

ఏమంటున్నాడు ఇతడు?

ఆ సంఘటనకి పూర్వం నాకూ, వినోద్‌కీ అక్రమసంబంధం వుందంటున్నాడా? అదే నిజమైతే నేనెందుకు అతణ్ని గురించి ఇతనితో మొరపెట్టుకుంటాను?

రహస్యసంబంధాలున్నప్పుడు నడిరోడ్డు మీద రేప్ చేసి స్పృహలేని స్థితిలో ఎందుకు వదిలిపోతాడతడు?

ఇది ఆలోచించలేదా ఇతడు?

ఎలా ఆలోచించగలడు...

ఆలోచించడానికి అవకాశం తీసుకుంటేగా?

అవకాశం తీసుకోకుండా తననితాను మభ్యపెట్టుకుని తనలో ఏదైనా గిల్టీ కాన్షస్‌నెస్‌వుంటే వినోద్‌తో ఇప్పటి నా చనువూ, వూళ్లో తను విన్న విషయాలూ ... వీటన్నింటినీ కలుపుకుని తన వల్ల పొరపాటేం జరగలేదు 'తప్పంతా నీదే' అంటూ నామీదకి నెట్టే ప్రయత్నం...

తన తప్పుని ఒప్పుకోలేని బలహీనత...

అహం!

"నిన్ను నేను అర్థంచేసుకోగలను శ్రీకాంత్" అప్రయత్నంగా పైకే అన్నాను.

"ఏమిటి... ఎందుకు?"

"నువ్వే ఆలోచించుకో అర్థమవుతుంది" అన్నాను.

"సర్లే... అదంతా ఎందుకు ఇప్పుడు నువ్వు సుఖంగానే వున్నావన్నమాట?"

"చాలా! అది నన్ను చూస్తూంటేనే తెలీటంలేదూ?" అన్నాను.

"మళ్ళీ నేనే వస్తాను శ్రీకాంత్. కావాలనుకుంటే మరోసారి మాట్లాడుకుందాం చీకటిపడితే పాములూ, తేళ్ళూ తిరుగుతూవుంటాయని తెలునుగదా నీకు. పైగా నాకాళ్లకి చెప్పులు కూడా లేవు. సుధ ఎదురు చూస్తూంటుంది" అన్నాను.

"సుధ ఎవరూ?"

"ఒక స్నేహితురాలు- వస్తాను" అంటూ కదిలివచ్చేశాను.

అతడేదో గొణుక్కోవడం వినిపించింది.

అతడేదో నాకు చెప్పడానికి ప్రయత్నించి చెప్పలేక ఏదేదో మాట్లాడాడు అన్న విషయం అర్థమవుతోంది.

అంతేకాదు... అతడిలో ఏదో నైరాశ్యం గోచరిస్తోంది.

ఇది నా అనుమానమా... నిజమా?

కాస్త దూరం నడవగానే- "సీతా" అంటూ వచ్చి కలిశాడు వినోద్.

నేను అతణ్ని చూసి కాస్త ఆశ్చర్యంగా- "ఇంకా వెళ్ళలేదా నువ్వు?" అన్నాను.

"ఊహూ... శ్రీకాంత్‌తో నిన్ను ఒంటరిగా వదిలివెళ్ళబుద్ధికాలేదు" అన్నాడతడు.

"ఏం?"

"ఏమో అదంతమంచిగా కనబడలేదు" అన్నాడు.

ఎందుకనుకుంటున్నాడతడిలా?

అతడే- "వాళ్ళో ఎవరూ నీగురించి అతడికి మంచిగా చెప్పివుండరు. ఎంతయినా ఒకప్పటి భర్త. ఆ కక్ష మనసులో వుంచుకుని..." ఆగిపోయాడు.

నాకర్థమైంది... చంపుతాడని భయపడ్డట్టున్నాడు పాపం.

ఎంత చిత్రం...? ఒకనాడు ఇతడు నా శరీరాన్ని అపవిత్రం చేశాడన్న కారణంతో ఇతడి బారినుండి నన్ను రక్షించుకోలేని శ్రీకాంత్ పిరికివాడిలా పారిపోయాడు.

ఇప్పుడు ఆ ఒకనాటి భర్త వూరందరి మాటలు విని అపోహలతో నన్నేంచేస్తాడోనన్న అనుమానంతో అతడినుండి నాకురక్షణ కల్పించడంకోసం సిద్ధపడివున్నాడితడు.

'ఇదో మూడుబొమ్మలాట' నవ్వొచ్చింది నాకు.

"శ్రీకాంత్ విషయంలో కాస్త జాగ్రత్తగా వుండు సీతా, అతడిగురించి నాకేదో అనుమానంగా వుంది. చీకటిపడిన తరువాత నీళ్ళకు రాకు. అసలీ అలవాటు మానుకో..." సలహా ఇస్తున్నట్టుకాదు.. బతిమాలుతున్నట్టున్నాడు.

మళ్ళీ నా మనసులో పోలిక...

ఈమాత్రం జాగ్రత్తలు నా భర్త బాధ్యతతో, ముందుచూపుతో ఆనాడు శ్రీకాంత్ ఇతడి విషయంలో చెప్పివుంటే అసలేమీ జరిగేదికాదు.

ఆనాడతడు అలా జరుగుతుందని వూహించలేదు. ఈనాడితడు జరగనిదాన్ని గురించి కాస్త ఎక్కువగా వూహించుకుని భయపడుతున్నాడేమో.

కాస్తజనసంచారంవున్నదాకా వచ్చి ఆగిపోయాడు వినోద్. నాతో కలసి నడవడతడు. ధైర్యం లేకకాదు. నన్ను నలుగురి చేత మాటలనిపించడం ఇష్టంలేక. పాపం నాగరాజుకి అదంతా తెలీదు.

వినోద్...

నాగరాజు...

శ్రీకాంత్...

నలుగురూ నన్ను పొడిచి పెడతారని వినోద్ నాతో కలసి నడవడు... అంతదూరం ఆలోచించని నాగరాజు నాతో విశ్వాసపాత్రంగా కలిసి అడుగులేస్తాడు...

తనని గురించి చులకనగా అనుకుంటారన్న పిరికితనంతో వూరి చివర తప్ప నాతో మాట్లాడలేని శ్రీకాంత్...

రకరకాల మనుషులూ...

స్వభావాలూ....

మనస్తత్వాలూ...

సంస్కారాలూ...

సమ్మిశ్రిత సమ్మేళనమే సమాజం.

"ఇంతసేపయిందేం అక్కా" వీధి గుమ్మంలో నిలబడి ఎదురుచూస్తున్న సుధ అడు

ర్దాగా ఎదురువచ్చింది!

"శ్రీకాంత్ కనిపించాడు"!

సుధకి పట్టరాని కోపం వచ్చింది- "పెద్దదానివైతే మాత్రం బుద్ధి ఉండక్కర్లా? అతడితో నీకేం మాటలు? అంతదమ్మున్న మగాడు వూరి చివరకాకపోతే దర్జాగా ఇంటికొచ్చి చెప్పకూడదా ఆ చెప్పేదేమిటో. అతడేదో స్వార్థంతో నిన్ను బుట్టలో పెట్టాలని చూస్తున్నాడు! అది నువ్వు గుర్తించటంలేదు" అంటూ తిట్టసాగింది.

తన కోపం తగ్గాక- "అతడిలోని ఆ స్వార్థం ఏమిటనుకుంటున్నావు?" అని అడిగాను నెమ్మదిగా.

"ఏదో వుంటుంది! ఇప్పుడు నువ్వు పరాయి ఆడదానివి! అందగత్తెవి! ఇది చాలదూ మగ దుర్మార్గుడికి"? కచ్చిగా అంది.

"కావచ్చు! అంతేనా?"

"సిగ్గులేకపోతేనరి, వుంచుకున్నదాన్ని కలిసినట్టు వూరి చివర కలవడానికి వాడేంమగాడు? ఆ నాగరాజునీ, వినోద్‌నీ చూసి బుద్ధితెచ్చుకోమని చెప్పేదానివి తెలివైనదానివైతే! ఈసారి నీతో నన్ను తీసుకెళ్లు నాలుగూ అడిగి మొహం కడిగి వదిలి పెడతాను" ఆవేశంగా, మంటగా అంది.

నేను ఇంకేం మాట్లాడినా సివంగిలా నామీదకి లేస్తుందని తెలును! అందుకే వూరుకున్నాను.

ఆ రాత్రి మళ్లీ ఆరేళ్ళ వెనక్కి వెళ్లాం ఇద్దరం!

★ ★ ★

"సీతమ్మా... ఈ విషయం విన్నావా?" అంటూ వచ్చింది అవ్వ! "ఏమిటీ?" పిల్లలకి నోట్‌బుక్స్ కుట్టిపెడుతున్న నేను అడిగాను!

"చిన్నాలేడూ"? అంది!

చిన్నా నాకెందుకు గుర్తులేడు! నేను ఎదురైతే తలదించుకుపోతాడు, ఆరోజు నాగరాజు వెంటబెట్టుకు వచ్చి క్షమాపణలు చెప్పించిన తరువాతనుంచి!

"వాడొక అద్దాల వెధవ! అమ్మా అయ్యకు





అదుపు మీరిపోయాడు. ఈమధ్య ఏదో గుణం కుదిరి కాలికి చేతికి అందివచ్చేడని సంబరపడుతున్నారు ముసలివాళ్ళు! టౌన్‌కి విత్తనాల కోసం వెళ్లేడంట. లారీ ఏదో గుద్దిందట! చావు బతుకుల్లో గవర్నమెంటు ఆసుపత్రిలో పడివున్నాడంట! విషయం తెలిసి గుండెలు బాదుకుంటూ వెళ్లారు అతడి ముసలి తల్లిదండ్రులు! చేతిలో పైసాలేదంట. నాగరాజు కూడా వూళ్ళో లేడు! అత్తగారి వూరికి వెళ్లాడంట" కాస్త జాలిగా అంది.

నాలో చలనం వచ్చింది!

"ఈవూళ్లోవాళ్ళు మనుషులైతేగదా! అంతా విని 'అయ్యోపాపం' అని వూరుకున్నారు. సమయానికి గోపాలరావుగారు కూడా లేరు" అంది.

నేను కదిలాను!

"ఎక్కడికీ?" అనుమానంగా అంది అవ్వ!

"వెళ్ళి చిన్నాని చూసి వస్తానవ్వా" పర్సులో కాస్త డబ్బు పెట్టుకుంటూ అన్నాను.

"ఇదెక్కడి దయాగుణమే సీతమ్మా... కాటేసే పాముకి పాలుపోసే మంచితనం ఈ ప్రపంచంలో కూడదే అమ్మా"!

అవ్వ మాటలు విననట్టే బయటికి నడిచాను!

అక్కడ హాస్పిటల్లో చిన్నా దిక్కూమొక్కూ లేని వాడిలా స్పృహలేని స్థితిలో పడివున్నాడు. కళ్ళనే చెఱువులు చేసుకుని గుండెలు బాదుకుంటున్నారతడి తల్లిదండ్రులు! వృద్ధులు! నాగుండె నీరయింది.

డాక్టర్‌ని కలిస్తే అతడి గ్రూప్ రక్తం దొరకదన్నాడు! అక్కడున్నదొకటే గవర్నమెంట్ హాస్పిటల్! ప్రయివేట్ హాస్పిటళ్ళకి తీసుకెళ్ళే స్థోమత చిన్నా నిరుపేద తల్లిదండ్రులకి ఎక్కడిది?

"చిన్నా బ్లడ్ గ్రూప్ ఏమిటి డాక్టర్?" అన్యమనస్కంగా అడిగాను.

"ఒ" పాజిటివ్. ఆ డాక్టర్‌గారిది మావూరు కాబట్టి, నా గురించి తెలీదు గాబట్టి గౌరవంగా సమాధానం ఇచ్చాడు.

ఎంత చిత్రం! ఈ పరిస్థితుల్లో కూడా ఇలాంటి విషయాల గురించి ఆలోచిస్తుంది మనసు? ఓవైపు నుండి అన్నీ గమనిస్తూనే వుంటుంది కాబోలు!

డాక్టర్ సమాధానంతో తళుక్కున మెరుపులా మెరిసింది నా బుర్రలో! కొంత ఆనందంగా- "నాదీ అదే గ్రూప్ డాక్టర్! అతడికి నారక్తం ఎక్కించగలరా?" అడిగాను!

డాక్టర్ చాలా ఆశ్చర్యంగా చూశాడు నా వైపు- "మీకే మవుతాడితడు?"

"ఏమీకాడు! ఆ తల్లిదండ్రులకి అతడు తప్ప ఎవరూలేరు డాక్టర్. అతడికేదయినా అయితే వాళ్ళూ ఆ క్షణంలోనే మరణిస్తారు. మా అందరిదీ ఒకటేవూరు" జాలిగా చెప్పాను.

"ఇట్సాల్ రైట్... రండి" అంటూ ఓ సారి నా బ్లడ్ టెస్ట్ చేయించి చూసి తృప్తిగా తలపంకించాడు.

నా బ్లడ్ గ్రూప్ నాకు తెలును! నెల తప్పిందని తెలిగానే శ్రీకాంత్ ఓ ప్రయివేట్ హాస్పటల్‌కి తీసుకొచ్చినప్పుడు జరిగిన టెస్ట్‌లో తెలిసింది.

నా రక్తం చిన్నా శరీరంలోకి ఒక్కో బొట్టే చేరుతూండగా నన్నో దేవతలా చూస్తూ నా కాళ్ళు పట్టుకోబోతున్న చిన్నా వృద్ధతండ్రిని వారిస్తూన్నప్పుడు అన్నాడు డాక్టర్- "ఈ ప్రపంచంలో ప్రతిమనిషిలో ఈమాత్రం మానవత్వం అన్నది వుంటే ప్రకృతి వైపరీత్యాలకి తప్ప మనిషి సాటిమనిషికి భయపడనక్కర్లేదు. తిండికీ కొన్నికష్టాలకీ నష్టాలకీ బాధపడనక్కరలేదు. రియల్లీ! ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ యూ"

నవ్వి వూరుకున్నాను.

ఏమిటో, చావుబతుకుల్లో వున్న మనిషికి కొంత చేతనైన సాయం చేస్తే అదో గొప్ప!

అసలు మానవత విలులంటే ఏమిటి?

తమ బతుకుకి తాము నిజాయితీగా బతికేస్తూ సాటిమనిషికి అవసరాల్లో కొంత చేయూతనివ్వడం.

ఇంత మాత్రానికే అదేదో గొప్ప విషయం అన్నట్టు, వాటిని పాటించడం అందరికీ చేతగాదనట్టు భయపడతారు.

కొంత లోతుగా ఆలోచిస్తే ఇవి చాలా చిన్నవిషయాలని తెలిసిపోవూ?

సరిగ్గా అప్పుడే హాస్పిటల్లో నన్ను చూసి గుర్తించి పలకరించింది సుధ.

"మీరు ఆరోజు నీళ్ల బావిదగ్గర నాకు కనబడి వూళ్ళోకి దారి చూపించారు కదూ? మీ పేరు సీత అని చెప్పారు కదూ?"

సుధ పక్కన ఒకావిడ వుంది. ఆవిడ మావూరావిడ. ఆవిడ మొహం అప్రసన్నంగా వుంది.

"నేనేనమ్మా" అన్నాను సుధతో చిరునవ్వుతో.

"అయ్యో... ఇదేమిటి? ఇతనెవరూ?"

"మనవూరే..." నేను చెప్పబోతోంటే...

"ఎవరైతే నీకెందుకూ? అన్నీ నీకేకావాలి. అడ్డమైన వాళ్లందర్నీ పలకరించుకుంటూ కూర్చుంటే డాక్టర్ వెళ్ళిపోతాడు..." కసిరినట్టుగా అని సుధని దాదాపుగా లాక్కువెళ్ళిపోయిందావిడ

సుధ దిగ్భ్రమలోనుండి కోలుకోకముందే ఆవిడ సుధని లాక్కువెళ్ళి పోయింది. నేను మామూలుగా నవ్వుకున్నాను. ఇప్పుడు నేను చిన్నాకి మానవతా దృష్టితో చేసిన ఈ చిన్న సాయానికి వూరంతా ఎలా ప్రతిస్పందిస్తుందో నాకు తెలును.

రాత్రవుతుండగా బాబుని చంకనేసుకొని ఆదుర్దాగానన్నువెతుక్కుంటూ వచ్చినఅవ్వ దృశ్యం చూసి బిత్తర పోయింది. మొదట తరువాత దీర్ఘంగాచూసింది నావైపు నా బుగ్గలు పుణికింది.

బాగా పొద్దుపోయి హాస్పిటల్ నుండి ఇంటికి వస్తూన్నప్పుడు స్పృహలోకి అప్పుడే వచ్చిన చిన్నా నావైపు చూసిన చూపు...

ఒక నాగరాజు చూసిన చూపు...

ఒక వినోద్ చూసిన చూపు...

★ ★ ★

"సీతగారూ! నాకు మీస్నేహం కావాలండీ" సుడిగాలిలా దూసుకొచ్చింది సుధ.

ఇక ఈ అమ్మాయి మళ్ళీ నాకు ఎదురవుతుందనికానీ, అయినా నావైపు కన్నెత్తయినా చూస్తుందనిగానీ నేను అనుకోలేదు. అలాంటిది ఇలారావడం ఆశ్చర్యమే.

"ఊరంతా మిమ్మల్ని గురించి చాలా అమానుషంగా మాట్లాడుతున్నారు. మీరు చూస్తే అసలైన మానవత్వానికి నిర్వచనంలా కని

పిస్తున్నారు. అందరూ 'చెడ్డ' అన్నది 'మంచి' అని నా అభిప్రాయం. ఆ మంచి మీలో వుందన్న నమ్మకం కలిగింది. నిజానిజాలే మీతో మీ దగ్గరే తెలుసుకుందామని వచ్చాను. మొన్న నాతో వున్నావిడ దూరపుబంధువు. వరనకి మేనత్త అవుతుంది. అలాంటి వాళ్లని మీరసలు పట్టించుకోరని గ్రహించాను మీ గురించి విన్నమాటలద్వారా. నాతో స్నేహం చెయ్యరూ?" పసిపాపలా అడుగుతూ అక్కడే వున్న బాబుని చూసి "అబ్బ ఎంత ముద్దొస్తూ న్నాడూ?" అంటూ ఎత్తి చంకనెనుకున్న టీనేజ్ దాటుతున్న సుధ తెల్పిన కాస్త గడుసుదే అని తెలుస్తూనే వుంది.

నేను నోరువిప్పే లోపల "బాబు పేరేమి టండీ?" అడిగింది!

"బాబు" వాడే చెప్పాడు ముద్దుగా!

గట్టిగా ముద్దుపెట్టేసుకుంది వాణ్ని!

"నిజమేనా?" నన్నడిగింది.

"అవును... ఇంకా పేరేంపెట్టలేదు" అన్నా ను.

"అయితే నేను పెడతాన్లెండి! ఇంతకీ నాతో స్నేహం ఇష్టమేనా?" అనుమానంగా అడి గింది!

"చాలా ఇష్టం సుధా" అన్నాను.

"థాంక్యూ అక్కా" అంది సంబరంగా!

ఊరంతా ఒకటై నాగురించి ఒకేలా చెప్పినా నా వాదన నా ద్వారా వినాలన్న కోరికతో నామీద చెడ్డ అభిప్రాయం ఏర్పరచుకోకుండా వచ్చిన ఆ అమ్మాయి కాస్త భిన్నంగా అనిపించింది.

"మన ఇద్దరి వృత్తి ఒకటే! అలాగే స్నేహం కలుపుకుందాం" అంది బాబుని ముద్దాడు తూ!

"ఈ బంగారుకొండ పేరు అజిత్... బావుందా?" అడిగింది!

"బావుంది" అన్నాను నవ్వుతూ.

మనసులో ఏ కల్మషములేనివాళ్ళే అంతస్వ చ్ఛంగా మాట్లాడగలరూ, నవ్వగలరూ అను కుంటా!




"నీ కథ చెప్పు" అంటూన్న సుధకి, అవ్వ కల్పించుకుని కాస్త గదమాయిస్తూ "లేడికి లేచిందే పరుగా? మంచి అమ్మాయిలే! సీత మ్మ బడికి వెళ్లనక్కర్లా?" అంది!

సుధ నెత్తికొంటూ "ఖర్మ! మతిమరుపు దాపురించింది ఈమధ్య! ఈ తప్పు నాదికాదు లెండి, బొంబాయి నుంచి వచ్చే ఉత్తరాలది"

"ఎవరున్నారమ్మా అక్కడ?"

"మాబావగారక్కా! కాబోయే హజ్బెండుగా రు! ఉత్తరాల్తో కాపురం మొదలెట్టాడు! రేపు ఏ ప్రెగ్నెన్సీనో వస్తే తను బాధ్యత వహిస్తాడా చెప్పు?" ఫిర్యాదు చేస్తున్నట్టుంది!

మనసంతా విప్పి హాయిగా నవ్వాను!

"నేను జలుబుచేసిందని సెలవు పెట్టాను" అని "జలుబుకీ తలనొప్పికీ సెలవులు పెట్టే నాబోటి టీచర్లున్నంతకాలం ఈ దేశం బాగుప డదుగాక బాగుపడదు! ఏరా కన్నా?" అజిత్‌ని అడిగింది!

"ఊఁ...ఊఁ..." అన్నాడువాడు!

"ఊఁ...ఊఁ....కాదు! ఆంటీ! ఏదీ? అనూ..."

"ఆంటీ" స్పష్టంగా పలికి సుధ ముద్దులవా నలో తడిసిపోయాడువాడు!

"నువ్వెళ్ళు సీతమ్మా! కథంతా నేను చెబు తాను" అంది అవ్వ నాతో!

"వస్తాను సుధా" అంటూ స్కూలుకి బయ లుదేరాను!

నేను సాయంత్రం తిరిగి వచ్చేసరికి గోడకి చేరబడి కూర్చునివుంది సుధ! కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి. అవ్వ లోపల ఏదో పని చేసుకుంటోంది.

"ఇంకా ఇంటికెళ్లలేదా సుధా?" అడిగాను.

"అక్కా" రుద్ధకంఠంతో అంటూ లేచివచ్చి నన్ను చుట్టేసి "నువ్వు మనిషివి కాదక్కా- దేవతవి" అంది!

"దేవతనికాదు... మామూలు మనిషిని. దేవ తనైతే ఇక్కడెందుకుంటాను చెప్పు! ఏ దేవలో కంలోనో ఉండనూ?" నవ్వాను.

"అవును! మనిషివే. అసలైనమనిషివి! దే వతలకి కూడా ఇంత సహనం ఓర్పు మంచి

తనం వుండవు! మళ్ళీ ఇంకోసారి నీ కథ నీ ద్వారా వినాలి. ఈ రాత్రి నేనిక్కడుంటానక్కా" అంది సుధ.

అది మొదలు స్నేహం అల్లుకుపోవడానికి! సుధ నన్ను బాగా అర్థం చేసుకుందనే అనుకుంటున్నాను. అయినా ఒక్కోసారి "ఈ అతి మంచితనం పనికిరాదు" అంటూ నాతో పోట్లాడేది.

"దుర్మార్గులని క్షమించడం చాలా తప్పు, పాపం" అనేది.

నేను చాలా ఓపిగ్గా విషయాలను విశ్లేషణాత్మకంగా వివరించి చెప్పి తను "కాదూ" అన్న విషయం "అవునూ" అని ఒప్పుకునేలా చేసేదాన్ని.

క్రమంగా సుధ తన జీవితాన్ని నా జీవితంతో ముడివేసుకున్నంత దగ్గరైపోయింది నాకు.

నాతో సుధ స్నేహాన్ని మాన్పించాలని చాలా మంది చాలా ప్రయత్నాలు చేశారు. చాలా మందిలో లేని ధైర్యం సుధలోవుంది. సుధ ఎవరిమాటలూ కేర్ చెయ్యలేదు.

నా ఇష్టం పొమ్మంది.

ఎవరేం చేయగలరు?

సుధ తండ్రికి ఉత్తరాలు వెళ్లాయి బంధువుల్నుండి.

"తన మంచిచెడ్డల్ని గురించి తను ఆలోచించుకోగల విచక్షణాజ్ఞానం నా కూతురికి ఉందనే నా నమ్మకం" అని తిరుగు జవాబిచ్చాడాయన.

ఇక ఎవరూ చెయ్యగలిగిందేమీ లేకపోయింది.

"ఈ సీత ఆ పిల్లని తప్పకుండా చెడిపేస్తుంది. పోనీ... ఎవరి ఖర్మకు ఎవరు కర్తలు?" కొందరు వేదాంత ధోరణిలో, కొందరు కసిగా అనుకున్నారు.

ఇదే సుధతో నాస్నేహం... అనుబంధం. ఇంతలో అవ్వ పోయింది. ఇది సుధని నాకు మరింత దగ్గర చేసింది.

పాలల్లో నీళ్లు కలిసినట్లు నా జీవితంలో సుధ స్నేహం ఐక్యం అయిపోయినా ఒక్కోసారి నన్ను విమర్శించడం, ఆరిందాలా మందలించడం మానదు.

పసిపాప మాటల్లాంటి సుధ మాటల్ని విని నవ్వుకోవడం నాకూ అలవాటయింది.



స్కూలుకి వెళ్ళడానికి ముందు త్వరత్వరగా అజిత్‌ని తయారుచేస్తాను. సుధ తనతో తీసుకెళుతుంది వాణ్ని. తర్వాత నేను తయారయి వెడతాను. సుధ కారియర్ తీసుకెళుతుంది కాబట్టి వీడికి వేకువనే లేచి వండి పంపాలన్న బాధ లేదు.

ఆరోజు మామూలుగా అజిత్‌ని తయారుచేస్తున్నాను. చాలావరకు తన పనులు తను చేసుకోగలడు వాడు. తల దువ్వుకోవడం, బూటులేసులు ముడేసుకోవడంలాంటివి రాదు. తన పనులు తను చేసుకుంటున్నా నేను పక్కన లేనిదే వాడికి తృప్తి ఉండదు. అజిత్ అప్పూట అన్యమనస్కంగా వుండటం గమనించాను.

కళ్ళుకూడా ఎర్రగా వుండటం గమనించాను అప్పుడే. రాత్రి గోపాలరావుగారి ఇంట్లో వున్నవాడు ఉదయాన్నే ఇంటికొచ్చాడు.

"కళ్ళు అలా ఉన్నాయేమ్మా? రాత్రి సరిగ్గా నిద్రపోలేదూ? తాతయ్యని కథలకోసం వేధించావా?" అడిగాను కాస్త కోపంగా.

నవ్వాడు బాబు నిశ్శబ్దంగా.

"అవునా?"

"కాదమ్మా"

"మరి?"

"రాత్రి తాతయ్య ఇంటికి ఆయనొచ్చాడు"

"ఆయనా... ఎవరాయన?"

"శ్రీకాంత్"

నేను కాస్త ఉలిక్కిపడి వాడి మొహంలోకి

చూశాను. మామూలుగా వుంది అజిత్ మొహం.

"శ్రీకాంత్ వచ్చాడా... ఎందుకూ?" అప్రయత్నంగా అడిగాను.

"నన్ను చూడ్డానికట!" చెప్పాడు.

"ఎవరు చెప్పారు?"

"ఆయనే చెప్పాడు"

వాడి తల దువ్వబోతున్న నేను ఆగిపోయాను.

అజ్జూ నవ్వాడు, "నన్ను 'నాన్నా' అని పిలవమన్నాడమ్మా"

ఇదంతా నాకు వూహించని విషయమే.

ఇందుకా అతడు నాతో మాట్లాడటానికి ప్రయత్నించడం? గోపాలరావుగార్ని రాయబారం పంపడం?

అజ్జూ కావాలనుకుంటున్నాడా?

ఆనాడు కడుపులో వున్నాడు గుర్తురానిబిడ్డ, పదేళ్ళవాడయ్యాక కావలిసి వచ్చాడా?

నా ఆలోచనా అనుమానం ఎంతవరకు నిజం?

తమాయించుకుని అడిగాను, "నువ్వేం అన్నావు?"

"అలవాటు లేదు గదమ్మా! అదే చెప్పాను"

"ఇంకా ఏం మాట్లాడాడు?"

"నేను నీకు నాన్నని తెలుసా?" అన్నాడు.

"శ్రీకాంత్ అంటే మీరేనా అన్నాను"

"అవును! నేను నీకు నాన్నని బాబూ. మీ అమ్మ మూలంగా మనం ఒకరికి ఒకరం దూరం అయ్యాం. నన్ను నాన్నా అని పిలువు... అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడమ్మా" మామూలుగా చెబుతున్నాడు అజిత్.

అంటే వాడి దృష్టిలో నన్నొక దుర్మార్గురాలిగా చిత్రీకరించే ప్రయత్నం చేస్తున్నాడు శ్రీకాంత్. వాణ్ని మచ్చిక చేసుకునే ప్రయత్నం ప్రారంభించాడు. ఓవైపు నా సానుభూతిని ఆశిస్తున్నాడు.

ఎందుకిదంతా చేస్తున్నాడతడు?

"ఇంకా... " అన్నాను.



తనకీ, శ్రీకాంత్‌కీ మధ్య జరిగిన సంభాష ణని వివరంగా చెప్పాడు అజిత్.

"అమ్మ చాలా మంచిది అన్నాను నేను"

"నీకు తెలీదు. మీ అమ్మ మంచిదైతే మనం ఇలా ఎందుకు దూరం అయిపోతాం నాన్నా— అన్నాడు శ్రీకాంత్".

"అమ్మని మీరే వదిలేసి వెళ్ళిపోయా రుగా?" అన్నాను.

"ఎవరు చెప్పారు నీకు?" ఆశ్చర్యంగా అడి గాడు "మీ అమ్మా?"

"అమ్మా లోకులూ"

"మీ అమ్మ మాటలు నమ్మకూడదమ్మా"

"లోకులు కూడా చెప్పారుగా?"

"లోకులంటే ఎవరు బాబూ?"

"నేనూ మీరూ అరుగో తాతయ్యా" గోపాల రావు తాతయ్యని చూపించాను.

శ్రీకాంత్ ఇంకా ఆశ్చర్యంగా చూశాడు.

"అమ్మా చెప్పింది. అందరూ చెప్పారు. నాకు అన్నీతెలుసు" అన్నాను.

"నీకు తెలిసినవి అబద్ధాలు" అన్నాడు.

నేను మాట్లాడలేదు.

"నీకెప్పుడూ నాన్నకావాలనిపించదా?" అడిగాడు.

"ఊహూఁ..." అన్నాను.

"ఎందుకని?"

"అమ్మా, తాతయ్యా, సుధఆంటీ, ఇంకా వూళ్ళో అందరూ వున్నారుగా" అన్నాను.

"అందరూ నాన్నలవుతారా?" అన్నాడు శ్రీకాంత్.

"చాలామందికి నాన్నలూ, అమ్మలూ వుంద రు ప్రపంచంలో... అందరూ మనవాళ్ళే అను కుంటే బాధేవుండదుగా..."

తాతయ్య ఏమీ మాట్లాడలేదు.

తెల్లబోయాడు ఈ సమాధానాలకి శ్రీకాంత్ "నీకు తెలీదుబాబూ నాన్న వుంటే ఆ గౌర వంవేరు. ఈ నాన్న వుంటే నీకు చాలా బొమ్మ లూ, బిస్కెట్లూ వస్తాయి..." అని చెప్పబోయా డు.

"బొమ్మలు నాకెందుకు? నేను చిన్నపిల్లా ణ్ణా? బిస్కెట్లూ అవి అమ్మా, తాతయ్యా కొనిపె డతారు" అన్నాను.

ఆయనకి కోపం వచ్చింది "వీళ్ళంతా నీకు కార్లు కూడా కొని పెడతారా"? అన్నాడు గట్టిగా.

"నాకు కారెందుకూ? వద్దు-కాస్త పెద్దయితే అమ్మ సైకిల్ కొంటుందిగా?" అన్నాను.

"నేనంటే నీకు యిష్టంలేదా?" అన్నాడు దిగులుగా.

"ఇష్టమే"

"నిజంగా?"

"నిజమే"

"ఎందుకిష్టం?"

"ఈ ప్రపంచంలో మనతోటి మానవులంద రీని ప్రేమించాలి. అందుకే నాకు ఎవరిమీదా కోపంలేదు. అందరూ యిష్టమే" అన్నాను.

"ఛీఛీ... అందరూ ఒకటెలా అవుతారు? లోకులంతా నాన్నతో సమానమవుతారా?"

"ఎందుక్కారు? మనవాళ్ళే అనుకుంటే అందరూ మనవాళ్ళేకాదూ?"

"వ్రేలెడులేని వాడిలాతయారయ్యాడేమి టండి?" తాతయ్యతో అన్నాడు శ్రీకాంత్.

"సీత పెంపకం అలాంటిది" అన్నాడా యన.

"నన్ను నాన్నా అని ఎందుకనవూ?"

"నాకు అలవాటు లేదుగా"

"అలవాటైతే అనగలవా?"

"అనకపోతే మాత్రం ఏం?"

ఇలా అర్ధరాత్రి దాకా తను తండ్రి అని లోకం కంటే తను గొప్ప అని బాబుని ఒప్పించ డానికి ప్రయత్నించి ఓడిపోయాడు శ్రీకాంత్.

బాబు తన భాషలో చెప్పిన విషయాలు ఇవి.

అంటే రాత్రి వినోద్‌తో బాబు గోపాలరావు గారింట్లో వున్నాడు అన్న విషయాన్ని చెప్పడం విని వెదుక్కుంటూ వెళ్ళాడన్నమాట?

"ఆయనతో మాట్లాడుతోంటే నీకేం అని పించింది అజ్జూ?"

"ఏమీ అనిపించలేదమ్మా"




"నాన్న అన్న అభిమానం కలగలేదూ?"

"లేదు"

"పోనీ...కోపంగా అనిపించిందా?"

"లేదు...కోపం ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు.

నాకు చాలా ఆనందంగా అనిపించింది. "మరి అతడంతగా అడిగితే నాన్నా అని ఎందుకు అనలేదు?"

"అలవాటులేదుగా?"

"నీకు అనాలనిపించినా నేనేమైనా అనుకుంటానని సందేహించావా?"

"నువ్వేం అంటావు? మొదట్లో వినోద్ అంకుల్‌ని కూడా ఏమీ పిలవలేదుగా! బాగా అలవాటయ్యాక పిలిచాను"

నాగుండెల్లో క్షణంలో సగంసేపు ఏదో భయంలాంటిది కదిలింది!

శ్రీకాంత్ అజిత్‌ని నాకు దూరం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడా?

ఎందుకలా?

వెంటనే స్ఫురించింది! అతడికి పిల్లల్లేరేమో!

అతడి మాటలవెనక కనిపించే నైరాశ్యానికి కారణం ఇదేనేమో...

నా సానుభూతికోసం ప్రాకులాడుతూన్నది ఇందుకేనేమో!

నాకు జాలి అనిపించింది!

"అజిత్ అతనికి పిల్లల్లేరులావుంది పాపం" అన్నాను.

"అవును" అన్నాడు.

"అతడితో వెళ్లమని నేనంటే వెళతావా అజ్జూ?" అడిగాను.

ఈసారి అజిత్ నావైపు తదేకంగా చూశాడు. తరువాత నామెడని గట్టిగా వాటేసుకుంటూ "నువ్వేందుకంటావ్! నువ్వనవు! నువ్వు చెప్పినా నేను వెళ్లను! నాకు ఆనాన్న వద్దు! నాకు నువ్వు కావాలమ్మా! నన్ను వెళ్లమనవు నువ్వు! నిజం చెప్పు" నవ్వుతూన్న అజిత్ కళ్లలో నీటిపొర ... దాని వెనుక ఈ 'అమ్మ' ఎక్కడ వెళ్ల మంటుందో అన్న భయమూ!

"బాబూ' వాడిని గుండెలకి హత్తుకున్నాను.

అప్పుడు నే వూహించినవిధంగా మాట్లాడాడు అజిత్. అయనకి పిల్లలులేకపోతే మళ్లీ పెళ్ళి చేసుకుంటాడమ్మా. నేను ఆయనతో వెళ్లిపోతే మళ్ళీ నీకు తమ్ముడూ, చెల్లెలూ పుట్టరుగా! అందుకనే నాకు నువ్వు-నీకు నేనూ కావాలి కదే"

"అజ్జూ ... అజ్జూ ..." మనిషి ఎమోషన్స్‌కి అతీతం కావడం చాలాకష్టం.

నా కళ్లు నాకు తెలీకుండానే చాలారోజుల తరువాత స్రవిస్తున్నాయి.

అజిత్ నా కళ్లు తుడిచి "నవ్వమ్మా" అన్నాడు.

మనసంతా విప్పి హాయిగా నవ్వాను.

'అజిత్ నా బిడ్డ' అన్న గర్వం నాలో-

"అమ్మగురించి చాలా చెడ్డగా మాట్లాడాడని శ్రీకాంత్‌మీద కోపం రాలేదు"

"ఎందుకూ కోపం? అందరూ అంటున్నదేగా? సుధ ఆంటీ, వినోద్ అంకుల్ అంటే కోపం వస్తుందిగానీ" అన్నాడు.

"వాళ్ళు అన్నా కోపం తెచ్చుకోకూడదమ్మా! ఎందుకలా అంటున్నారూ? నిజంగా అమ్మ తప్పువుందా? లేకపోతే పాపం వాళ్లెందుకలా తప్పుగా ఆలోచిస్తున్నారూ అని ఆలోచించాలి? అర్థమైందా?"

శ్రద్ధగావిని బుద్ధిగా తలూపాడు అజిత్.

"ఏంతల్లీ నీ కొడుకు ముస్తాబింకా పూర్తికాలేదా? అవతల బస్ వెళ్ళిపోయిందంటే నువ్వు కొనిపెట్టిన స్కూటర్లు, కార్లూ లేవిక్కడ ఎక్కిరయ్యిన వెళ్ళిపోవడానికి" కోపంగా అరుస్తూ వచ్చింది సుధ.

"అయిపోయింది' గబగబ అజిత్ తలదువ్వసాగాను!

"అక్కా! ఈ విషయం తెలుసా?" అంది సుధ మెల్లిగా.

"ఏ విషయం?"

"శ్రీకాంత్‌కి పిల్లల్లేరట! ఆవిడలో ఏదో లోపం అట! పుట్టే అవకాశం అస్సల్లేదట! ఆమెకెప్పుడూ దేవుడూ, గుళ్లూ,పూజలూ తప్ప భర్త ధ్యాన వుండదు? ఇతడికి జీవితంలో

సుఖం ఎండమావి అయింది! ఇక్కడికి వచ్చాక అజిత్ గురించి తెలిసింది! 'అచ్చు ముమ్మూర్తుల్లా నీలానే వున్నాడు నీ కొడుకు' అని చెప్పారట చాలామంది! అతడిలో తపన మొదలయింది. అజిత్‌ని తనతో తీసుకెళ్లాల న్న పట్టుదలతో ఉన్నాడట. రాత్రి అజిత్‌ని చూశాడట! వాడిమీద ప్రేమ పెరిగి పోయిందట! నువ్వు ఒప్పుకోకపోతే బల వంతంగానైనా తీసుకెళతాడట! ఊరంతా ఒకటే పుకారైపోయింది'' ఆందోళనగా చెప్పుకొ చ్చింది!

అంతా విని ప్రశాంతంగా ''పాపం'' అని మాత్రం అన్నాను!

''పాపమా? అతణ్ని ఏంచేస్తే పాపంవుంటుంది? ఏంచేసినా వుండదు?

ఆనాడు పనికిరాని బిడ్డ, గుర్తు రానిబిడ్డ ఈనాడు కావలసి వచ్చాడా దుర్మార్గుడికి! తొమ్మిది నెలలూ కడుపులో వుంచుకుని నింద లతో పాటుమోస్తూ అవమానాలమధ్య నడిరో డ్డులో జన్మనిచ్చి తొమ్మిదేళ్లు గుండెల్లో దాచు కుని పెంచుకున్న వాణ్ని అప్పనంగా తన్నుకు పోవాలని చూస్తున్న ఆ స్వార్థపరుణ్ని ఏంచే సినా పాపంరాదు'' ఆవేశంగా అంది!

సుధ ఆవేశంలోవుండగా మాట్లాడితే రెచ్చి పోతుంది.

''నేను ఆయనతో వెళ్లనుగానీ, స్కూలుకి టైమ్ అయింది ఆంటీ- పద'' అన్నాడు బ్యాగ్ అందుకుని అజిత్.

''జాగ్రత్త'' నన్ను హెచ్చరించి వెళ్ళిపో యింది సుధ.

బిడ్డలు కావాలన్న కోరికవుండీ పుట్టకపో వడం, పుడతారన్న ఆశలేకపోవటం ఎంత దురదృష్టకరం!

''సీతమ్మా'' నాగరాజు వచ్చాడు!

''రా నాగరాజూ''

నాగరాజు చాలా కోపంగా ''మాస్టారు వచ్చా డు తెలుసా ఊళ్ళోకి?'' అడిగాడు.

''తెలుసు నాగరాజూ''

''ఆయన కోరికకూడా తెలుసా? ఏం ఎత్తులే స్తున్నాడో తెలుసా?''

''అన్నీ తెలుసు''

''తెలిసి ఏమీ చెయ్యకుండా ఎట్టా కూర్చు న్నావమ్మా?'' ఆవేశంగా అడిగాడు.

''ఏం చెయ్యను?''

''పోలీసు రిపోర్టు ఇవ్వమ్మా''

నవ్వాను నేను. అమాయకంగా మాట్లాడు తున్న నాగరాజుని చూసి.

''నువ్వలాగే నవ్వుతూండమ్మా! విషపురుగు లన్నీ నీ నవ్వుతో సాధుజంతువులవుతాయను కుంటున్నావేమో! పిచ్చిలో వున్నావు సీత మ్మా!''

నాగరాజు చెమర్చిన కళ్ళను అద్దుకున్నా డు!

''ఈ వూళ్ళో నలుగురైదుగురు తప్ప నీ బిడ్డని నీకు దూరం చేయాలన్న కోరికతో వున్నవాళ్ళే వీళ్ళు అంతా. నువ్వు వూఁ... అను! ఆ మాస్టార్ని నరికి పోగులుపెడతాను'' ఉగ్రంగా అన్నాడు.

''అంత ఆవేశం పనికిరాదు నాగరాజూ! నానుంచి అజిత్‌ని దేవుడంటూ వుంటే వాడు కూడా వేరుచెయ్యలేడు... సరేనా? ఇంతలా ఆవేశపడితే పశువులకీ మనకీ తేడా ఏముంది? నాకేం అపకారం జరగదు. ఆ నమ్మకం నాకుంది. నువ్వేం ఖంగారుపడకు'' నచ్చజె ప్పాను.

నా ధైర్యంచూసినా పూర్తిగా సంతృప్తిపడలే దునాగరాజు- ''అవసరం అయితే నాసాయం తీసుకోవాలి సీతమ్మా నువ్వు''

''తప్పకుండా! అంతకంటేనా'' అన్నాను!

''జాగ్రత్తమ్మా'' హెచ్చరించి వెళ్ళిపోయా డు నాగరాజు.

ఊరంతా తెలిసిపోయిన ఈ విషయం నాకే ఆలస్యంగా తెలిసిందన్నమాట, నేను స్కూలుకి బయలుదేరేలోపల నలుగురైదుగురు ఇరుగు పొరుగువాళ్ళొచ్చి ''మీ ఆయన అజిత్‌ని తీసు కుని వెళుతున్నాడట గదా'' అని అడిగారు!

నేను మామూలు నవ్వుతో ''నాకు తెలీదు'' అన్నాను.

నా ధైర్యంచూసి విస్తుబోయి తరువాత ఆశా భంగం కలిగిన మొహాలతో వెళ్ళిపోయారు.





మీ అనుమానం నిజమైనట్టే! మీ వారికి నిజంగానే మెదడు చెడు... ఇంతకీ మీరీ విషయాన్ని ఎలా కనుక్కోగలిగారు?
మరి వే ఇతర సిమెంటు కన్నా నాగార్జున సిమెంటే నాణ్యమైనదని నేనంటే కాదని దబాయించబోయారు సార్! దాంతో నాకు డవుటొచ్చేసింది!
డా॥ నిర్ధారణ్ ఎం.డి
MAM 128

చివరికి స్కూలు పిల్లలుకూడా "టీచర్... మీ అజిత్‌వాళ్లనాన్న వచ్చాడటగా అజిత్ వూరె ళ్ళిపోతాడటగా" అడిగారు.

"నాకు తెలీదమ్మా మీరే అజ్జూని అడగండి" అని చెప్పాను వాళ్లకి.

నేను ఇంటికి తిరిగివచ్చేనరికి నాకోసం ఎదు రుతెన్నులు చూస్తూ కూర్చున్న గోపాలరావుగా రు కనిపించారు.

★ ★ ★

"సీతా... అనుకోకుండా నేను ఇమ్మీడియ ట్‌గా ఆశ్రమానికి వెళ్ళాల్సి వచ్చిందమ్మా! మరో గంటతరువాత బయలుదేరుతున్నాను" అన్నాడు.

"అదేమిటండీ?" ఆశ్చర్యంగా అడిగాను.

"ఆశ్రమంలో వుండే బాబాగారు మర ణించారు. అంత్యక్రియలకన్నా అందుకోవాలి. ఎలాగూ వారంలో బయలుదేరేవాణ్ణి- అది ఇలా కాస్త ముందుగా అయింది. ఇక్కడ మిగిలిన పనులేమీ లేవు. అన్నీ ఎప్పుడో పూర్తి చేసుకున్నాను. ఇల్లు అమ్మకమే కుదరలేదు. ఓ రెండు నెలలు ఆగి వస్తాను. నా బాధంతా బాబుకి దూరంగా వెళ్ళాల్సివస్తుందనే" అన్నా డాయన దిగులుగా.

నేను మౌనం వహించాను. ఈ విషయంలో ఆయన ఎంతగా దిగులు పడుతున్నాడో నాకు తెలును! ఈ అనుబంధాలనేవాటిని పెంచు కుంటూపోతే ఎంతగా పెనవేసుకుని బంధించి బాధిస్తాయోనాకు తెలును.

"టాక్సీ తెప్పించుకున్నాను. కారుని కూడా అమ్మేశానమ్మా. వెళుతూ బాబుని చూసి వెళతా ను స్కూలు దగ్గర. నాదో చిన్న అభ్యర్థన సీతా! నీ తండ్రినను కుని నా చిన్న కోరిక తీర్చమ్మా" ప్రాధేయపడుతున్నట్టడిగాడాయన.

తండ్రి...

ఎక్కడున్నాడు నా తండ్రి?

ఈ స్థితిలోవున్న నన్ను కూతురిలా భావించ గలడా?

అసలు భరించగలడా?

"ఫరవాలేదు చెప్పండి! నాచేతనైతే తప్పక తీరుస్తాను. నా తండ్రితో పోల్చుకోనక్కరలేదు ఇంతమాత్రానికే! మీ మంచితనం అమూల్య మైనది" అన్నాను.

ఆయన జేబు నుంచి ఓ పెద్ద నోట్లకట్ట తీశాడు. ఆ వందరూపాయల నోట్లకట్టని చూసి ఉలిక్కిపడ్డాను.

"నా తృప్తికోసం ఈ డబ్బు అజిత్ పేరు మీద బ్యాంకులో పెట్టమ్మా! కేవలం నా తృప్తి కోసమే! ఎప్పటికైనా సరే అవసరం వస్తే వుంటుంది. అజిత్ పట్ల నాకున్న వాత్సల్యం వెలకట్టలేనిది! వాడికోసం... కేవలం నా తృప్తి కోసం"

నేనేమీ మాట్లాడలేకపోయాను. ఎంత బాధ పడుతున్నాడీతను!

నేను కాదంటానన్న దిగులు ఆ కళ్ళల్లో-

అసలాయన ఈ విషయంలో నాకెందుకు భయపడాలి?

ఒక మనిషికి తనసాటి మనిషిని అనవస రంగా భయపెట్టి బాధపెట్టే అధికారం ఎక్క డిది?

ఇంతకాలం ఈ విషయంలో నేను కొంత మూర్ఖంగా ప్రవర్తించానా?

"మీ ఇష్టం" నోరువిప్పి అన్నాను.

ఆయన ఆనందంగాలేచి వెళ్ళి అజిత్ కోసం తనెప్పుడో తెచ్చిచ్చిన బ్రీఫ్ కేసులో వుంచాడు డబ్బు.

"ఇంకో మాటమ్మా" అన్నాడు!

"చెప్పండి" అన్నాను.

"అజిత్‌ని చూశాక శ్రీకాంత్‌లో స్వార్థం తలె త్తింది. అతడికి పిల్లల్లేరు. పుట్టరు కూడా! బిడ్డని నీకు దూరం చేసే ప్రయత్నాల్లో పడ్డా డు! నిన్న అదే నీకు చెప్పలేకపొయ్యాను. రాత్రి అజిత్ అతడికి సరైన సమాధానాలు ఇవ్వడం చూశాక నాకు ధైర్యం వచ్చింది! నీకు తెలుసా మ్మా?"

"తెలుసునండీ! వూరంతా తెలిసిపోయింది" అన్నాను.

నిట్టూర్చాడాయన . "నిన్న నాకేం చెప్పా డో తెలుసా? బాబు తన దగ్గర కొద్దిరోజులు వుంటాడని నీతో చెప్పమని బతిమాలుకున్నాడు. నాకిష్టంలేకపోయినా అత





డి బలవంతం, ఆ ప్రాధేయపడ్డ తీరూ చూసి చెప్పిచూస్తానన్నాను. కానీ, నిన్న చెప్పలేకపోయాను. రాత్రి తెలిసింది... బాబుని నీకు దూరం చేసే ప్రయత్నంలో నీపట్ల వాడి మనసులో దురభిప్రాయాలు ఏర్పరచే ప్రయత్నాలు బాగాచేశాడు- దీనితో అర్థమైపోయింది. బిడ్డని నీకు శాశ్వతంగా దూరంచేసే ఆలోచనలో వున్నాడని! నువ్వతణ్ని ఎదుర్కోగలనన్న నమ్మకం కుదురుతోంది నాకు, నీలో ఈ ధైర్యం స్థిరత్వం చూశాక! ఎందుకైనా మంచిది, ఈ జిల్లా సూపరిండెంటెంట్ ఆఫ్ పోలీస్ నాకు బాగా తెలును.

అలాగే ఓ లాయర్ కూడా! నేను వెళుతూ వాళ్ళతో మాట్లాడి వెళతాను. వాళ్ళ అడ్రసులు ఇవిగో' జేబులో నుండి ఓ స్లిప్ తీసి అందించాడాయన.

శ్రీకాంత్‌కి ఈయన చాలా భయపడుతున్నాడన్నమాట!

తరువాత కొన్ని జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడాయన.

నేను ఆలోచిస్తుండిపోయాను.



రాత్రి ఎనిమిది అయింది. సుధా, అజిత్ ఇంకా రాలేదు. బహుశః ఏ సినిమాకో వెళ్ళి వుంటారు. లాస్ట్‌బస్‌కి వస్తారు. ఇది అలవాటే. ఏనాడూ ముందుగా చెప్పి వెళ్ళదు సుధ! ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు! రాత్రిళ్ళు ఏ గోపాలరావుగారి ఇంటికి వెళితేనో తప్ప అజిత్ రానిదే ఎంత పొద్దుపోయినా భోంచెయ్యను నేను.

నా మనసంతా ఎంత కూడదనుకున్నా అలజడిగా వుంది.

'నేను మనసులో శ్రీకాంత్‌కి భయపడుతున్నానా?' పదేపదే నన్ను నేను ప్రశ్నించుకుంటున్నా సరియైన సమాధానం దొరకడంలేదు.

మనసుని ప్రశాంతంగా వుంచుకునే ప్రయత్నంలో భగవద్గీతని తీసి చదవసాగాను.

తలుపుతట్టిన చప్పుడు వినిపించింది.

"ఎవరది"?

సమాధానంలేదు.

లేచి వెళ్ళి తలుపు తీశాను.

శ్రీకాంత్.

"లోపలికి రావచ్చా సీతా?" చాలా మృదువుగా అడిగాడు.

తలూపాను! మళ్ళీ నాలో అలజడి మొదలయింది...

అతడు లోపలికి వచ్చి తలుపుమూశాడు.

ఎవరైనా చూస్తారన్న భయం. పగలు రాలేక దొంగలా రాత్రి వచ్చాడితడు. అతడి పిరికితనానికి చాలా జాలి అనిపించింది.

తలుపువేసి నావైపు పరీక్షగా చూశాడు.

"సీతా! మెడలో సూత్రంతాడులేదు, తీసేశావా?" అప్పుడే గమనించినట్టు అడిగాడు.

నేనేం సమాధానం చెప్పలేదు.

"భర్త వుండగానే ఇదేం ఖర్మ? వెంటనే వసుపుతాడు వేసుకో" ప్రేమ పలుకుతోందతడి కంఠంలో!

అర్థమవుతోంది...

నన్ను ట్రాప్‌లో వేసే ప్రయత్నం...

తను ఇంకా నన్ను భార్యలా భావిస్తున్నాడని నాకు తెలియజెయ్యాలన్నతపన అది.

"మాట్లాడవేం సీతా?"

"పసుపుతాడు మెడలోవున్నంత మాత్రాన నాభార్యాత్వానికి విలువవస్తుందా శ్రీకాంత్?"

తలొంచుకున్నాడతడు-"నన్ను క్షమించు సీతా, అది చిన్నవయసు, యుక్తాయుక్తవిచక్షణ తెలీని రోజులు, ఆవేశంలో ఆలోచనలేకుండా తీసుకున్న ఆ నిర్ణయానికి ఇప్పుడెంత బాధపడుతున్నానో తెలుసా?"

యుక్తాయుక్త విచక్షణ తెలీని రోజులు...చి

న్నవయను...పాతికేళ్ళు దాటిన వయసు చిన్న వయసా?

"ఇక్కడ పొరపాటు చేశానా? అక్కడలక్ష్మిని చేసుకుని ఇంకో పెద్దపొరపాటుచేశాను"

పాపం లక్ష్మి, అమాయకురాలు. పొరపాటు చేసినవాడివి ఆమె డబ్బుతో పొలాలు కొనడానికి ఎలా వచ్చావు శ్రీకాంత్?

ఈ విషయాలు పైకి అడగాలనిలేదు, ఎందుకు అడగటం? అతడి అవస్థ, తాపత్రయం నాకు తెలీకపోతేగా?

"సీతా ఎంత అందంగావున్నావు?" హఠాత్తుగా నేనువూహించనివిధంగా నన్ను గాఢంగా కౌగలించుకుని పెదవుల మీదగాఢంగా చుంబించాడతడు.

అతడలాచేస్తాడని ఏమాత్రం వూహించని నేను చాలా దిగ్భ్రాంతి చెందాను. నేను దిగ్భ్రాంతినుండి తేరుకునేలోగా అతడు నన్ను మంచంపైకిలాక్కుపోతూ నన్నురెచ్చగొట్టే ప్రయత్నాలు ప్రారంభించాడు.

"శ్రీకాంత్..." తీవ్రంగా పిలుస్తూ విదిలించి కొట్టానతణ్ని.

నాకోపానికి కాస్త బెదిరినట్టు కనిపించాడు.

"కాస్తదూరంగావుండు" కోపాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ అన్నాను.

"తప్పేముందిసీతా? భార్యాభర్తలం, కొంత కాలం దూరంగా వున్నంతమాత్రాన మనసుల్లో ప్రేమా, మమకారం లేకపోతాయా?"

భార్యాభర్తలం...

ఎంతనవ్వు పుట్టించేమాట...?

మళ్ళీ అతుకువేయాలని చూస్తున్న బంధం...

'కొంతకాలం దూరంగా వున్నంతమాత్రాన'...

కొంతకాలం అంటే...పదేళ్ళా?

ఏభార్యాభర్తలయినా పదేళ్ళు దూరంగా వుంటారా- నిజంగా అంతలేసిప్రేమలూ, మమకారాలూ మనసులోవుంటే?

అతనికళ్ళల్లో కాంక్ష...




నాశరీరాన్ని చూస్తూ ఎరుపెక్కుతున్నకళ్ళు...

కోరికని తీర్చుకోవడానికి 'భార్యాభర్తలం అన్నంత పెద్ద అబద్ధం ఆడాల్నా?

'నీ శరీరం నాకు కావాలి' అని నిజాయితీగా చెప్పి వుంటే అతడిధైర్యాన్ని అయినా మెచ్చుకునివుండేదాన్నేమో.

సాటిమనిషిని ద్వేషించడం అన్నది మర్చిపోయిన నాకు మళ్ళీ ఎందుకు 'అసహ్యం' లాంటి భావాల్ని నేర్పుతావు శ్రీకాంత్? మళ్ళీ రాగద్వేషాల పాపపంకిలంలోకి లాగకు నన్ను.

నన్ను నన్నుగా మనిషిగా మిగలనీ, నీస్వార్థంకోసం నన్నులక్ష మందిలో ఒకర్నిగా చెయ్యకు, నేను అన్న అహంలో మిగలనీ.

"తప్పేంవుంది సీతా, ఈ రోజునుండి కొత్త జీవితాన్ని ప్రారంభిద్దాం రా..." అతడు తమకంగా నావైపు రాబోయాడు.

"వద్దు... ఈ శారీరక సుఖాలతో సంబంధంలేని కొత్తజీవితాన్ని ప్రతినిత్యం అనుభవిస్తూనే వున్నానునేను. నాలో కోరికలు లేవు. ఏమీలేవు. దయచేసి దూరంగావుండు. నువ్వు ఇక్కడికి వచ్చింది ఇందుకే అయితే దయచేసి వెంటనేవెళ్ళిపో. నీ కోరిక తీరదు" స్పష్టంగా చెప్పానతడికి.

నా కంఠంలో ఎలాంటి కోపం లేకపోవడం నాకు ఆనందాన్ని కలగజెయ్యడమేకాదు, అతడికీ ధైర్యాన్ని కలగజేసింది.

పట్టపగలు నా ఇంటికి ధైర్యంగా రాలేనివాడు...కొత్తజీవితం కబుర్లు చెబుతున్నాడు. ఎంత విచిత్రం అది?

"సీతా! నీ అందం నా మతిపోగొడుతోంది"

"నా అందం చాలామంది మతులు పోగొడుతూ వుండవచ్చు! అలా అని అందరికోసం శరీరాన్ని పరచగలనా శ్రీకాంత్?"

అతడిమొహం ఎర్రబడింది.

"అందరితో నేనూ సమానమా?"

"అవును"!

"అంతేనా?"

"నిజం శ్రీకాంత్"

"ఓహో! వినోద్‌కీ, నాగరాజుకీ, ముసలి గోపాలరావుకీ తీసిపోయాననేమాట?"

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

అతడి వికృతరూపం బయటపడింది.

"ఎంత పిచ్చివాడివి? అలా అని నేన న్నానా? నువ్వేభావంతో ఈ మాటలు అంటు న్నావాళ్ళెంతో నాకు నువ్వూ అంతే! నువ్వెంతో వాళ్ళూ అంతే"!

"అయితే నాకోరిక తీర్చడానికి అంతబాధ దేనికి?" ఉక్రోషంగా అడిగాడు.

"మనసనేది ఒకటుంది శ్రీకాంత్! దాన్ని వంచించుకోలేం! దానికీ ఇష్టా ఇష్టా లుంటాయి"

"ఓహో! వాళ్ళ విషయంలో దానికి ఇష్టమే గాని అయిష్టం ఉండదుకాబోలు" కసి!

వాళ్ళతో నాకు శారీరక సంబంధంలేదని ఇతడికి చెప్పడం దండగ. ఇతడు నమ్మడు. నమ్మనివాడిని నమ్మమని తెలిసీ నమ్మించబూ నడం మూర్ఖత్వం.

"ఇంతకాలంతరువాత ఇంటికివచ్చిన భర్త కి ఇచ్చే మర్యాద ఇదేనా?" తననితాను కంట్రో లు చేసుకుంటూ నిష్ఠూరంగా అన్నాడు.

ఇంతకాలం తరువాత అర్థరాత్రి దొంగలా ఇంటికి వచ్చిన భర్త...

భర్తకి అర్థరాత్రి రహస్యంగా భార్య దగ్గరికి రావాల్సిన ఖర్మ ఏమొచ్చింది?

ఎందుకు శ్రీకాంత్ నీ స్వార్థానికి 'భర్త' అనే అందమైన ముసుగు వెయ్యడానికి ప్రయత్ని స్తావ్? అది నాకంటికి చాలా వికృతంగా కనడ బడుతోందని నువ్వెలా అర్థంచేసుకుంటావ్...?

"ఇప్పుడు నిన్ను బలవంతంగా లొంగదీసు కుంటే ఏంచేస్తావ్?" అడిగాడతడు మంచంమీద కూర్చుంటూ.

"ఏంచేస్తాను? ఏడేళ్ళనాడు వినోద్ అదేపని చేస్తే ఏంచెయ్యగలిగాను?"

"ఛీ" ఛీత్కరించాడతడు. మాటిమాటికీ వాడితో నాకు పోలికా? ఆనాడు వూరంతా నిన్ను "ఛీ"కొట్టింది.

"అవును... కొట్టింది. ఈనాడు నువ్వు నన్ను బలాత్కారం చేసినా, ఈవిషయం తెలిసినా ఊరు ఏమీఅనదు. ఎందుకంటే... నేను నీభా ర్యనని నువ్వు మర్చిపోయినా నేను 'కాదూ' అనుకున్నా అది మర్చిపోలేదు 'అవును' అను కుంటోందికాబట్టి" అన్నాను.

"అవును" గర్వంగా నవ్వాడు.

అతడి సంస్కారం ఏపాటిదో పదేళ్ళనాడే అర్థంచేసుకున్న నాకు ఈనాటి అతడి ప్రవర్తన, మాటలూ అసహ్యం కలిగించటంలేదు.

"ఈ వూళ్ళో నువ్వు నాభార్యవికావని, అజిత్ నాకొడుకు కాడని ఎవరు అంటారో-అనమను చూద్దాం" అదే గర్వంతో అన్నాడతడు.

"ఎవరూ అనరు. కాని, నేను నీ భార్యనంటే నీ విలువ తగ్గుతుంది- మర్చిపోయావా?"

"వెక్కిరిస్తున్నావా?"

"లేదులేదు...గుర్తుచేస్తున్నాను-నిజంగా"

అతడేం మాట్లాడలేదు. అనుమానంగా నాముహంలోకి చూశాడు.

తరువాత చాలా దీనంగా "నా జీవితం నరకంలావుందిసీతా! నా భార్యకి పిల్లలు పుట్ట లేదు. ఇక పుడతారన్న ఆశకూడా లేదు. తన పూజలూ, వ్రతాలు తప్ప నన్ను పట్టించుకోదు. సంసారసుఖంకూడా లేకుండా పోయింది. సీ తా, నువ్వు నాతోవచ్చెయ్! నీకొక ఇల్లుకట్టిస్తాను. మన పాతజీవితంలోకి వెళ్ళిపోదాం. బాబుని నేను దత్తత తీసుకుంటాను- పదిమంది ఎదుటా! నీదగ్గరా నాదగ్గరా వుంటాడు. అప్పు డు నీకూ బాధవుండదు" ఇప్పుడు పెట్టాడు మనసులోని మాట బయట.

తనకి సంసారసుఖంలేదు. అందుకోసం అందమైన నేను కావాలి.

ఎలా?

ఒకభార్యగా కాదు...

ఉంపుడుగత్తెగా...

నాకొక ఇల్లు కట్టిస్తాడు.....

శరీరంలో దాహం పుట్టినప్పుడు తీర్చుకుపో వడానికి నా దగ్గరికి వచ్చిపోతూంటాడు!

ఆఖరికి నా కొడుకు, 'నాకు పుట్టిన తన బిడ్డ' అని చెప్పుకునే ధైర్యంసైతం ఇతడికి లేదు! నలుగుర్లో దత్తత రూపంలో ఇంటికి తీసుకెళతాడు! నా బిడ్డని నేను దూరంనుండి చూసి సంతృప్తిపడాలి! అష్టయిశ్వర్యాలలో మునిగి తేలుతున్నాడని సంతృప్తిపడాలి!

శ్రీకాంత్! నువ్వెంత స్వార్థపరుడివి? ఈ




సమాజంలో నీలాంటి స్వార్థపరులెందరో.....

"నాకు నువ్వు కావాలి సీతా! బాబు కావాలి" దీనంగా అన్నాడతడు!

ఆమాట నిజమే! నేను కావాలి! బాబు కావాలి!

కలిసి కాదు....

తల్లీకొడుకులుగా కాదు....

విడివిడిగా.....

వాడు నీ కొడుకుగా.....

నేను నీ సరదాలు తీర్చే బొమ్మగా...!

"కావాలంటే అక్కడా నువ్వు ఉద్యోగం చేసుకోవచ్చు"!

'భరించేవాడు భర్త' అన్న అభిప్రాయం కలిగివున్న నీలాంటివాళ్ళు భార్యచేత ఉద్యోగం చేయిస్తారా శ్రీకాంత్ ఎక్కడైనా?

"పోనీ, నువ్వంతగా కాదూ కూడదూ అని పట్టుబడితే వినోద్‌గానీ, నాగరాజుగానీ అప్పుడప్పుడూ వచ్చి నిన్నుచూసి వెళుతూంటారు...."

ఈసారి ఆపుకోలేక ఫకాలున నవ్వాను!

అలివిమాలిన దుఃఖంతో వచ్చిన నవ్వది!

"ఎందుకు నవ్వుతావు?" ఆశ్చర్యంగా అడిగాడు!

ఏమని చెబితే నీకు అర్థమవుతుంది?

ఎందుకని చెబితే నీకర్థమవుతుంది??

ఎలా చెబితే... ఏ భాషలో చెబితే నీకు అర్థమవుతుంది???

ఇంతలో ఎవరో బయటినుండి తలుపు తట్టారు!

శ్రీకాంత్ ఉలిక్కిపడ్డాడు....

చప్పున లేచాడు......

"చూడూ... నువ్వు కాదూకూడదూ అని మొత్తుకున్నా అజిత్ నా కొడుకే"!

ఈసారి 'నువ్వు నా భార్యవి' అనలేదతడు!

"ఆ విషయంలో వూరంతా సాక్ష్యం చెబుతుంది! బలవంతంగానైనా వాడిని నాతో తీసుకెళ్ళగలను! నాతో రాజీపడటం నీకే మంచిది" ఇలా అని పెరటివైపు తలుపు తీసుకుని వెళ్ళిపోయాడతడు.

అతడు వెళ్ళినవైపే చూస్తున్న నా గుండెల్లో... అదే భావం...

నన్ను భయం...

తలుపు గట్టిగా బాదుతున్న చప్పుడుకి తేరుకుని వచ్చి తలుపు తీశాను.

ఎదురుగా వినోద్!

అతని మొహంలో ఆందోళన.

★ ★ ★

"సీతా! శ్రీకాంత్ ఇంట్లోకి రావడం గమనించాను. ఎంతసేపు గడిచినా బయటికి రాలేదు. నాకు చాలా ఖంగారుగా, భయంగా అనిపించి తలుపు తట్టాను- ఏడీ?" ఆతృతగా అడిగాడు.

నిశ్శబ్దంగా తీసివున్న పెరటివైపు తలుపులు చూపించాను.

వినోద్ మొహం ఎర్రబడింది. "పారిపోయాడా దొంగలా? పట్టపగలు నీతో మాట్లాడటానికి ధైర్యంలేనివాడు అర్థరాత్రి ఇంట్లో దూరాడా? సిగ్గులేదూ? మగవాడేనా అతడు?" ఆగ్రహంగా అన్నాడతడు.

"అతడి పిరికితనానికి జాలిపడాలి వినోద్"

"జాలిపడాలి. సానుభూతి చూపించాలి. మానవత్వంతో ప్రవర్తించాలి. ఇలా అందర్నీ క్షమించుకుంటూ పోయి నువ్వు దేవతవైపోతావేమోగాని నిన్నెవరూ దేవతలా గుర్తించరు. శ్రీకాంత్ నీపాలిట నాగుబాము కాబోతున్నాడు. కాటుకి సిద్ధంగా వున్నాడు. నిన్ను మభ్యపెట్టో, లేదా హత్య చేసయినా సరే అజిత్‌ని ఎత్తుకెళతాడు" గట్టిగా అన్నాడతడు.

సన్నగా కంపించాను నేను.

"ఏం చెయ్యదలచుకున్నావు?" అడిగాడతడు కాస్సేపటికి శాంతపడుతూ.

"ఏమీ అనుకోలేదు"

"నీకు తెలీదు. అతడి ఏర్పాట్లు అతడు చేసుకుంటున్నాడు. వూరు మొత్తం అతడివెనక వుంది. కోర్టుకి వెళ్ళినా, నిన్ను చంపినా అతడి దుర్మార్గాన్ని బయల్పరిచే ఒక్క సాక్ష్యమూ బయట మిగలదు. నాబోటివాళ్ళు కల్పించుకున్నా పాతనేరాలు బయటకొచ్చి జైలుకెళ్లి కూర్చుంటాం. ఒక్కసారి బాగా ఆలోచించి నువ్వు ఒప్పుకో. అతడికెలా బుద్ధి చె



ప్పాలో అదంతా నేను చూసుకుంటాను. అతడు నీవైపూ, బాబువైపూ కన్నెత్తిచూడకుండా నేను శాశ్వతంగా ఈ సమస్యని పరిష్కరిస్తాను'' బతిమాలుతున్నట్లు అన్నాడతడు.

"నాకు ఆలోచించడానికి అవకాశం ఇవ్వు ౨నేద్'' అన్నాను.

"సీతా...'' అతడు సందేహంగా అంటూ నా ెయ్యి పట్టుకున్నాడు.

నేనతడివైపు చూశాను.

అతడేదో చెప్పబోయాడు...

అంతలోనే ఆగిపోయాడు...

"జాగ్రత్తగా తలుపులు వేసుకో'' అంటూ ళ్ళిపోయాడు.

అతడేదో చెప్పాలని చెప్పలేక వెళ్లిపోయా ం.

నేను ఆలోచిస్తూ కూర్చున్నాను. సుధ, జిత్ వచ్చారు.

వస్తూనే- "ఏం అలా వున్నావు?'' అనుమా ంగా అడిగింది సుధ.

"ఏమీలేదు...గోపాలరావుగారు వెళ్ళిపోయా గా'' అబద్ధం ఆడాను.

సుధకిదంతా చెప్పే ఓపిక నాలో లేదని ్ంది. సుధతో అబద్ధం చెప్పడం ఇదే )సారి.

"అవును'' విచారంగా అంది. "అజ్జాని ్కుని ఆయనా, ఆయన్ని పట్టుకుని వీడూ టే కళ్ళనీళ్ళు పెట్టుకోవడమే''

అప్పుడు చూశాను బాబువైపు. మొహ ంతా ఎలాగోవుంది. అప్పుడు కూడా కళ్ళల్లో గారింది.

'దిగులుపడకమ్మా! మళ్ళీ వచ్చేనెలలో రు తాతయ్య. ఈలోగా నీకు ఉత్తరాలు ్గారుగా'' అనునయంగా అన్నాను.

ళ్ళు తుడుచుకుంటూ నవ్వాడు అజ్జూ. ంచేశాక సుధ అలసిపోయిందేమో, త్వరగా నిద్రపోయింది. నాకు నిద్ర ేదు. ఆలోచిస్తున్నాను- శ్రీకాంత్ గురించే. తడు ఆనాడు సమాజానికి భయపడేగాక ఒక సగటుమగాడి సంకుచిత మనస్తత్వంతో అపవిత్రురాలిగా భావించి నన్ను వదిలి వెళ్ళిపోయాడు. వెంటనే నన్ను మర్చిపోయి మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. వచ్చిన భార్య నాలా పేదింటి పిల్ల కాదు. ఉన్నఇంటినుండి వచ్చింది. ఆమె తండ్రి పలుకుబడితో అతడికి ఉద్యోగం, ఒక హోదా వచ్చాయి.

నేను అతని భార్యగా వున్నరోజుల్లో కేవలం ప్రేమానురాగాల్నే కాదు అతడిపట్ల ప్రకటించింది, నా కోసం తల్లిదండ్రుల్ని వదులుకుని వచ్చాడని, హోదాని, అంతస్తుని తృణప్రాయంగా భావించి నా కోసం వచ్చాడని మనసులోనే అతడిపట్ల కృతజ్ఞతను పెంచుకుని నా మాటలద్వారా, చేతల ద్వారా అది వ్యక్తపరుస్తూ వచ్చివుంటాను.

మగవాడిగా అది అతని ఇగోని పెంచి వుంటుంది. నన్ను వదులుకుని వెళ్లాక అక్కడ ఆమెనుండి అతడికి ఇలాంటి కృతజ్ఞత లభించి వుండకపోవచ్చు.

'నీకంటే నేనెందులో తక్కువ?' అన్న భావం ఆమె ప్రవర్తనలో వ్యక్తమై సహజంగానే ఇతడి అహంమీద దెబ్బకొట్టి వుండవచ్చు. ఫలితంగా అతడిలో అసంతృప్తి మొదలయివుంటుంది. దీనికితోడు ఆమె ద్వారా పిల్లలు కలిగే అవకాశం లేదని స్పష్టమైంది.

ఇదింకా పెద్ద అసంతృప్తి. పైగా ఆమె పిల్లలకోసం అమాయకంగా పూజలూ, వ్రతాలూ అంటూ అతణ్ణి శారీరక సుఖానికి దూరం చేసింది. ఇదింకా భయంకరమైన అసంతృప్తి అయింది అతడికి. అయితే ఈ అసంతృప్తుల న్నీ అతడిలో అంతర్లీనంగా వుండేవి.

ఇలాంటి సమయంలో అనుకోకుండా అతడీ వూరు రావడం, వూహించనివిధంగా నన్ను ఇక్కడ చూడటం సంభవించింది. నేను ఇక్కడ చాలా దయనీయకరమైన పరిస్థితుల్లో ఉండివుంటాను. అతడి అదృష్టానికి ఈర్ష్య చెందినా 'నా జీవితాన్ని నాశనం చేశావు' అని నిందించివుండినా పరిస్థితి మరోలా వుండి వుండేది.

కానీ, అలా జరగలేదు. వయసుతో నా అందం రెట్టింపైంది. దాన్ని తన భార్యతో పోల్చుకుని చూశాడతడు. నేను చాలా మామూలుగా అతడితో మాట్లాడాను. అతణ్ణి ఒక




శత్రువుగానే కాక, అప్పుడిలానూగాక చిరకాలం తరువాత ఎదురుపడిన ఒక పరిచితుణ్ణి చూసినట్టు చూశాను.

నాలో అతడు వూహించిన దుఃఖపు ఛాయలు కనిపించకపోవటమేకాదు. చాలా సుఖంగా వున్నట్టు కనిపించాను. పైగా వూళ్లోవాళ్లు నేను చాలా సుఖపడిపోతున్నానని అతడికి చెప్పారు. దీంతో అతడు నా జీవితంతో తన జీవితాన్ని పోల్చి చూసుకున్నాడు.

నా జీవితంలోనుండి తను నిష్క్రమించినందువల్ల నేను పోగొట్టుకుంది ఏమీ లేదని అతడికి అర్థమైంది. అతడిలో నాపట్ల ఈర్ష్య, అంతర్గతమే తనలో వున్న అసంతృప్తి రెట్టింపైనాయి.

పరాయి ఆడదాన్నిగా భావిస్తున్న నాపట్ల కోరిక తలెత్తింది. నా అందం కొత్తగా పిచ్చివాణ్ణి చేసింది. ఇవన్నీ ఒక ఎత్తు... నేను అనుభవిస్తున్న మాతృత్వం ఒకఎత్తు. తను తృణీకరించిన బిడ్డ నాకిప్పుడు వరమయ్యాడు.

అతడిలో పితృత్వాన్ని పొందాలన్న తపన ఎక్కువైంది. స్వార్థం తలెత్తింది. నా కొడుకును, అదీ తన బిడ్డేనని రూపురేఖలతోసహా వూరందరి సాక్ష్యం వుంది గాబట్టి వాణ్ని సొంతం చేసుకోవాలని తద్వారా నన్ను బుజ్జగించి తీసుకెళ్లి తన అవసరాలకి నన్ను ఉపయోగించుకోవాలనీ తహతహలాడుతున్నాడు.

ఇంకోటి కూడా! తను నన్ను అన్యాయం చేసి వెళ్లాడూ, దాని ఫలితమే పాపమై తన కొత్త జీవితంలో సుఖశాంతులు లేకుండా చేసింది అన్న భావం అతడి మనసు మారుమూలల్లో ఎక్కడో వుండివుంటుంది. ఇప్పుడు ఇలా నన్నూ నా బిడ్డనీ తీసుకెళ్ళి ఆ పాపాన్ని పోగొట్టుకోవచ్చన్న ఆశ, ఆరాటం తలెత్తి వుంటాయి.

ఇప్పుడు వూరంతా అతని పక్షాన వుంది గాబట్టి బలవంతంగానైనా అజిత్‌ని ఎత్తుకెళ్లవచ్చన్న ధైర్యం అతడిలో ప్రవేశించింది. ఇంతగా నన్ను ప్రాధేయపడుతున్నాడంటే ఈ అందమైన శరీరాన్ని వదిలిపెట్టి వెళ్లలేక.

నిట్టూర్చాను.

ఇప్పుడు ఈ సమస్యకి పరిష్కారమార్గం ఆలోచించాలి. అదీ చాలా త్వరగా. అతడి బారినుండి నా బిడ్డను రక్షించుకోవాలి. అజిత్ లేకపోయినా బతకగలిగేంతస్థయిర్యం లేదు నాకు.

ఏం చెయ్యాలి నేను.

నాకు తెలీకుండానే ఎడమకంటినుండి ఓ కన్నీటిచుక్క కణతమీదుగా జారి దిండులోకి ఇంకిపోయింది.

"అమ్మా..."

చిన్న ఉలికిపాటు నాలో...

అజిత్ చెయ్యి నాగుండెలమీదుగా చెంపమీదికి పాకింది.

"అజ్జూ... నిద్రపోలేదా నాన్నా?"

"ఉహూ..."

"ఇంకా మేలుకునేవున్నావా?" ఆశ్చర్యంగా అడిగాను.

ఓవైపు సుధ పసిపాపలా ముడుచుకుని పడుకుంది.

"అమ్మా... శ్రీకాంత్ వచ్చివెళ్లాడుకదా?"

"అజ్జూ..."

"అందుకే నువ్విలా వున్నావుకదూ?"

"... ..." ఏం చెప్పగలను మానసికంగా రెట్టింపు వయసుతో దర్శనమిస్తున్న బిడ్డకి.

"నన్ను తీసుకువెళ్లిపోతానన్నాడు కదూ?"

"అజ్జూ..." ఎప్పుడు ఏడ్చాను ఇలా చివరిసారిగా, నాకైతే గుర్తులేదుగానీ వాడి చిన్ని చేతుల్లో మొహందాచుకుని చప్పుడు పైకిరాకుండా ఏడుస్తున్నాను.

"భయపడకమ్మా, ఆయనతో నేను వెళ్లను. నువ్వు ఏడవకమ్మా. నువ్వు నిద్రపో. నన్ను ఆయన తీసుకెళ్లలేడు" అనునయంగా ఓదార్పుగా ధైర్యంచెబుతున్నాడు నాబిడ్డ నాకు.

ఎప్పుడు ఆదమరచి నిద్రపోయానో నాకేతెలీదు.

ఆ వేకువ జామున మళ్లీ వచ్చాడు శ్రీకాంత్.

మంచినిద్రలో వున్ననాకు మెలకువవచ్చేనరికి అజిత్‌ని బుజ్జగిస్తూ లాలిస్తూ నన్ను వాడిని తానెంత అపురూపంగా చూసుకుంటాడో చెబుతున్నాడు.

అజిత్ చాలా నిదానంగా నెమ్మదిగా "నేను

౼ాను'' ఖచ్చితంగా చెబుతున్నాడు.

ఇంతలో నేను మేలుకోవడం గమనించి రెచ్చిపోయి "ఇదేనా నీ నిర్ణయం? బాగా ఆలోచించావా?" అతడిలోని స్వార్థం రాక్షసత్వంగా మారుతోంది.

"అనవసరంగా రెచ్చిపోకు శ్రీకాంత్... సమయం ఇవ్వు. అంతత్వరగా నేను జీవితంతో రాజీపడలేను" నెమ్మదిగా అన్నాను.

విజయగర్వంగా నవ్వాడతడు "జీవితంలో పరిస్థితులతో కాదు నువ్వు రాజీపడాల్సింది. నాతో... గుర్తుంచుకో' అన్నాడు.

"ఈరోజంతా గడువు ఇవ్వు నాకు" అడిగాను.

"సరే, గుర్తుంచుకో- రేపు వేకువజామున ఇదే సమయానికి వస్తాను. ప్రయాణానికి సిద్ధంగావున్నావా సరే... లేదా ఏంచేస్తానో చెప్పను.. చేసిచూపిస్తాను" నా బలహీనతను గమనించిన అతడు కర్కశంగా చెప్పాడు.

తరువాత వెళ్లిపోయాడు.

"అమ్మో... రాక్షసుడిలావున్నాడు" అన్న సుధ భయకంపిత స్వరం విన్నాకగానీ గమనించలేదు తను మేలుకుందని.

"ఏమిటక్కా" ఆందోళనగా అంది.

వివరంగా చెప్పాను.

"అయ్యో - ఏంచెయ్యాలి. అన్నివైపుల్నుంచి బంధిస్తున్నాడే. రాజీపడటానికి సిద్ధపడుతున్నావా అక్కా? ఏమిటి ఆలోచన?"

"మనిషి ఏపరిస్థితుల్లో ఇలా దాక్షిణ్యరహితంగా మారిపోతాడా అని ఆలోచిస్తున్నాను. పదేళ్ళక్రితం నాకు తెలిసిన శ్రీకాంత్ ఇతడుకాడు. చాలావరకూ అతడు స్వచ్ఛంగా వుండేవాడు..."

సుధ మాఇద్దరివైపు మార్చి మార్చి చూస్తుండిపోయింది.

ఇంకా సరిగ్గా అయినా తెల్లవారలేదు.

సుధ హటాత్తుగా లేచి వడివడిగా వెళ్లిపోయింది.

నేను ఆలోచిస్తున్నాను- పట్టపగలు తనతో నన్ను తీసుకువెళ్లే ధైర్యంలేక చీకటి విడకముందే ప్రయాణానికి సిద్ధంగావుండమని హెచ్చరించి వెళ్లిన శ్రీకాంత్ దుర్బలతను గురించి.



తెల్లవారింది.

నేనూ, అజిత్ మామూలుగానే స్కూలుకి వెళ్ళివచ్చాం.

సాయంత్రం అయింది.

అయిదుగంటలప్పుడు వచ్చాడు వినోద్.

"సీతా... సుధ నాకంతా చెప్పింది. నువ్వు ఇంకా ఇంకా క్షోభని అనుభవించడం నేను భరించలేను" ఆర్ద్రంగా అన్నాడు.

"నేను క్షోభపడుతున్నానని నువ్వెందుకు అనుకుంటున్నావు వినోద్?"

"నిన్ను నువ్వు మభ్యపెట్టుకోవద్దు సీతా"

"లేదు వినోద్... లేదు- నన్ను నేను నిజంగా మభ్యపెట్టుకోవడంలేదు. నేను అబద్ధం చెప్పడంలేదు. ఈ సమస్యకి పరిష్కారం ఆలోచిస్తున్నాను"

"లభిస్తుందనే అనుకుంటున్నావా?"

"ప్రతి సమస్యకీ ఓ పరిష్కారం అనేది వుంటుంది వినోద్- ఆ సమస్య ఎంత పెద్దదైనా సరే!"

"ఇంకా ఆలోచించే సమయం వుందనే అనుకుంటున్నావా?"

అజిత్ మా సంభాషణ వింటున్నాడు.

"ఈ కొన్ని గంటల్లోపల పరిష్కారాన్ని కనుగొనగలవనే ఆశవుందా?"

"ఉంది" అన్నాను- "మనిషి ఆశాజీవి కదా?"

అతడు ఆవేదనగా చూశాడు.




ఇంతలో సుధ వచ్చింది.

"ఇంకా ఎందుకు వినోద్ ముసుగులో గుద్దులాట... నీ మనసులో మాట చెప్పు" అంది.

నేను వినోద్‌వైపు చూశాను. అతడు రాత్రి ఏదో చెప్పాలని ప్రయత్నించి చెప్పలేకపోవడం గుర్తొచ్చింది.

అతడు ధైర్యం కూడగట్టుకుంటున్నట్టు చూశాడు.

తరువాత నిబ్బరంగా ఒక్కోమాటే పలకసాగాడు- "సీతా... ఇదంతా నామూలంగా ఉత్పన్నమైన సమస్య..."

"కాదు కాదు..." నేను అడ్డుపడబోయాను.

"దయచేసి కాసేపు నేను చెప్పేమాటలు విను... తరువాత మాట్లాడు" వేడుకుంటున్నట్టన్నాడు.

"సరే... చెప్పు"

"నామూలంగా వచ్చిపడి నీ జీవితాన్ని అతలాకుతలం చేస్తున్న ఈ సమస్యని నేనే పరిష్కరించాలనుకుంటున్నాను! అయితే సీతా ... నువ్వు నన్ను కరుణించాలి, ఒప్పుకోవాలి... నాకోసం కాదు, నీకోసంకాదు... బాబుకోసం! సీతా... మనం పెళ్లి చేసుకుందాం. అప్పుడు శ్రీకాంత్ ఏమీచెయ్యలేడు! అవమానంతో పారిపోతాడు..."

నేను నవ్వాను.

"సీతా..." అన్నాడతడు.

"నీ అభిమానానికి, నాకు సహాయం చెయ్యాలన్న నీ తపనకి, నా బిడ్డపట్ల చూపిస్తున్న మమకారానికీ కృతజ్ఞురాలిని వినోద్. ఒక మనిషికి నిజంగా ఈమాత్రపు స్పందించే మనసు, సాటిమనిషిని ఆదుకోవాలన్న తపనా వుండటం మానవత్వపు కనీసపు లక్షణం. కానీ ఈ పెళ్ళి అనేదానికి నేనుసిద్ధంగా లేను!"

"సీతా... స్వార్థంతోకాదు ఈ కోరిక కోరుకుంటున్నది! నీకు ఇష్టంలేనిది నిన్ను తాకనైనా తాకను..." దీనంగా అన్నాడతడు.

"అక్కా... ఒప్పుకో..." సుధ దాదాపు ఏడుస్తోంది.

"ఎంత పిచ్చివాళ్ళు మీరు? ఈ సమస్యకి ఇది పరిష్కారం ఎంతమాత్రమూ కాదు. ఈ పెళ్ళి జరిగినంతమాత్రాన శ్రీకాంత్ ఓటమిని అంగీకరించి భయపడి వెనుదిరిగిపోతాడని ఎందుకు అనుకుంటున్నారు? అతడింకా రెచ్చిపోతాడు. మనల్ని సమర్థించలేని ఈ అమాయకపు మనుషులు అతణ్ణి ఇంకా రెచ్చగొడతారు. అప్పుడు ఫలితం చాలా దారుణంగా వుంటుంది. అది ఆలోచించండి..." విడమరచి చెబుతున్నట్టన్నాను.

"అప్పుడు అంతగా తప్పనిసరైతే ముగ్గురం కలిసి చచ్చిపోదాం" ఆవేశంగా అన్నాడు వినోద్.

"చచ్చిపోవడానికి సిద్ధపడినప్పుడు ఇంత బాధపడటం... ఈ పెళ్ళి... ఆ తరువాత ఆ గోలా ఎందుకు వినోద్? నాకు సుఖంగా సాటిమనుషులతో సఖ్యంగా వాళ్లని అర్థం చేసుకుంటూ సహజీవనం సాగించాలని వుంది"

"అక్కా" సుధ వేడికోలుగా అంటుది.

"అజిత్! నువ్వన్నా అమ్మకి చెప్పమ్మా" బాబుని దగ్గరికి తీసుకుని పసి పిల్లాడు పెద్ద మనిషిని అడిగినట్టు అడిగాడు వినోద్.

"అమ్మకి అన్నీ తెలుసు అంకుల్" స్థిరంగా చెప్పాడు అజిత్.

నేను నవ్వితే వాళ్ళిద్దరూ కళ్ళప్పగించి చూశారు వాడివైపు.

"అయితే ఒప్పుకోనంటావు"? నిస్పృహగా అడిగాడు వినోద్.

"ఒప్పుకోకపోవడం కాదు. ఈ సమస్యకిది పరిష్కారం ఎంత మాత్రమూ కాదు అని నిన్ను గుర్తించమంటున్నాను."

వినోద్ లేచాడు "సరే సీతా! నువ్వేం పరిష్కార మార్గం ఆలోచిస్తావో నాకు తెలీదు. శ్రీకాంత్‌ని ఎదుర్కొనే అన్ని ఏర్పాట్లతో నేను సిద్ధంగా వుంటాను. ఎలా జరగాలని వుందో అలా జరగనీ..." అంటూ వెళ్ళిపోయాడు వినోద్.

సుధ ఏడుస్తూ అంది " ఆ దుర్మార్గుడు ఊళ్ళో వాళ్ళందర్నీ కూడ గట్టుకుంటాడు. రేపు అడ్డమొస్తే వినోద్‌నీ నిన్నూ రాళ్ళతో కొట్టి చంపి అజిత్‌ని ఎత్తుకెళతాడు..."!

నేనేం మాట్లాడలేదు.

చీకటి పడింది. సుధ అలసిపోయిన

దానిలా పడుకుంది.

ఇంట్లో దీపం వెలిగించలేదు.

నేనూ, నా ఒళ్ళో అజిత్...

ఇద్దరం ఆలోచిస్తూ....

అలా ఎంత సేపో....

హఠాత్తుగా "అమ్మా..." అన్నాడు అజిత్!

"ఏం నాన్నా"?

"నాకు నువ్వు నీకు నేనూ కావాలి గదమ్మా"?

"అవున్నాన్నా"!

"మనకీ ప్రపంచం కావాలి గదా"?

"అవును"

"ప్రపంచం ఈ వూళ్ళోనే వుందా అమ్మా"?

"అజ్జూ.."

"మనమే ఈ వెళ్ళిపోదాం అమ్మా"

"బాబూ" కంపిత స్వరంతో అన్నాను.

"ఈవూరి మీద కోపంతో అనడం లేదునేను. ఏ వూరెళ్ళినా ఇలాంటి మనుమలే కాదూ వుంటారు? మనమే ఈ వూరినుండి వెళ్ళిపోదాం అమ్మా...."

త్రుళ్ళిపడి లేచింది సుధ.

"వీళ్ళంతా అమాయకులంటావు కదమ్మా నువ్వు. శ్రీకాంత్,వినోద్,నాగరాజు,సుధ అంటీ అందరూ అమాయకులే. అందుకే వాళ్ళంతా బాధ పడుతున్నారు. మనల్ని బాధ పెట్టాలని చూస్తున్నారు. మనం నవ్వుకుంటూ ఇంకో వూరెళ్ళి పోదాం. శ్రీకాంత్ మనల్ని తెలుసుకోలేని వూరెళ్ళి పోదాం"అజిత్ నచ్చచెబుతున్నట్టంటున్నాడు.

కాసేపు నాకేం పాలుబోలేదు. వాడి మాటలు ఎంత సబబుగా వున్నాయో నాకు తెలుసు.

ఏమన్నాడూ?

'ఈవూరేనా ప్రపంచం'? అంటున్నాడు.

'ఈవూరి బయట కూడా ప్రపంచం లేదూ? అంటున్నాడు.

భాషలో వ్యక్తపరచటం వాడికి చేతగావటం లేదుగానీ 'సమాజానికి సహకరించాలన్నా సమాజాన్ని ఉద్ధరించాలన్నా ఏవూరైనా ఒక్కటే, అంతా ఒకే మనుమలు వున్నారు, అంటున్నాడు.

ఎంత నిజం?

"అమ్మా! మనకి డబ్బులేదని ఆలోచిస్తున్నావా? తాతయ్యనడుగుదాం! తప్పేముందే? మన తాతయ్యేగా! మన వాళ్ళని మనం అడగటంలో తప్పేముంది"?

"వాడిని గాఢంగా గుండెలకి అదుముకున్నాను" డబ్బు ఇబ్బంది లేదురా! గోపాలరావు గారు ఓ పెద్ద మొత్తం ఇచ్చే వెళ్ళారు. పద! వెళ్లిపోదాం. విశాల ప్రపంచంలోకి వెళ్లి కొత్త అనుభవాల్ని ప్రపంచంతో కలసి పంచుకుందాం" అన్నాను.

"అమ్మా" సంతోషంగా అన్నాడు అజిత్ నాబుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ.

"అరే" బావురుమంది సుధ "మిమ్మల్ని వదిలినేను వెళ్ళాల్సివస్తుందని బాధపడ్డాను. నన్నొదిలి మీరే వెళుతున్నారా?"

"పిచ్చి! ఎక్కడికి వెళతావు!కళ్ళువిప్పిచూస్తే మంచి మనసుతో పాటు ఇలాంటి అక్కలు ఎందరో కనిపిస్తారు నీకు ఈ ప్రపంచంలో. ఈదూరం భౌతికమయినదేకానీ మానసికమైనదికాదుగా. ధైర్యం తెచ్చుకుని మేం ఇక్కడి నుండి బయటపడే ఏర్పాట్లు నువ్వే చూడాలి" అని ఓదార్చాను.

సుధ దుఃఖాన్ని దిగమింగుకుని లేచింది.

"వినోద్‌తో ఈవిషయం చెప్పద్దు అతడు ఆవేశంలో వున్నాడు. అడ్డుపడవచ్చు, రేపు ఇలా చెప్పకుండా వెళ్ళిపోయినందుకు సీతా, అజిత్ క్షమించమన్నారని చెప్పు. నాగరాజుని కూడా అడిగామని చెప్పు" అన్నాను.

దుఃఖాన్ని దిగమింగుతూ వెళ్ళి పోయింది సుధ.

ఇప్పుడు నా మనసు నిర్మలంగా వుంది. కొత్తరెక్కలు వచ్చినట్టనిపిస్తోంది. లేచి గబగబ అన్నం వండి అజిత్‌కి పెట్టాను, నేనూ ఇంత తిన్నాను.

ఎక్కడో పుట్టాను...

ఇంకెక్కడో పెరిగాను...

ఇక్కడో పదేళ్ళు వున్నాను.




ఇప్పుడు మరోచోటు.

ఈ చిన్న జీవితంలో ఇలాంటి మజిలీలు కొన్ని చెయ్యాల్సి వుంటుందన్న విషయం విస్మరించి వూరు వదిలి పోవడానికి ఇంత కాలం బాధపడ్డాను.

ఈ ఊరే ప్రపంచంకాదు, ప్రపంచంలో ఇదొక వూరేనన్న విషయం గుర్తొచ్చేలా చేశాడు అజిత్.

ఇక బాధ ఎందుకు?

సమాజాన్ని అర్థం చేసుకుని వాళ్ళల్లో కలిసిపోయి బ్రతకడమే నేను కోరుకునేది.

'ఆ సమాజం ఇక్కడేకాదు, ఎక్కడైనా వుంది' అంటున్నాడు అజిత్.

ఎంతైనా మనిషివి కాబట్టి ఈ వూరితో ఈ అమాయక జనంతో ఏర్పడిన బంధాన్ని తెంచుకు వెళ్ళాలంటే ఓ వైపు బెంగగా వుంది.

నా సూట్‌కేసూ అజిత్ బ్రీఫ్‌కేసు తప్ప మరే వస్తువూ ముట్టుకోలేదు.

డబ్బు చేతిలో వుంటే ఈ ప్రపంచంలో దొరకనిదేం వుందని?

ఆ రాత్రి...

పదిగంటలప్పుడు వూరిని వదలాల్సి ఎక్కబోతుండగా "అమ్మా! దాహంగా వుందే" అన్నాడు అజిత్.

టక్కున గుర్తొచ్చింది బావి...

చప్పున వాడిని తీసుకుని అటువైపు నడిచాను.

ఎప్పుడూ అక్కడే వుండేచేద వుంది. దాంతో నీళ్ళు తోడాను.

దోసిళ్ళతో తాగాడు అజిత్.

నేనూ తాగాను.

కొద్ది క్షణాలక్కడ నిలబడ్డాను.

బావి...

నాకెంతో ప్రియమైనది...

నా జీవితానుభవాలకి ఒక సాక్షి...

దానికి ప్రాణం లేకపోవచ్చు...

దాన్లోవున్న నీళ్లకి మాటలు రాకపోవచ్చును...

నా ఆలోచనల్ని మనుషులకంటే ఎక్కువగా ఈ బావికి నివేదించుకునేదాన్ని.

నాకు ఈ చిన్న జీవితంలో ఎదురైన ప్రతి అనుభవం వెనుకా, నేను ఎదుర్కొన్న ప్రతి సంఘటన పక్కనా ఈ బావి వుంది.

అది విడదియ్యరాని బంధం...

అక్కడినుండి కదులుతుంటే ఒక్కకన్నీటి చుక్కరాలి బావిలో పడింది.

ప్రస్తుతానికి వీడ్కోలు నేస్తం. ఎక్కడైనా, ఏ వూళ్ళోనైనా నేనుంటాను, నీకు నా హృదయపూర్వక స్వాగతం అన్నట్టు చిన్నగా చప్పుడు చేస్తూంది బావిలో నీరు.

టాక్సీ ఎక్కేముందు "సుధా" అన్నాను ఆత్మీయంగా.

"అక్కా" అంది సుధ నాచెయ్యి పట్టుకుంటూ.

నిర్మలంగా నిశ్చలంగా వుందా అమ్మాయి కంఠం ఇప్పుడు.

"మీరు మామూలు మనుషులుకారక్కా, కారుచీకటిలో ప్రకాశించే చిరుదివ్వెలు, మీరెక్కడుండే అక్కడ వెలుగువుంటుంది. అజ్ఞానం అనే చీకటిని అది పారద్రోలుతుంది. నాలాంటి మూర్ఖుల మనసుల్లో జ్ఞానాన్ని నింపడంకోసం మీలాంటి వాళ్ళను ఈ సృష్టి ప్రసాదిస్తుంది. మీరెక్కడికి వెళ్ళటంలేదు. మా మనసుల్లో నిలిచిపోతారు. అది గ్రహించలేని అమాయకురాల్లా బాధపడ్డాను. వెళ్ళిరా అక్కా, వెళ్ళిరా అజ్జూ! వెళ్ళిరండి! ఈవిశాల విశ్వంలోకి మీకు వీడ్కోలు చెబుతున్నాను మనస్ఫూర్తిగా".

అజిత్ సుధ బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు! సుధ చెయ్యి ఆప్యాయంగా నొక్కి అజిత్‌తో టాక్సీలో కూర్చున్నాను. విశ్రాంతిగా నేను వెనక్కి చేరగిలబడితే అజిత్ నా ఒళ్ళో తల వుంచుకుని "నిద్రోస్తోందమ్మా" అన్నాడు.

"నిద్రపోనాన్నా నిద్రలో కమ్మని కలలు కను" అన్నాను వాడి బుగ్గలు నిమురుతూ.

సుధ చెయ్యెత్తి వీడ్కోలు చెబుతుండగా... టాక్సీ కదిలింది చీకట్లో చిరుదివ్వెలా, సుధ అన్న ఈ విశాల విశ్వంలోకి మిమ్మల్ని తీసుకుని!!!



# నేడే కొనండి!!





ఈ రోజుల్లో ఓ సినిమాతారో, ప్రఖ్యాత క్రీడాకారుడో కనీసం ఓ అందమైన అబ్బాయో, అమ్మాయో ఆడుతూ పాడుతూ చెబితేగాని ఎవరూ ఉప్పుకూడా కొనడంలేదు. ఈ ప్రకటనలయుగంలో కరివేపాకు నుండి కంప్యూటర్లవరకూ ప్రతివస్తువుకీ వేలు, లక్షలు ఖర్చుపెట్టి ప్రకటనలు ఇవ్వడం సర్వసాధారణమైపోయింది. ఉత్పత్తిదారులకు తమ వస్తువుల నాణ్యతమీద ఉన్న శ్రద్ధకంటే ఎంత అందంగా, ఆకర్షణీయంగా టీవీలో, రేడియోలో, పత్రికలో ప్రకటనలు గుప్పించి అమ్మకాలు పెంచుకుందామన్న ఆలోచనే ఎక్కువ. ఈనాడు ప్రకటనల జడివాన జోరుగానేవున్నా వెనకటికాలంవారు కూడా ఈ విషయంలో మరీ వెనకబడిపోలేదు. ఆ రోజుల్లో వారు ప్రకటనల్లో ఉపయోగించిన భాష, పద్ధతులూ చాలాచిత్రంగా ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని ప్రకటనలు చదివి ఆనందించండి.

1893 సం॥ నవంబర్ & డిసెంబర్‌లకు
చెందిన 'సత్యసంవర్ధని' అనే పత్రికలో ఈప్రకటన వెలువడింది.

## :GAROWA CHOORIES:

### చిత్రమయిన గాజులు

ఈకంకణములు జర్మనీలో తయారుచేయబడినవి. వీనియందు వజ్రములు, కెంపులు, పచ్చలు, ముత్యములు– మున్నగు రాళ్లవలె ప్రకాశించు కరవకరాళ్లు చెక్కబడియున్నవి. ప్రతికడియముకు కొక్కెమమర్చబడియున్నది. సులభముగ చేతనుంచుకొనవచ్చును. ఈ కడియములు అందరు స్త్రీలు ధరించుకొనవచ్చును. ఇప్పుడు పై విధమున తయారుచేయబడిన కంకణములు నిజమయిన వజ్రములు మొదలగువానితోజేయబడిన యెడల జత 1,000 రూ॥లు ఖరీదు తేలును.

ఈకంకణము అమర్చబడిన పెట్టె మూత తీయునప్పుడు కంకణముల కాంతివల్ల కండ్లు మిరిమిట్లు గ్రమ్మును.

ఈప్రకటన కలకత్తాలోని మీర్జాపూర్ వీధిలో గల హారీ అండ్‌కో వారిది.



1905వ సం॥ ఆగస్టునెల 'సువర్ణలేఖ' పత్రికనందు,
దాని అధిపతులు ఈ విధముగా ప్రకటించారు.

దేశభాషలందు గౌరవముగలవారనియు ను, గృహస్థులనియును గొందరికి మేము వారి కోరికలేకయే మా పత్రికపంపుచుంటిమి. అట్టి వారిని తమకు పత్రికయక్కరలేనియెడల నాయుద్దేశము తెలుపవలెననియు లేకున్న ముందు నంచికను వి.పి. పోస్టుద్వారా పంపించెదమనియు వేడుకొంటిమి. వారి మౌనము నంగీకారముగా గ్రహించి వి.పి.లను పంపుచుంటిమి.... కొందరు త్రిప్పివేయుచు న్నారు... ఇట్టి స్థితిలో ఈ క్రింది సంగతులతో విద్యాధికుండగునొక గృహస్థునినుండి ఒక వింతకార్డు వచ్చినది.

ఆ కార్డుఇది.

'సువర్ణలేఖ' పత్రికాధిపతికి,

అయ్యా,

నేను కోరనిదే నాకు మీ పత్రికాప్రతులు రెండు మూడు పంపించినారు. తరువాత పత్రి కను వి.పి.గా పంపినారు. నేనింటలేనప్పుడది రాగా నా బాలుడు దానిని చింపుటచేత పోస్టు బంట్రోతు వి.పి.రూల్సు ప్రకారము రెండు రూపాయలియ్యమని నిర్బంధపెట్టినాడు. బోన ఫైడు ఆర్డరులేకుండా వి.పి. పంపుట నేరమని మీకు తెలిసియుండవలెను. మీరు దయతో నా రెండురూపాయలు పంపెదరా లేక నేనా విష యమయి మీపైని వ్యవహారము జరుపవ లెనా?

నేనుందును.
అయ్యా
మీ విశ్వాసి



1947 వ సంవత్సరంలో వెలువడిన
'ఆంధ్రశిల్పి' అను పత్రికలోనిది ఈ ప్రకటన.



**కోహినూర్ రత్నములు**

**కోహినూర్ పన్నీరు:** దీనిగుణము: అయిదా రు చుక్కలు కోహినూర్ పన్నీరు మీచేతిగుడ్డ యందు చల్లిన మీరు గులాబీవనము నందుండు చందమున మనస్సునకానందము గలిగించును.

1937వ సం॥ము మే నెల 'గృహలక్ష్మి'లో వెలువడిన ఒక హొటల్ ప్రకటన ఇది.

## శాస్త్రి హొటలు అనగానేమి

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు పుట్టి నిల్లు. వీర్యబలమునిచ్చు మధురపదార్థము లు, చలిదేశమునకు అనుకూలము అయిన శయ్యాగృహములు, దంపతులకు తగిన ఏర్పాట్లు కలవు.

శాస్త్రి హొటల్, 89-చిక్‌పేట, బెంగుళూరు.



1923 వ సంవత్సరం 'ఆంధ్రపత్రిక'
సంవత్సరాది సంచికలో ఒక ఔషధ ప్రకటన ఇది.

## అల్లో- ప్రాతఃకాలవందనము

నేనెవరో మీరెరుగుదురా?
నేను ఔషధములకు రాజును. నాపేరు పూర్ణ
చంద్రోదయము. నేను మీవద్దకు ఉదయము,
సాయంత్రము25దినములకువచ్చుటకుఛార్జీలు
రూ. 25 /-, నా ప్రయాణపు ఖర్చులు ప్రత్యేక
ము. పలువిధ చర్మవ్యాధులు, సకల కుష్టము
లు, నపుంసకత్వము, కొరుడు, వంధ్యత్వము
మొదలగు వాటికి నేనే సైన్యాధిపతిని... నాకు
గాని, నా సహాయకులకుగాని ఖాయమైన నివా
సస్థలము పరంజ్యోతి మెడికల్‌హాలు, మద్రా
సు. సదరు పరంజ్యోతి మెడికల్‌హాలు 100
సం॥కు మునుపు మహారాష్ట్ర ఆస్థాన వైద్యులు
గనుండినది.

మంచిది సోదరీమణులారా! నను గురించి
కాని, నా సహాయకుల గురించికాని నేడే విచా
రించి తెల్పికొనుడు. నాకాలము మిక్కిలి
అమూల్యమైనది. నాకు ఆలస్యమగుచున్నది.

వందనములు

నా నివాసస్థలము,
పరంజ్యోతి మెడికల్ హాలు,
109, తంబుశెట్టి వీధి,
జార్జిటౌను, మద్రాను.



1918వ సంవత్సరం ఫిబ్రవరి
'హిందూసుందరి' పత్రికలో మద్రాను ఓటో మోహినిడిపోవారు ఇలా ప్రకటించారు.

## ఎచ్చరిక

ప్రస్తుత కాలమున నకళ్లను, మోసములు మెండుగనున్నవి. కావున ఎచ్చరిక ఎచ్చరిక. బంగారు, వెండిమెడలులు ఒనంగబడిన ఓడె మోహిని రోబినియా ఆయలు వాడుడు. వీటిని మీచేత నుంచిన ఒక సుగంధ పుష్పముల ఉద్యానవనమును మీవద్ద నుంచినట్లగును.




1904వ సంవత్సరములో పులుగుర్త లక్ష్మీనరసమాంబ
సంపాదకత్వమున వెలువడిన 'సావిత్రయమ' పత్రికలోని గ్రంథప్రకటన ఇది.




## కాశీమజిలీలు

ప్రథమభాగము 240 పేజీలు, వెల: 1-00

ఈ గ్రంథమిదివరకు ఆంధ్రభాషలో లేదు. కాశీమజిలీల కథలవంటి అత్యద్భుత చమత్కార కథాభూయిష్టమైన కథలు తెనుగువారిలోనే లేవు. అరేబియన్ నైట్స్‌కంటే వేయిరెట్లు చమత్కారముగనుండును. ఒక్కొక్క కథ జది వినగాని యాగ్రంథమందలి కథాచమత్కారము తెలియదు. ఇది ప్రచురింపవలెనని మేమెన్నాళ్ళనుండియో భగీరథప్రయత్నములు చేయగా ఆంధ్రుల పూర్వపుణ్యముననిది నేటికి సమకూడినది. ఈ కథలు చదివిన కడుపు చెక్కలగునట్లు నవ్వువచ్చును. ఇది ఇంగ్లీషుచేసి ఇంగ్లాండు దేశమున నచ్చువేయుటకు యత్నించుచున్నాము.

1937 వ సం॥ము మే నెల 'ప్రకృతి' లోని ప్రకటన ఇది.

## అందరూ వైద్యులు కావాలి

ఎందుకు?– ఒకరు రోగులు– ఇంకొకరు వైద్యులు అవటం మానవజాతికే లోపం. అందరూ వైద్యులు కావాలి. రోగాలుపోవాలి. ప్రకృతి ధర్మం వ్యాప్తి కావాలి. ఎట్లు? ప్రకృతి గృహవైద్య పాఠములు చదవండి. ఇంతకంటె సావకాశం దొరకదు.



1914 సంవత్సరం ఫిబ్రవరి నెలలో మహబూబ్‌నగర్ నుండి వెలువడిన 'హితబోధిని' అనే పత్రికలో వెలువడిన ప్రకటన ఇది.

## టానిక్ కాఫీ

కంటికిని మెదడునకు తంపు గలిగించి శరీరమును వెచ్చగానుంచును. బలము, వీర్య స్థంభనము గలిగించును. అద్భుతమైన ఆకలిని కలుగజేయును. బిస్కట్, గోధుమ పూరీలు దొరకని పక్షమున పిడికెడటుకులు, పాలలో నానవేసి చక్కెరను జేర్చి అవి భక్షించిన పిదప ఈ కాఫీ పుచ్చుకొనవలయును. రుచికి రుచి, శుచికి శుచియన్నట్లు ప్రాతః స్నానముజేసి కాఫీయుక్తమయిన ఫలహారము జేసిన ఆరోగ్యము గలుగుటయేగాక ఈ కాఫీ సంభోగేచ్ఛసహా కలిగించును.

వలయువారు 'హితబోధిని' ఆఫీసు నుండి తెప్పించుకొనవచ్చును. డబ్బా 1 కి 8 అణాలు మాత్రమే. రూపాయికి తక్క వి.పి. పంపబడదు.



1912వ సం॥లో కాకినాడ నుండి వెలువడు 'సావిత్రి' అను పత్రికలోనిది ఈ ప్రకటన.



## శ్రీమదాంధ్ర మహాభారతము

పాఠకులు విలంబనము సహింపరను తలంపున సిద్ధమైనంతవరకుగల ప్రథమ సంపుటముగా నాది వర్వ సభావర్వములను ప్రకటించియున్నారము. మరియు నాంగ్లేయ భాషా. ప్రవీణులు ఖండఖండాంతరముల నుండివచ్చు నింగ్లీముపుస్తకములెంత పెద్దవియైయున్నను దేలికగానుండుటకై ఫెదర్‌వైట్ కాగితముల (పక్షిఈకలవలె దేలికయైనవి)పై ముద్రింపబడుటగాంచి వేడుకపడుచుండ నాయానందమును, సౌలభ్యమును నాంధ్రలోకమునకు గలిగింపవలెనను నూహతో గొన్ని ప్రతులధికవ్యయమూలకమైనను బాటింపక సిద్ధము చేయించితిమి. 'బైండు' కూడా దత్కళాభిజ్ఞుల పరీక్షకు జెక్కుచెదరక నిల్పియున్నది.

సేకరణ: బద్దిగం పాండురంగారెడ్డి




# జండు బామ్
## జలుబు, తలనొప్పి, బాధల్ని క్షణంలో పోగొట్టేది.

పొద్దుటి నుంచి సాయంత్రం వరకు పనివత్తిడి... దానికి తోడు జలుబు-రొంప కూడా పట్టుకు పీడిస్తూంటే, ఆ యాతన భరించలేం. అందుకే జండు బామ్. జలుబు-రొంప మాత్రమే కాదు, తలనొప్పి, నడుం నొప్పి, కీళ్ల నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు, వీటన్నిటి నుంచి ఉపశమనాన్నిస్తుంది. ఇటువంటి ఇంకే ఇతర బామ్ కన్నా ఎంతో ఎక్కువ ప్రభావం గలది.

రంగు లేనిది కావడం వల్ల మరకలు పడతాయేమోననే భయం లేదు. జిడ్డు లేనిది కావడం వల్ల, మీరు ఇంట్లోనైనా, బయటనైనా మాలిష్ చేసుకోవచ్చు. పైగా ఇది సువాసన గలది కూడా.

జండు బామ్‌ని తక్కువ మోతాదులో వాడితే చాలు. అంచేత ఇది పొదుపైనది. కోమలమైన చర్మాన్ని కూడా లాలిస్తుంది. అందుకే తల్లులంతా తమ కుటుంబం కోసం జండు బామ్ కావాలంటారు. కొనేటప్పుడు, సీసా మీద ఎర్ర సీల్‌ని చూసి మరీ కొనండి.

5, 10, 30, గ్రాములలో దొరుకుతోంది.




**జండు బామ్** నొప్పి హరించే బామ్

ULKA-Z-2-89 TEL




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

జూలై 'చతుర' నవల: చిరుదివ్వెలు

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

# చతుర ప్రపంచం



## డబ్బుల వర్షం

పదిహేనేళ్ళ క్రితం మిమూన్‌స్ట్రీట్‌లోని సుతార్‌ఛౌల్ అనే భవనం ముందు మధ్యాహ్నం మూడుగంటలవుతుండగా ఓ విచిత్రమైన సంఘటన జరిగింది. ఆ దృశ్యాన్ని కొన్ని వందలమంది నగరవాసులు నోరు తెరుచుకు చూస్తుండిపోయారు.

ఆ సమయంలో రోడ్డుపై జనం ఎక్కువగాలేరు. భవనానికి దగ్గర్లో రోడ్డు పక్కన చెప్పులు కుట్టేవాడు తనపాటికి తను పనిచేసుకుంటూ వున్నాడు. ఉన్నట్లుండి, ఎక్కణ్ణించో లెక్కించలేనన్ని వందరూపాయల నోట్లు ఓ వర్షంలా రోడ్డుపై కురవడం మొదలైంది. అవి ఎక్కడి నుంచి వస్తున్నాయో ఎవరికీ అర్థం కాలేదు. కానీ అది చూసిన ప్రతివాడూ ఎన్నిపడితే అన్ని దొరికినన్ని నోట్లు చేజిక్కించుకున్నాడు. ఆ గందరగోళంలో చిన్నా పెద్దా, ఆడా మగా తేడా లేకుండా కనీసం ఒక్కనోటైనా సంపాయిద్దామని ఎక్కడెక్కణ్ణించో సుతార్ భవనంకేసి రోడ్డుకడ్డంగా పరిగెత్తారు. ఆ వార్త నాలుగుమూలలకీ వ్యాపించడంతో, నగరంలో అన్నివక్కల నుండి జనం నోట్లకోసం సుతార్ భవనం దగ్గరికి చేరారు. కానీ, ఆ డబ్బునోట్లవర్షం రెండుమూడు నిముషాల్లోనే మొదలైనంత అకస్మాత్తుగా ఆగిపోయిందికూడా! పాపం, ఎంతో ఆశతో పరుగెత్తుకొచ్చిన జనానికి నిరాశే ఎదురైంది. అందులోనూ, ఆ నోట్లు నూటికి నూరుపాళ్ళూ మంచినోట్లేనని తెలియడంతో వారి నిరుత్సాహం మరింత పెరిగింది.

అంతలో యీ విషయం తెలిసి పోలీసులక్కడికి చేరారు. మొదట్లో పోలీసులకి జరిగిన విషయంపట్ల నమ్మకం కలగలేదు. పోలీసులని చూసి నోట్లు చేజిక్కించుకున్న జనం అక్కణ్ణించి వుడాయించారు. పోలీసులు రంగంలోకి దిగి అసలా డబ్బుల వర్షం ఎక్కడ, ఎలా మొదలైందో కూపీలాగడానికి ఆ దృశ్యం చూసిన జనాన్ని ప్రశ్నించారు. కానీ, ఒక్కొక్కరూ ఒక్కోరకంగా చెప్పారు. కొందరు నోట్లు గాల్లో కొట్టుకు వచ్చాయంటే, మరికొందరు ఆకాశంనుండి కిందరాలాయన్నారు. కానీ అందరి కథనం విన్నాక ఓ విషయం మాత్రం స్పష్టమైంది. నోట్లన్నీ సుతార్ భవనంవైపు నుండి వచ్చాయని, ఆ భవనం చుట్టూతా ఎదురుగా వుండే రోడ్డుపైనా చెల్లాచెదురుగా పడ్డాయని తెలిసింది. దాన్ని ఆధారంగా తీసుకుని పోలీసులు ఆ భవనం చుట్టూ వున్న ప్రదేశాన్ని గాలించారు. అక్కడికి దగ్గర్లోని చిన్న చిన్న సందుల్లోనూ, కాలువల్లోనూ కూడా వెతికారు- కనీసం ఒక్కనోటైనా కనబడకపోతుందా అని. కానీ వారి ప్రయత్నం ఫలించలేదు. చివరికి రోడ్డువక్కనున్న చెప్పులవాడి దగ్గరికె

ళ్ళి వాడి సామానులు వెతికారు. అక్కడ వాళ్ళకి ఓ నోట్లకట్ట దొరికింది. లెక్క పెడితే ముప్పైఆరు వందరూపాయల నోట్లు వున్నాయని తెలిసింది. నోట్లన్నీ నిజమైనవే. దాన్నిబట్టి డబ్బులవర్షం కురిసిందనేదానికి వాళ్ళకి ఋజువుదొరికింది.

కానీ చెప్పులు కుట్టేవాడు మాత్రం యిది




చూసి బిత్తరపోయాడు. తన పనిలో మునిగిపోయి, చుట్టూ జరిగేదేమీ తను గమనించలేదని, ఆ డబ్బులకట్ట తన సామానుల్లోకెలా చేరిందో తెలియదని వాపోయాడు. పోలీసులతని మాటలు నమ్మారు. ఎందుకంటే, నిజంగా చెప్పులుకుట్టేవాడే గనక ఆ డబ్బు విషయం గమనించి వుంటే అందరిలాగే అతను కూడా డబ్బుతోపాటు వుడాయించేవాడేగదా! అక్కణ్ణించి పోలీసులు ఆ భవనం చివరి అంతస్తుకి వెళ్ళారు. అక్కడ నడివయస్సులో వున్నాయన వాళ్ళని సాదరంగా లోపలికి తీసుకెళ్ళి డబ్బులవర్షం మిస్టరీని వివరించాడు.

ఆయన బొంబాయిలోని ఓ పెద్ద బట్టల వ్యాపారి. ఆ రోజు మధ్యాహ్నం భోజనం చేశాక ఆ రోజు తాలూకు జమాఖర్చులు రాసుకునే హడావిడిలో వుండగా, దుకాణం నుండి బ్యాంకులో జమకట్టడానికి తెచ్చిన పైకం పక్కనే టేబుల్‌మీద పెట్టాడు. అక్కడికి దగ్గర్లోనే నాలుగేళ్ళ వయస్సున్న ఆయన మనవడు ఆడుకుంటున్నాడు. మామూలు కాగితాలనుకుని ఆ కుర్రాడు ఓ పెద్ద వందరూపాయల కట్ట చేతిలోకి తీసుకున్నాడు. వ్యాపారి ఆ విషయం గమనించలేదు. ఈలోపు వాడు బాల్కనీలోకి వచ్చి నోట్లని గాల్లోకి విసురుతూ, అవి గాల్లో ఎగురుతుంటే తమాషాగా ఆడుకుంటున్నాడు. చేతిలో నోట్లు అయిపోయాక మరికొన్ని నోట్లకోసం వాడక్కడికి రాగానే, ఆయనకి విషయం అర్థమైంది. కానీ, అప్పటికే సమయం మించిపోయింది.

ఏమైతేనేం, చెప్పులవాడి దగ్గర దొరికిన ముప్పై ఆరు వందరూపాయల నోట్లు మాత్రం పోలీసులతనికి అప్పజెప్పారు. మిగిలిన నోట్ల విషయం అతను మర్చిపోకతప్పలేదు.

## జేడీ బొమ్మలు

సాధారణంగా జబ్బువడ్డ పిల్లలు డాక్టర్లిచ్చే మందులు వద్దని మారాం చేస్తారు. బిస్కెట్లు, చాక్లెట్లు, డబ్బుల ఆశచూపి అలాంటివారిని మందులు మింగేలా చేస్తాం. కానీ పెద్దపెద్ద ఆపరేషన్లు చేయాల్సి వచ్చినప్పుడు ఆసుపత్రి వాతావరణం చూడగానే బెదిరిపోయి లోపలికి రామని మొండికేస్తారు వారు. ఇలాంటి మొండి వైఖరిని అవలంబించే పిల్లలను ఏమీ చేయలేక, వారిలోని భయాన్ని ఎలా తొలగించాలో తెలియక అవస్థపడే తల్లిదండ్రులకి ఉపకరించేలా ఓ కొత్తపద్ధతి కనిపెట్టారు అమెరికన్ డాక్టర్లు. నిజానికి ఆటపాటలవల్లే పిల్లలకు ఏ విషయం పట్లనైనా సమగ్ర అవగా

హన ఏర్పడుతుందున్న సంగతి అందరికీ తెలిసిందే. ఏవిషయమైనా పుస్తకాల్లో చదివి నేర్చుకోవడం కంటే ప్రత్యక్షంగా చూసి తెలుసు కోవడంతో బాగా వంటబట్టడమే కాకుండా వాటిపట్ల వున్న సంకోచాలు, సందేహాలు పటా పంచలౌతాయన్న విషయాన్ని అమెరికావారు తమ ప్రయోగం ద్వారా రుజువుచేశారు.

ఓ బొమ్మ సహాయంతో బాలరోగులు భయాన్ని తొలగించి ఎలాంటి ఆపరేషన్లకయినా వారు మానసికంగా, శారీరకంగా సిద్ధపడేట్టుగా చేస్తున్నారు అమెరికాలోని టెక్సాస్ ఆసుపత్రి డాక్టర్లు.

పిల్లల ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న తన కొడుకు కోసం 1981లో జేడీ బొమ్మను తయారుచేసింది గైల్‌జైకా. ఈబొమ్మలు మగ, ఆడ రూపాల్లో ఉండటమే కాక మనుమల కుండే అవయవాలన్నీ కలిగివుంటాయి. ఐదేళ్ళ నుండి పన్నెండు సంవత్సరాలలోపున్న పిల్లల చేత వారికి జరగబోయే ఆపరేషన్‌ను ముందుగా ఈ బొమ్మలకు చేయిస్తారు అక్కడి డాక్టర్లు.

మొదటగా పిల్లలచేత బొమ్మలకి రక్తపరీక్ష, ఇంజెక్షన్ ఇవ్వడంలాంటివి ఎలా చేయాలో చూపిస్తారు. వాళ్ల శరీరంలో ఏ భాగమైతే జబ్బుకు గురి అయ్యిందో, కృత్రిమమైన ఆ భాగాన్ని బొమ్మలో చూపించి పిల్లలచేత ఆ అవయవానికి ఆపరేషన్ చేయిస్తారు. ఆపరేషన్ చేసి తొలగించేవి ఏమైనా వుంటే ఉదాహరణకి హెర్నియా, కంటిశుక్లాలు, గడ్డలు, మొదలైన వాటిని పిల్లలకు అర్థమయ్యేలా సున్నితంగా వారికి చెప్పి వారిచేతే బొమ్మనుండి వేరు చేయిస్తారు. బొమ్మల్లోని ఈ కృత్రిమమైన అవయవాలన్నీ రబ్బరు, స్పాంజితో తయారు చేసినవై వుంటాయి.

ఈ పద్ధతి ద్వారా పిల్లలకు వారి ఆపరేషన్ పట్ల వున్న భయం తొలగిపోతుంది.

రీసెర్చి కెమిస్టుగా పనిచేస్తున్న గైల్‌జైకా మొదటగా ఈ బొమ్మను తన కొడుకుకోసం తయారుచేసింది. ఆవిధంగా తన ప్రయత్నం ఫలించగానే కొంతమందిని తోడు చేసుకొని జేడీ కంపెనీని నెలకొల్పి ఈ బొమ్మల తయారీని ప్రారంభించింది. ఇలా ఇప్పటికి దాదాపు 600 బొమ్మలను, ఒక్కొక్కటి 160 పొండ్ల చొప్పున ఆకంపెనీవారు అమ్మారు. వీటిలో చాలావరకు పిల్లల ఆసుపత్రివారే కొనుగోలు చేశారు.

ఆడబొమ్మ ఎమిలీ, మగబొమ్మ ఎరిక్ టెక్సాస్ ఆసుపత్రిలో ఎంతోమంది పిల్లల భయాన్ని పోగొట్టి వారిని ఉత్సాహంగా ఆపరేషన్‌కు సిద్ధమయ్యేలా చేస్తున్నాయి.

గుడ్డిపిల్లలకు కూడా ఈ బొమ్మల ద్వారా వారి శరీరంలో వుండే అవయవాల గురించి,




మరెన్నో విషయాల గురించి తెలియజేస్తున్నారు.

టెక్సాస్ ఆసుపత్రిలో పిల్లలపై ఈ బొమ్మల్ని ప్రయోగిస్తున్న నర్స్ ఎయిసెన్‌మెన్, "ఆసుపత్రి అనగానే ఏదో మాంత్రికుడి మందిరంలా ఊహించుకుంటున్న పిల్లలకి వారిలోని భయాన్ని తొలగించడానికిగాను ఈ బొమ్మలు మాకు ఎంతో సహకరిస్తున్నాయ"ని అంది.

# అదృశ్యమైన అందాలబొమ్మ

"వాషింగ్ పౌడర్ నిర్మా, వాషింగ్ పౌడర్ నిర్మా... నిర్మా... నిర్మా" రేడియో, టి.వి.లో అందరూ ప్రతిదినమూ వినే, చూసే అడ్వర్టయిజ్‌మెంట్. సినిమాల్లో... అన్ని భారతీయ భాషల్లోనూ ఈ అడ్వర్టయిజ్‌మెంట్ దర్శనమి




స్తుంది. ఫ్రాకేసుకున్న ఓ ముద్దైన అమ్మాయి గిరగిరా తిరుగుతూ, మంచులో తడిసిన ముత్యంలా మెరిపోతూ నిర్మావాషింగ్ పౌడరువాడండి అని చెబుతుంది. మర్ఫీబేబీ, లిరిల్ సుందరాంగి, నిర్మా చిన్నారి - భారతీయ అడ్వర్టయిజ్‌మెంట్ ప్రపంచంలో మైలురాళ్లుగా నిలిచిపొయ్యాయి.

నిర్మా వాషింగ్ పౌడరు పేకట్లమీద ముద్దులొలుకుతూ కనపడే చిన్నారి ఎవ్వరనుకొన్నారు. నిర్మాకెమికల్స్ అధిపతి కర్సన్‌భాయిపటేల్ కూతురు నిరంజనాపటేల్. కర్సన్‌భాయి కొన్ని వేల రూపాయలతో, కొంతమంది మిత్రులతో కలసి స్థాపించిన నిర్మా కెమికల్స్ ఈనాడు కొన్ని వందల కోట్ల పెట్టుబడితో దేశవ్యాప్తమయిన వ్యాపారసంస్థ.

నిర్మావాషింగ్ పౌడరు తయారి మొదట చాలా చిన్నచిన్న స్థాయిలో జరిగింది. అప్పుడు ప్యాకెట్లుకూడా ఇప్పటిలాగా బాగుండేవికావు. వాషింగ్ పౌడరు ప్యాకెట్ బాగులేకున్నా ఆ కవర్ల మీద చిన్నారి బొమ్మను చూసి గృహిణులు కొనేవారు. మొదట్లో అమ్మాయిలు, గృహిణులు ఇల్లిల్లు తిరిగి నిర్మావాషింగ్ పౌడరు ప్యాకెట్లు అమ్మేవారు. క్రమక్రమంగా దీనికి గిరాకీ బాగాపెరిగింది. నిరంజనాపటేల్ 'నిర్మా బేబీ'గా అందరి నాలుకపై నాట్యమాడసాగింది. శుచిగా, శుభ్రంగా, కాంతులు విరజిమ్ముతూ కనపడే, నిర్మాబేబీ వల్లే తన అదృష్టం పండిందని తెగమురిసిపొయ్యేవాడు తండ్రి నిర్మాకెమికల్స్ అధిపతి కర్సన్‌భాయిపటేల్. కానీ కాలానికి కన్నుకుట్టింది; విధివక్రించింది.

నిరంజనా పటేల్ బంధువులతో కారులో. గుజరాత్‌లోని అంబాజీ చూడటానికి వెళ్లింది. మార్గమధ్యంలో కారు ఓచెట్టుకు ఢీకొని ఇద్దరూ అక్కడికక్కడే మరణించారు. నిరంజనాపటేల్‌కు తీవ్రమైన గాయాలు తగిలాయి. ఆసుపత్రికి తీసుకొని పోతూవుండగా దారిలో ఆమె మరణించింది. మరో ఇద్దరు కూడా దారిలోనే చనిపోయారు. బతికి బయటపడింది నిరంజనాపటేల్ అక్క పునీత మాత్రమే. ఈ ఘోరమైన ప్రమాదం జరిగింది 1987 అక్టోబరు 25వ తేదీ. కర్సన్‌భాయి పటేల్ కృంగిపోయాడు. టాయ్‌లెట్ సోప్, టూత్‌పేస్ట్, టాల్కమ్ పౌడరులు కూడా త్వరలో నిర్మాబేబీ బొమ్మతో మార్కెట్‌లోకి విడుదలకానున్నాయి. నిరంజనాపటేల్ కనుమరుగైనా నిర్మాబేబీగా ఆమె మన కళ్ల ముందు కనబడుతూ ఆనందం కలిగిస్తూ వుంటుంది.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

# సంగీత స్వర లహరి వింటూ సమయం గడపండి




మిరకిల్ ఐ
సౌండ్ సెన్సర్‌లో ఉంచబడిన సంగీత ధ్వని. మధ్య రాత్రిలో వినిపించదు.



సమయాన్ని సరిగ్గా గుర్తు చేస్తుంది
గంట-గంటకూ గుర్తు చేస్తుంది
అందరికీ ఆనంద పరుస్తుంది
నిద్రను భంగం చేయదు

ప్రతి 15 నిమిషాలకు వినిపిస్తుంది ¼ భాగం స్వరలహరి
ప్రతి 30 నిమిషాలకు వినిపిస్తుంది ½ భాగం స్వరలహరి
ప్రతి 45 నిమిషాలకు వినిపిస్తుంది ¾ భాగం స్వరలహరి
ప్రతి 60 నిమిషాలకు వినిపిస్తుంది పూర్తి స్వరలహరి
మరియు గంట ధ్వని.







**Ajanta®**
**QUARTZ**
the touch of tomorrow's technology


రిజిస్టర్డు ఆఫీసు :
పృథ్వీరాజ్ ప్లాట్, పో. బా. నం.: 115
మోర్వి 363 641
ఫోన్లు : 3627, 2280, 2457, 2433
టెలెక్స్ : 0187-212 ATCM
గ్రామ్ : VANITHA


KPS/AM/9-89-TEL









అన్ని ప్రముఖ దుకాణాలలో లభ్యం.

హెచ్చరిక : మా గడియారాలన్నిటిపైన "అజంతా" గుర్తు చూడండి. నకిలీలను గురించి జాగ్రత్త పడండి.

